# పీఠిక.

గోవర్ధనోద్ధరణము, సుధాసంభవము, నను చిఱుకబ్బములు నేనింతకు మున్ను కల్యాణీసుధామాసపత్రికాధిపతులు కోరఁగా రచించి యిచ్చితిని. అవి యొక్కొకటి సుమారేఁబది పద్యములు గలవి. అదే విధముగా వ్రాయఁ దలంచి ప్రారంభించిన భీష్మ-ఏకాదశీకథ గా పరిమితిలో నిముడక పొడిగిపొడిగి, తుదకు వేయి కంటె హెచ్చు పద్యములు గల యీ గ్రంథముగాఁ దేలినది. కథానాయకుని మరణముతోడి సమాప్తికి సమ్మతి లేక, ప్రభాసశాపవిమోచనముతో ముగించి దీనిని మంగళాంతము చేసితిని. అందుకొఱకు కావలసిన క్రొత్త కథను గొంత కల్పించుటయే కాక, ప్రబంధకవులకుఁ గల స్వాతంత్ర్యమును నిరంకుశముగా వహించి, సుప్రసిద్ధభారతకథ నచ్చటచ్చట మార్చుటకును నేను వెనుదీయ లేదు.

యోగసిద్ధికిఁ బ్రియసఖి యైన యుశీనరపతి కూఁతురు జితవతి నిమిత్తము వసువులగు ప్రభాసాదులు వసిష్ఠుని నందినీధేనువును దొంగిలించి, వసిష్ఠశాపము పాలయిరనుట భారతమందలి కథయే. జితవతీయోగసిద్ధులకుఁ జెలిమి యెట్లు కలిగినదో, నందినిని దొంగిలింప వలసిన యవసరమేల పొడమినదో, యీ దొంగతన మెట్లు జరిగినదో, యన్న విషయములు కల్పితములు. జితవతి గతజన్మమున గుర్వసి యగుటయు, సుపరంభతోఁ గలహించుటయు, శాపములు గాంచుటయు, నను విషయములు మాత్రమే కాక యీ పాత్రలును గల్పితములే. అట్లగుట, స్థూలకర్ణుని వివాహమును గూర్చిన కథతోఁ బాటు, వాఁడు మేనక కొడుకనుట యును గల్పితమని వేఱ చెప్ప నక్కఱ లేదు గదా!

స్థూలకర్ణుఁడను గుహ్యకుఁడు (యక్షుఁడు) శిఖండియై పుట్టె నని యొక చోటను, భీష్ముని మీఁది పగ సాధించుటకై యంబ శిఖండిగా జన్మించె నని యొక చోటను, భారతము తెలుపుచున్నది. స్థూలకర్ణుఁడు వసిష్ఠుని గోసంరక్షకుఁడుగా నుండి ప్రభాసునివలన మీసమును బోఁగొట్టుకొని పగ నీఁగుటకు సాంబశివుని గూర్చి తపస్సు చేసి యంబగా మొదటఁ బుట్టుటయు, వాని యంశమే రెండవ సారి శిఖండి యగుటయు, నంబరకేశుని వెంట్రుకల వరము గోరుటవలన శిఖి (శిఖండి) పింఛమువంటి కురులతో నతఁడు పుట్టుటచే నట్టి పేరొందుటయుఁ, గల్పితములు. "మగవేసము గల యాఁడుదానవే నీ," వని స్థూలకర్ణుని గూర్చి ప్రభావసంపన్నుఁడైన ప్రభాసుఁడన్న వాక్యమమోఘమై ఫలించినది. ప్రభాసుఁడు మానవజన్మమొందినప్పుడు నరుడు నరుఁడై యతనిని సంహరించుటకుఁ బ్రతిజ్ఞ చ్చేయుటయుఁ గల్పితమే.

కథకుఁ బ్రభాసుఁడు నాయకుఁడు; స్థూలకర్ణుఁడు ప్రతినాయకుఁడు. ప్రతినాయకుని ప్రథమావతారమైన యంబను విపరీతకాముకురాలినిగా మాత్రమే కాక నరహత్యను సంశయింపని పరమదుష్టాత్మురాలినిగాఁ జేసి, యామెచేత భీష్ముని బ్రహ్మచర్యదీక్షకు విషమపరీక్ష కల్పించుట భారతమున లేని విషయము. అంబికాంబాలికలను భీష్ముఁడు బలిమిని గొనితెచ్చి, తమ్మునికి వివాహము చేసె నన్న భారతకథ సందర్భానుసారముగా మార్పు చెంది, యా బాలికలు విచిత్రవీర్యుని స్వయంవరమున వరించినట్లిందు వర్ణితమైనది. అంబను సాళ్వుఁడు స్వయంవరమపుడే నిరాకరించె ననుటయు మార్పే.

మహాభిషుఁడు శంతనుఁడై జన్మింపఁగా గంగ యతనితోఁ గాఁపురము చేయుటయు, వసువులామె గర్భమునఁ బుట్టుటయు, బ్రహ్మశాపమును బట్టి మాత్రమే యని భారతమున నున్నది. పరమపవిత్రురాలైన గంగాదేవికి వ్యభిచారదోషమును బాపి యామెను నిష్కళంకనుగాఁ జేయుటకయి పరమేశ్వరునికి దక్షునివలన కలిగిన శాపమును గూర్చిన కథ కల్పితమైనది. అట్లే, పరాశరమహాముని వలన వ్యాసమహర్షిని గన్న సత్యవతీదేవి శంతనుని యోష యగుట దోషము గాదనుటకై యామె పార్వతి యనియుఁ, బరాశరుఁడు పరమేశ్వరాంశభవుఁడనియుఁ, దెలుపు కథ కల్పితమైనది. అట్లే, కుంతీమాద్రులు దేవేంద్రాదుల వలన సంతానము పడయుటకుఁ గశ్యపుని చెల్లెండ్రను గూర్చిన గాథ కల్పితమైనది.

ఇవి గాక, యౌచిత్యమును బాటించియు, రసమును బోషించియు, నేను గల్పించిన చిల్లర మార్పులు మఱి కొన్ని కలవు.

తనకుఁ గలిగిన శాపమును గూర్చి శంతనునితో గంగ చెప్పుటకు మాఱు, వసువులలో జ్యేష్ఠుఁడగు ధరుఁడు చెప్పును. శాపము పొందిన గంగను బ్రార్థించి వసువులామె గర్భమునఁ బుట్టుట గాక, బ్రహ్మశాసనమున వారట్లు పుట్టుదురు.

యమునాతీరంబున వేటలాడుచుం గ్రుమ్మరునప్పుడు గాక, పుత్రుని కొఱకు తగిన వధువును వెదకుటకుఁ బోయినప్పుడు శంతనుఁడు సత్యవతిని జూచి, మోహవశుఁడగును. ఆ కథ యంతయుఁ జమత్కారముగాఁ జెప్పుటకు విదూషకుఁడైన వికటశర్మ యొకఁడు కథలోనికిఁ గ్రొత్తగా వచ్చినాఁడు.

ఏకపుత్రకుఁడు, ననపత్యుఁడు, నొక్కరూపు గావున మరల వివాహము చేసికొందు నని దేవవ్రతునితో శంతనుఁడనుటకు మాఱు, సంతానార్థము మరల వివాహము చేసికొమ్మని దేవవ్రతుఁడే తండ్రితోఁ జెప్పును.

అంబికాంబాలికలు విచిత్రవీర్యుని స్వయంవరమున వరింపఁగా, వివాహములు హస్తిపురమునఁ గాక కాశిలో జరిగినవి. విడిది యింట నొంటరిగా నున్న భీష్ముని కడకంబ నడిరేయిని నిగూఢముగా నేగి, యతని బ్రహ్మచర్య దీక్షను

భంగపఱుచుటకనేకభంగులఁ బ్రయత్నించి, విఫలమనోరథ యగుటయే కాక, యతని వలనఁ దిరస్కారము గన్నది; కలహాశనుని సలహాను విని, పగ తీర్చుకొనుటకుఁ బూనుకొన్నది; మాతామహుఁడగు హోత్రవాహనుని సాహాయ్యమునఁ బరశురాముని పరిచర్య చేసి, దయ సంపాదించి, యతనిని భీష్ముని మీఁదికిఁ బురికొలిపినది. ఇది యంతయు భారతకథ కంటె వేఱువిధముగా నుండును.

భీష్ముఁడు స్వచ్ఛందమరణంబు వరంబుగాఁ గన్న వాఁడు. ఆ వరమతని కొసఁగినవాఁడు, తనకు రెండవ పెండ్లి చేసిన కొడుకుపై దయ వహించిన శంతనుఁడు గాక, సమ్మోహనాస్త్రమును మరలించి తనకు మరణము తప్పించిన శిష్యుని యెడలఁ గృతజ్ఞుఁడైన పరశురాముఁడు.

కన్యగా నున్న కాలమునఁ దాను కర్ణుని గన్న కథ కుంతి స్వయముగా మగనితోఁ జెప్పుకొన వలసిన యవసరము లేకుండ, నామెకు మంత్రోపదేశము చేసి యట్టి శక్తి కలిగించిన దుర్వాసుఁడు తద్వృత్తాంతము పాండురాజునకెఱిఁగించును. క్షేత్రజులను గాంచుమని పాండునకుఁ దెలిపిన వాఁడును దుర్వాసుఁడే.

అంగారపర్ణుఁడన్న గంధర్వుఁడర్జునునిచేత నిర్జితుఁడై, సఖ్యము చేసికొని, తన పేరు మార్చుకొని చిత్రరథుఁడయ్యెను. ఘోషయాత్రయందు దుర్యోధనాదులను జయించి వారిని బందీకృతులను జేసిన గంధర్వాధిపతి చిత్రసేనుఁడు. చిత్రసేనుఁడర్జునసఖుఁడని భారతమున నున్నను, జిత్రరథుఁడే యతఁడనుటకాధారము లేదు. ఘోషయాత్రాగంధర్వుఁడును జిత్రరథుఁడే యగుట మార్పు.

ద్యూతానంతరము ధృతరాష్ట్రుఁడనుజసహితుండైన యుధిష్ఠిరు రావించి, "నీ సర్వసంపదలు రాజ్యంబును నొప్పంగొనిపోయి యెప్పటియట్ల యింద్రప్రస్థంబున సుఖంబుండు," మని పంపివేసెను. పిమ్మట దుర్యోధనుని బలాత్కారమున ధృతరాష్ట్రుఁడు పునర్ద్యూతమునకు ధర్మనందనుని రప్పింపఁగాఁ, బితృనియోగమతిక్రమింపఁ గాదని యతఁడు తిరిగి వచ్చి, జూదమాడి యోడి, భార్యానుజులతో నరణ్యాజ్ఞాతవాసములు చేయ వలసి వచ్చినది. ఈ భారతకథ మార్పు చెంది, వెంటనే పునర్ద్యూతము జరుగుటకుఁ దగిన హేతువు కల్పితమైనది.

స్వపక్షమునకు నష్టకరముగా నిజవధోపాయము భీష్ముఁడే ధర్మజాదులకుఁ జెప్పినట్లు భారతమున నున్నది. దేవేంద్రుని పంపున నారదుఁడు వచ్చి తెలిపినాఁడన్నది మార్పు. ఆ మూలమున శిఖండి జన్మాదివృత్తాంతము వర్ణించుటకును వీలిచ్చినది.

పట్టాభిషేకానంతరము ధృతరాష్ట్రునకును బాండురాజునకును జరిగిన వివాహములు తత్పూర్వమే జరిగినట్లిందు మార్పు చెందినవి. కుంతి పాండురాజునకు స్వయంవరలబ్ధయైన భార్య; మాద్రి యట్టిది కాదు. ఇందుఁ దద్విరుద్ధముగా నున్నది. ఈ రెండును బుద్ధిపూర్వకముగాఁ జేసిన మార్పులు గావు; కేవల ప్రమాదజనితములు: ముద్రణము పూర్తియైన వెనుకఁ జూచుకొన్నవి.

ప్రమాదజనితములు మాత్రమే కాక యజ్ఞానమూలకములగు దోషములును బలు విధములయినవి యీ గ్రంథమందుండ వచ్చును. బెస్తలను గూర్చిన "గుడికేలు పైకెత్తి యెడమకేలను దొడ౯ బిగి గల్గఁ బుర్రతాళ్లు పేను వారు," అన్న వర్ణనము వాస్తవమునకు వ్యతిరేకమని తరువాతఁ దెలిసికొంటిని. ఆ పల్లెవాండ్రందఱును వామహస్తులన్న వితండావాదమునకు దిగక నా యజ్ఞానము నొప్పుకొని, "ఎడమకేల్ పైకెత్తి కుడికేలఁ గుడితొడ౯ బిగి గల్గఁ బుర్రతాళ్లు పేను వారు," అని మార్చుకొన వలసినదని సహృదయులను వేడుకొనుచున్నాఁడ. చిత్తునుండి యెత్తి సాఫు వ్రాయునప్పుడు, IV. ౬౦ లోఁ 'దెల్పిన', అనుటకుఁ 'దెల్పఁగ' అనియు, IV. ౧౪౩ లో 'మహోల్లాసంబు' అనుటకు 'మనోల్లాసంబు' అనియు, VI. ౧౫ లో 'సైన్యముల్' అనుటకు 'సేనలోఁ' అనియు మాఱి, యచ్చునఁ జొచ్చునవి. మొదటిదియుఁ జివరిదియు యతిదోషములు; నడుమది మతి మాలిన దుస్సంధిదోషము. తప్పొప్పులపట్టిక వేసినను జదువు వారుండరని యవి సిరాతో దిద్దుకొన్నాఁడను. గురువుగారు తప్పులు చేసి దిద్దుకొనుటకధికారమున్నది. ఇప్పటికిని నన్ను సెట్టిమాస్టరనియే యందురు! ఎన్ని కలవో, యిట్టివింకను? ఎట్టి దోషములున్నను మన్నించు భారము రసగ్రహణతత్పరులగు చదువరులది.

కథావస్తువు ప్రభాసశాపవిమోచనమగుటం జేసి, భీష్ముని జననము నుండి మరణము వఱకును గల కథ,—యనఁగా, ఆదిపర్వము మొదలుకొని యానుశాసనికపర్వము తుది వఱకును గల భారతకథ,—ముఖ్యాంశ మొక్కటియుఁ గొఱఁత పడకుండ సంగ్రహముగా దీనియందు గర్భితమై యున్నది. పాకశాస్త్ర పరిభాషతోఁ జెప్పిన పక్షమున, భారతకథ పూరణముగాఁ గల బూరె యిది: స్నేహసమ్మిశ్రితము చేసి యాస్వాదింప రసజ్ఞులను బ్రార్థింతును.

విశాఖపట్టణము,
3-6-1935

సెట్టిలక్ష్మీనరసింహము.

శ్రీ

# ప్రభాసశాపవిమోచనము.



## అవతారిక.

శ్రీ శ్రుత్యంగనలత్యపూర్వవచనశ్రేణిన్ నిజప్రాభవం
బశ్రాంతంబును సన్నుతింప ముదితుండౌ దేవుఁడుర్విన్ సమ
స్తశ్రేయంబులొసంగుచున్ మనుచుతన్ సాహిత్యసమ్రాట్టు శ్రీ
శ్రీ శ్రీవిక్రమదేవవర్మనృపతిశ్రేష్ఠుం గృపాదృష్టిమై॥ ౧

ఉ॥ శ్రీక్రియ రాధికారమణి చిత్తసరోరుహమాలయంబుగా
నాక్రమణంబు చేయ ముదమందెడి గోపవధూప్రియుండు, న
ర్మక్రియుఁ, డోముతన్ జయపురప్రభుఁడై నుతిగాంచుచున్న శ్రీ
విక్రమదేవవర్మపృథివీవిభునిన్ శుభముల్ ఘటించుచున్॥ ౨

మ॥ కరుణానవ్యమరందబంధురముగాఁ గం బొల్చి, భక్తాళిము
త్కరమౌ శ్రీహరిచిత్తమట్టిదియె పద్మంబౌటచేఁ బద్మమం
దిరయౌ నిందిర నంద రాని సిరులన్ నిండారఁగా నిచ్చి, యు
ర్వర శ్రీవిక్రమదేవవర్మనృపతిన్ రక్షించు నశ్రాంతమున్॥ 3

మ॥ హరుఁడైశ్వర్యములిచ్చుతన్, నలువ దీర్ఘాయుస్సు గల్గించుతన్,
స్థిర శ్రీవిక్రమదేవవర్మవరధాత్రీజానికిన్; దేవి శాం
కరి తద్దేవికొసంగుఁ గాతఁ జిరమాంగళ్యంబు; వాగ్దేవి దాఁ
జిరకాలంబు నటించుఁ గావుతను దజ్జిహ్వాగ్రరంగస్థలిన్॥ ౪

ఉ॥ ఇందఱికంటె ముందుగ గణేశుఁడు మామకవందనంబులం
బొంది, రసజ్ఞుఁడైన జయపూర్విభునిం దనియింప నేను జే
యం దొరఁకొన్న కార్యమునకడ్డులు గల్గకయుండునట్లు నా
యందుఁ గటాక్షమున్ నిలిపి, యా నృపుఁ బ్రోచుత నెల్లరీతులన్॥

వ॥ అని యివ్విధంబున నవ్వసుంధరాధినాథునకు సమస్తశుభంబులం గలిగింప నిష్టదైవంబులం బ్రార్థించి, భరతఖండంబున వింధ్యకు దక్షిణంబున నిషధవిషయంబని ప్రసిద్ధి గన్న దేశంబునం గల శ్రీజయపురంబును బరిపాలించుచున్న యన్నరపాలచంద్రముని వంశచరిత్ర మత్కృతశ్రీరామచంద్రదేవపట్టాభిషేకనాటకావతారిక యందున్న దానితోఁ గలిపి తెలిపెద॥ ౬

సీ॥ వేకువ నెవఁడుద్భవిలుఁ బద్మినీకాంత
పూర్వపుణ్యము నిండఁ బొడుపుఁగొండ,
నగపడకుండ మధ్యాహ్న వేళ ధరించు
నెవఁడు ఛాయాభామ హృదయసీమ,
సాయంతనపు సంజ సంధ్యామహాదేవిఁ
గూడుచు నెవ్వాఁడు క్రీడలాడు,
మునిముచ్చగుచు నెవ్వఁడొనరించె గౌతము
రమణితో నయ్యాట రాత్రిపూటఁ,
దలఁచుకొన్నంత నెవఁడు ప్రత్యక్షమగుచుఁ
గుంతికన్నెఱికంబట్టి కొల్లఁబెట్టె,
ధరణిజనులకెల్ల నతండు దర్శనీయుఁ
డై వియద్వీథిని వెలుంగు వేవెలుంగు॥ ౭

క॥ ఆ సూర్యుని వంశంబున
భాసిల్లిర నేకనృపులు భారతభూమిన్ :
వాసిని గనిరందున్ జ,
మ్మూసామ్రాజ్యమ్ము గన్న భూతలనేతల్॥ ౮

సీ॥ జమ్మూనృపాలవంశమ్మున ముఖ్యుఁడై
కనకసేనవిభుండు ఘనతకెక్కెఁ;
బొడమె నాతని వెన్క ముప్పదిరెండు త
రమ్ములకున్ గంభిరాజదేవు;

అతని రెండవ సుతుండగు వినాయకదేవు
కలలోన శ్రీకాశికావిభుండు
ప్రత్యక్షమై, "కుమారా, దక్షిణమున నం
దాపురి గలదు; తన్నగరమునకు
నరుగు," మన్న నతండు వింధ్యాద్రి దాఁటి
వచ్చి, యాపురిం జొచ్చి, తద్వల్లభుండు
మెచ్చి నిజపుత్రితో రాజ్యమిచ్చినఁ, వి
నాయకుండు నందాపురనాథుఁడయ్యె ॥ ౯

ఉ॥ వాసవవైభవంబునను వాసిగ ముప్పదిరెండు మెట్ల సిం
హాసనమెక్కి, యా పురమునందు వినాయకదేవు రాజ్యముం
జేసెను; నుత్కళేశుఁడగు శ్రీపురుషోత్తమదేవు గెల్చి, దు
ర్గాసతివిగ్రహంబతఁడు గైకొని తెచ్చెను తాకురాణిగాన్ ॥ ౧౦

తే॥ గీ॥ వరుసగ శ్రీగాకుళము, రాయవరము, భాస్క
లియును, బర్లాకిమిడి, యెల్లలయిన నడిమి
దేశమేలె వినాయకదేవు, తనదు
వంశమున దేవుపదమెల్ల వారుఁ బడయ ॥ ౧౧

చ॥ గొడుగును బట్టి బంధుజనకోటిని జేరిన వారలిర్వురె
ప్పుడుఁ దనుఁ గొల్వ, వారలకు భూపతియన్బిరుదంబుతోఁ బ్రియం
పడి గొలుగొండ యొక్కనికి, మాడుగులొక్కని, కిచ్చె దానమున్
నడ గల కల్పవృక్షము, వినాయకదేవుఁడు, శాశ్వతంబుగన్ ॥ ౧౨

తే॥ గీ॥ ఆ సరణి శిలావంశకన్యను వివాహ
మగుచుఁ, బదునేనవ శతాబ్దమందు నాథుఁ
డయ్యె నందాపురికి వినాయకనృపుండు:
మూలపురుషుఁడాతఁడు జయపురనృపులకు ॥ ౧౩

తే॥ గీ॥ విజయచంద్రుండు, భైరవవిభుఁడు, విశ్వ
నాథదేవుండు, బలరామనాయకుండు,

మఱి యశోవంతదేవుఁ, గ్రమంబుగాఁగ
క్షోణి నేలిరి, యొక్కొక్కసుతుని గనుచు ॥ ౧౪

తే॥ గీ॥ ఆ యశోవంతుని కుమారుఁడైన వీర
విక్రముఁడు వైరివినుతపరాక్రముండు :
తనకు నందాపురము రాజధానిగ నతఁ
డిష్టపడఁడయ్యె వంశాభివృద్ధిఁ గోరి ॥ ౧౫

సీ॥ నిజనృపాలకవతంసజయంబువలన న
న్వర్థమై నెగడె నేనగరి పేరు,
చెలఁగు నే పురికిఁ బశ్చిమదిశ సాగర
సమము జగన్నాథసాగరంబు,
ఏ వీటి కోట కట్టెదుట శ్రీరామచం
ద్రస్వామి పూజలు నడుచుచుండు,
ఠాకురాణి యనంగ రవణిల్లు నెచటి దు
ర్గమున భర్గునిరాణి కనకదుర్గ,
అట్టి జయపురమ్మునకు రాజ్యమ్ము మార్చి,
పొట్టునూరుభోగాపురమ్ముల వఱకును
దనదు రాజ్యంబు వ్యాపింప ధరణి నేలె
వీరవిక్రమదేవు, సద్విధుల రావు ॥ ౧౬

మ॥ అనిలోనన్ మును వీరవిక్రముఁడు బాహాశక్తిచే గోలకొం
డనవాబుం దనియించి, కేతనము, ఖడ్గంబున్, మహారాజలాం
ఛనసంధాయకతామ్రశాసనమునున్ సాధించి తాఁ గైకొనెం,
దనకీర్తిప్రతతుల్ దిశావితతికిన్ ధావళ్యముం గూర్పఁగన్ ॥ ౧౭

క॥ ఆ వీరవిక్రముని సుతుఁ
డై వెలసెను కృష్ణదేవుఁ; డతని తనూజుం
డౌ విశ్వంభరదేవు శ్రీ
రావనినాథులకు వేల్పుటానై వెలసెన్ ॥ ౧౮

సీ॥ కురుపాము సన్యాసిదొరకు నొసంగెను
వైరిశల్యుండన్న పేరితోడ;
మేరంగి నొసఁగెఁ గూర్మిని శత్రుశల్యుఁడ
న్న బిరుమతో జగన్నాథదొరకు;
ఒగి దక్షిణకవాటయువరాజుఁ జేసి, త
మ్మన్నదొరకొసఁగెం బాచిపెంట;
ఆంధ్ర ప్రతాపరాయఁడటన్న బిరుదంబు
తోడను గారయదొరకొసంగె;
నొసఁగె వేఁబాక్క దొరకు సాలూరిని బొళి
యాకొసింహమన్బిరుదుతో; నటుపయి, నొక
కోదు విల్కానికొసఁగెఁ బాల్కొండఁ గృప న
రేంద్రరావని విశ్వంభరేశ్వరుండు॥ ౧౯

వ॥ మఱియుఁ బెద్దపదము, రామభద్రపురము, మక్కువ, చెముడు, పాలెము, బిరుకోట, పోరాము, రంగవలస, కోడూరు, శంబర, బొండపల్లి, కలహండి, బింద్రనొవొగొడా, ఖడియాల, యను జమీాల నేర్పఱిచి విశ్వంభర దేవు తన యాశ్రితుల కొసంగి, వారి వలనం గప్పంబులం గొనుచు, సేనలతో వారు తన్ను సేవింపఁ, బ్రమథంబునఁ బ్రమథగణపరివేష్టితుండగు పరమేశ్వరుండనఁ బరిఢవిల్లుచుండెఁ : దజ్జనకుండు కృష్ణదేవేర్పఱచిన దేవుపల్లి, రేకపల్లి, సరవ, కొట్టక్కి, జమీాందారులతోఁ గలిసి మొదటి విశ్వంభర దేవు కాలంబున సామంతరాజులిరువదినలుగురు॥ ౨౦

చ॥ అతని యనంతరంబతని యట్టులె రాజ్యము చేసె సర్వస
మ్మతముగఁ దత్సహోదరుఁడు మల్లకమర్దనకృష్ణదేవు : తత్
క్షితిపతి ఘోరసంగరము చేసి ఫరాంసుచమూసమూహముల్
హతమొనరించి, కైకొనె స్వయంబుగ వారి శతఘ్నికాతతిన్॥ ౨౧

సీ॥ అమ్మానవేంద్రుని తమ్ములు హరిదేవు,
బలరామదేవు, నృపాలురైరి;

బలరామవిభుతనూభవుఁడైన రఘునాథ
కృష్ణదేవటుమీఁద నృపతియయ్యెఁ;
కృష్ణథాత్రాజునకిచ్చె నాతఁడు శత్రు
సంకటంబైన బిసంకటకము ;
ఆ మహీశు సుతుండు, రామచంద్రవిభుండు,
సంగమవలస నిశ్శంకబిరుదు

తో నొసంగెను దన యాశ్రితుని కొకనికి ;
రామచంద్రు తమ్ములు, బలరామదేవు,
మఱియు విశ్వంభరుండు క్రమంబుగాఁగఁ
బ్రభుతఁ గొనిరి నారాయణపట్టణమున॥ ౨౨

వ॥ రెండవ విశ్వంభరదేవరాజమండనుని నిజాము నిజామూల్య మిత్రునిగా గ్రహించి, 'ఆజెం మహారాజా, యుజాదుద్దౌలా, మహాభటస్సార్, యదల్·యమీనయ్, సల్తానత్ సమసమెయ్ ఖిల్లాపతి ఇస్లాం, శ్రీఝూడ్ఖండ్ భాదుషా, జయపూర్ సర్కార్' అను బిరుదులొసంగె: నాఁటినుండి శ్రీజయపురాధీశులు తద్బిరుదంబులు ధరియింతురు॥ ౨౩

సీ॥ పిమ్మట నాతని తమ్ముఁడైనట్టి లా
లాకృష్ణదేవు పాలనము చేసె ;
అటువెన్క నాతని యనుజన్ముఁడైన వి
క్రమదేవు వచ్చెను రాజ్యమునకు :
రాజధాని మరల శ్రీజయపురి నెల
కొల్పి, యాతండటఁ గోటఁ గట్టె ;
మలకనగిరి యొద్ద గెలిచె ఫరాసుల
తోఁ గూడి వచ్చిన తురకబలము ;
అమరకోటఁ మరాటీల హతమొనర్చె ;
బస్తరుకు సాయపడి, కోటపాడు, పోర

ఘరును, జురుచుండయును, రాయఘరును, నమర
కోటయును, వారివలనఁ గైకొనె నతండు॥ ౧౪

సీ॥ అతని పుత్రుండు, రెండవ రామచంద్రదే
వు, సకలాశ్రితబాంధవులకు లావు :
కోట్పాడు కడ నెదుర్కొన్న మరాటి వీ
రుని, రామచంద్రవాఘును గెలిచి, య
తండు బ స్వరుసితధ్వజముఁ గైకొనెఁ ; బూస
పాటి విజయరాముఁ బద్మనాభ
మున గెల్చు దొరతనంబునకుఁ దోడ్పడె ; నవ
రంగపురమ్మొ నొసంగె ననుజు
తనుజుఁడైన నృసింహదేవునకు ; మఱియు
మంత్రి యని, వీరవరతోద్రమల్లుఘాట
రాజు బిరుదుతో బెల్లాముజ్యమిచ్చెఁ
బాత్రుఁడైన జగన్నాథపాత్రునకును॥ ౧౫

సీ॥ ఆయన సుతుఁడు, ద్వితీయవిక్రమదేవు,
ప్రాభవశౌర్యధైర్యముల ప్రోవు ;
నాగన్నదొరయు, సన్యాసి భూపతి, లిమ్మ
చంద్రదేవుండు, లక్ష్మన్నదొరయు,
శానథాట్రాజును, ఘోసనిగ్గియు, బొళి
యారొసింహుఁడు, ముఖివీరభద్ర
రాజును, మొదలైన ప్రజలు గావించు పి
తూరీలలోపల దొరతనంబు
వారలకుఁ గుడిభుజమయి వఱలుచుండెఁ ;
దనదు వంశంబులోని యొక్కనికినామొ
సంగెఁ గరుణతోఁ గల్యాణసింగుపురము
ధిర ! మహారాజు విక్రమదేవతండు॥ ౧౬

సీ॥ అతని నందనుఁడు, మూఁడవ రామచంద్రదే
వు, సుశీలతరువునం బూచు పూవు:
గుణుపురంబెల్ల గగ్గోలు గావించిన
సవరల యల్లరి సవరచేసె;
బస్తరు తొందరల్ విస్తరింపని మోస్త
రునను బందోబస్తులను ఘటించె;
రాసి జంపము పెట్టు రంపపితూరి యి
బ్బందులం బాప సిబ్బందులంపె:
దొరతనమువారికెపుడు నిక్కరణిగాఁగ
సాయపడి, సప్తమెడ్వర్డుచక్రవర్తి
గారిచే గౌరవంబును గాంచె రామ
చంద్రదేవమహారాజు, సాంద్రయశుఁడు॥ ౨౭

ఉ॥ భూవిభుఁడయ్యెఁ దత్సుతుఁడు, మూఁడవ విక్రమదేవు: నిల్పె నిం
ద్రావతిమీఁద వంతెనను; రాజపదంబునకున్ మహాపదం
బీవలఁగాంచె; దానములనేకములాతఁడు చేసి, కే. సి. ఐ.
ఈ. వరనామమొంది, నుతికెక్కెను సాటి నృపాలకోటిలో॥ ౨౮

క॥ హరి ముమ్మాఱు రాముండై,
ధర నాలవ మాఱిటులవతారము గనె నం
దురు విక్రమదేవసుతు, న
దిర! నాలవ రామచంద్రదేవుం గనుచున్ ౨౯

తే॥ గీ॥ ఆయనయె కృతిభర్త మదీయరచిత
మైన శ్రీరామచంద్రపట్టాభిషేక
నాటకమున; కాతఁడు మరణంబు లేత
ప్రాయమునఁ గనె విధిదుర్విపాకముననుు ౩౦

క॥ రెండవ విక్రమదేవుని
రెండవ పుత్రుండు సరిగఁ గృష్ణుఁడు కృపఁ; జం

ద్రుండు కళలఁ : గాన, జగ
న్మండలమునఁ గృష్ణచంద్రనామము దాల్చెన్॥ 31

సీ॥ సద్భక్తి నాకృష్ణచంద్రదేవప్రభుం
డీశ్వరునిం దన హృదయమందు
ధ్యానించి, మారేడు దళముల మూడు తే
కులను బంచాక్షరిని లిఖయించి
పూజఁ గావింపఁ, దత్పూజాఫలంబుగాఁ
గలిగె రేఖాంబికాగర్భశుక్తి
మౌక్తికఫలమయి మహిని శ్రీవిక్రమ
దేవవర్మవరుండు, ధీగురుండు,

పదునెనిమిదివందల యిఱువదియుఁ బొమ్మి
దవదయిన క్రీస్తవశకాబ్దమాటకు సమ
మైన శుక్లసమః జ్యేష్ఠమందు బహుళ
పక్షమునఁ జతుర్థీరవివాసరమున॥ 32

వ॥ షష్టిపూర్తియైన మఱి రెండేండ్లకు శ్రీవిక్రమదేవవర్మప్రభుండు జయపురరాజ్యవిభుండయ్యెఁ : బ్రాజ్యగుణగరిష్ఠుండగు నా రాజ శ్రేష్ఠుని మూలమున రాజ్యంబు పూజ్యంబయ్యెఁ గాని, రాజ్యంబు మూలంబున నాత్మ్మాతలనేతకు నూతనపూజ్యత లభింప లేదనుటకుఁ దత్పూర్వమిర్వదై దేండ్ల క్రిందటనే యొకానొక సందర్భమున నేను రచించిన పంచరత్నములు నిదర్శనములు॥ 33

తే॥ గీ॥ యాచకుండయి యడుగుల నాక్రమించెఁ
ద్రిజగములను ద్రివిక్రమదేవుఁడు మును :
యాచకులఁ బ్రోచి, కీర్తిచే నాక్రమించెఁ
ద్రిజగములను శ్రీవిక్రమదేవవర్మ॥ 34

తే॥ గీ॥ బహిరరాతులమీఁదఁ గోపంబుఁ జూప
కెంతొ మేల్చేసి, యంతైన నంతరరుల
మించ నీక యణఁచి విక్రమించె ననుటఁ
దెలుపుఁ బేర శ్రీవిక్రమదేవవర్మ॥ ౩౫

తే॥ గీ॥ కవిజనుల నాదరించుటే కాక, తానె
కవిత స్వయముగా బహునిరాఘాటముగను
రచనమొనరింప నేర్చి, విక్రమనరపతి
తేవ వెలసె శ్రీవిక్రమదేవవర్మ॥ ౩౬

తే॥ గీ॥ గర్వపడుటకుఁ దగిన భాగ్యమును, బ్రజ్ఞ,
ఘనతయును, దనకున్నను గర్వపడఁడు :
క్షత్రియుండయ్యు నిట్టి విక్రమమయిన మ
తిం దనర్చె శ్రీవిక్రమదేవవర్మ॥ ౩౭

తే॥ గీ॥ తేజమునఁ జేసి మిత్రుఁ బాధించి, విష్ణు
భక్తుఁడగుటచే నరికి సద్భక్తి మ్రొక్కు :
విక్రమంబిది యని కవుల్ వింతగా ను
తింతురెపుడు శ్రీవిక్రమదేవవర్మ॥ ౩౮

వ॥ అభినవవిక్రమార్కుఁండైన శ్రీవిక్రమదేవవర్మభూపాలుండు ముప్పది
రెండు మెట్లు గలిగి సాలగ్రామసహితమైన శ్రీజయపురసింహాస
న మధిష్ఠించినప్పుడు నేను రచించిన నవరత్నములలో రెండు
చిరత్నసంప్రాప్తరాజ్యంబునకుఁ దదర్హతం దెలుపఁ గలవు॥ ౩౯

సీ॥ పరిశుద్ధశాంతస్వభావుఁడీతఁడు శత్రు
జనులను శిక్షింప జరకు ననియొ,
నిత్యసత్యవ్రతాన్వితుఁడీతఁడు రాజ్య
తంత్రముల్ నడుపఁగాఁ దలఁకు ననియొ,
సతతనిగర్వసంచారి యీతఁడు రాచ
ఠీవిని జూపింపఁ బోవఁడనియొ.

పరమవైరాగ్యసంపన్నుఁడీతఁడు భోగ
ములయెడ విముఖతఁ బూను ననియొ,

జయపురీరాజ్యలక్ష్మి మురిసి జంకి, జంకి,
యిపుడు దిటవూని, నినుఁ బొందెఁ గృష్ణచంద్ర
దేవపుత్ర, శ్రీవిక్రమదేవవర్మ
ధారణీకళత్రా, పవిత్రసుచరిత్ర॥ ౪౦

సీ॥ భావబంధురముగాఁ బద్యగద్యములతోఁ
గవితఁ గూర్చి, మనంబు కరఁచ నేర్చు;
సముచితసరసవచఃప్రసంగంబులం
గలఁతను దీర్చి, సౌఖ్యంబమర్చు;
ఇంగితంబులెఱింగి, యీప్సితంబుల నెల్ల
నీడేర్చి, మదికిసి హితముఁ గూర్చు;
దోషంబులోనరింప రోషంబుఁ బొందక
యవ్వి యెల్ల నోర్చి, భయంబు దీర్చు:

రసికుఁడితఁడంచు జయపురరాజ్యలక్ష్మి
యెంచి, యెంచి, వరించె నిన్గృష్ణచంద్ర
దేవపుత్ర, శ్రీవిక్రమదేవవర్మ
ధారణీకళత్రా, పవిత్రసుచరిత్ర॥ ౪౧

వ॥ అపరబృహస్పతి యగు శ్రీవిక్రమదేవవర్మనరపతికి భారతీతీర్థము వారు. సాహిత్యసమ్రాడ్బిరుదమొసంగిరి; ఆ దానరాధేయుని వలన వత్సరలక్షలందుచున్న యాంధ్రవిశ్వవిద్యాలయము వారిటీవల నదే యర్థము గల 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' అను బిరుదము నిచ్చిరి: రాజేంద్రుని పేరును బిరుదును మొదటి యక్షరములుగాఁ గల సీసపద్యములు రెండును, సాహిత్యసమ్రాట్టునకు సాహితీసమ్రాట్టు రూపాంతరమగుట నయ్యది చేర్చిన శార్దూలవృత్తములు మూఁడును, మద్రచితములఁ బొందుపఱిచెద॥ ౪౨

సీ॥ శ్రీ కృష్ణచరణవారిజమధులిట్టు, దీ
నార్థిబంధరములకంబురుట్టు,
విద్యాధనమునకు విరివియా కొట్టు, క
విప్రకాండమునకు వేల్పుఁజెట్టు,
క్రమమైన నడవడికి మనికిపట్టు, సు
స్థిరధైర్యమునకుఁ బసిండిగట్టు,
మనుజసంఘమునకెల్లను దలకట్టు, సౌ
శీల్యసంపత్తికిఁ జివరిమెట్టు,
దేహమూను కట్టు, సాహిత్యసమ్రాట్టు,
వచనములఁ ద్రిశంకుపట్టి జట్టు,
వక్రతలకుఁ బెట్టు, విక్రమదేవవ
ర్మనరరాట్టు, మను విరాట్టు నట్టు॥ ౪౩

సీ॥ సాటిగాఁ జెల్లు భోజనృపాలునకుఁ గృష్ణ
దేవరాయలకు నే కోవిదుండు,
హిమధామమల్లికాసుమదామసమమై జ
గమ్ములఁ గ్రమ్మె నే ఘనుని కీర్తి,
త్యజియింపఁ బోదాశ్రయముఁ గోరి వచ్చిన
జనముల నే దయాశాలి చేయి,
సత్యశౌచాదులౌ సద్గుణంబులకేమ
హాత్ముని మానసం బాటపట్టు,
మానుపాటు బృహస్పతిప్రముఖులకును
గలుగఁ జేయు నేప్రభుని యఖండధీప
టుత్వ, మావిభుండుండు నిందుగ ధరఁ జిర
జీవుఁడగుచు శ్రీవిక్రమదేవవర్మ॥ ౪౪

శా॥ శ్రీమ్రోలన్ బహుళప్రభావయయి వాక్సీమాటి కమ్రోక్తి, "న
త్త్రా, మ్రొక్కుల్! సిరులీవు, విద్యలను నే,నర్పింతమిమ్మెంటి," కం
చామ్రేడింపఁగఁ జేసె నే ఘనుని విద్యాభూతి యా సాహితీ
సమ్రాడ్విక్రమదేవవర్మనృపుఁడశ్రాంతంబు వర్ధిల్లుతన్॥ ౪౫

శా॥ "ఆమ్రస్వాదుకవిత్వమిద్దివిను రాజా," యన్నఁ దామ్రాక్షులున్
ధూమ్రాక్షుల్ గద యాదురన్యధరణీంద్రుల్ పెక్కు? "రీరాజు జే
జేమ్రాఁ!" కంచు నుతింతు రేవిభు విపశ్చిద్వర్యు, లా సాహితీ
సమ్రాడ్విక్రమదేవవర్మనృపుఁడశ్రాంతంబు వర్ధిల్లుతన్॥ ౪౬

శా॥ ఉమ్రావుల్ బలెఁ బేరు గన్న కవులేమో కాని, టప్పాలునున్
టుమ్రీల్ చెప్పెడి వారలే సుకవిరాట్టుం గాంచి వాకట్టు పా
లై మ్రాన్పాటుగనన్, భయంబుడుపు సౌమ్యాకార, మా సాహితీ
సమ్రాడ్విక్రమదేవవర్మనృపుఁడశ్రాంతంబు వర్ధిల్లుతన్॥ ౪౭

వ॥ జనకసన్నిభుండగు నా రాజర్షిపై నిన్ని విధంబులైన ప్రాస్తావిక పద్యంబుల నేకంబులు రచియించియు, మద్విరచితమైన చిత్రమాలికలను గ్రంథము నంకితమిచ్చియుఁ దనివి సనక, సనక జనకసన్నిభప్రతిభుండైన యా ప్రభుని యాస్థానకవినై యాంతరంగిక కార్యదర్శినై యుండుటంబట్టి కలిగిన చనవునఁ దదాజ్ఞ గాని యనుజ్ఞ గాని ముందుగాఁ బొందకయే, దృఢనియమంబున నా రాజపరివృఢుని బోలు భీష్ముని చరితంబు రసభరితంబగు నేతత్ప్రబంధంబుగా రచించి॥ ౪౮

* ప్రమత్తకోకిల॥ *ప్రభాసశాపవిమోచనంబు ప్రబంధమొండు రచించితిం
ప్రభూ! వినంగను జిత్తగింపుఁడు : బాగుగా నది యున్నదం
చు భావవీథినిమీఁకుఁ దోఁచినచోఁ, గృతిన్ గ్రహియింపుఁడీ
విభున్ మహోక్కరునిన్ వరింపక వేదు మత్కృతికన్యకన్॥ ౪౯

వ॥ అని విన్నవింప నెప్పటి దయ చూపున నా ప్రార్థనంబునకు సమ్మతించిన యారాజవిబుధేంద్రునకభ్యుదయపరంపరాభివృద్ధిఁ గోరుచు, సభక్తితాత్పర్యంబున నీ ప్రబంధంబు సమర్పించుచున్నాఁడ॥ ౫౦

* ఏకోనవింశతిచ్ఛందంబగు నతిధృతియందు 1,86,038 వదిగా నేర్పడిన వృత్తమునకుఁ బ్రమత్తకోకిల యని పేరు పెట్టితిని. దాని లక్షణము :

ప్రమత్తకోకిల యౌను జభ్రసబద్ధజాగలఁ గూర్ప; వి
శ్రమంబు నిల్పఁగఁ జెల్లు ద్వాదశసంఖ్యవర్ణమునందు : లే
క, మత్తకోకిలకాది నొక్కల గల్పి కూర్చిన నేనియున్,
సమంబుగా నది తేలి, మిక్కిలి చక్కనౌ నవవృత్తమా॥

జభరసజజగ—IUI, UII, UIU, IIU, IUI, IUI, U—12యతి.

శ్రీ

# ప్రభాసశాపవిమోచనము.

## I

శ్రీరమణీసుకుమారకు
మారుఁడయిన మారుఁడను భ్రమం గొల్పెడి సిం
గారం బెసఁగంగా గం
గారమణీయతరతీరకాననభూమిన్॥ ౧

క॥ ఒకనాఁడు హస్తినాపురి
యెకిమీఁడు, విరోధినృపతివృషభంబులకున్
ముకుఁద్రాడు, శంతనుఁడు, వే
డుకకాఁడును లేక యొక్కఁడుం జనుచుండన్॥ ౨

చ॥ నది తనువంది వచ్చెనో యనం దగు మచ్చున మెచ్చుగొల్పుచు
న్నది, విరిదమ్మి వంటి వదనమ్మును గల్వల వంటి కన్నులు
న్నది, తనుకాంతిపూరము వనంబునకింపు ఘటింప నింపుచు
న్నది, నవయౌవనంబునఁ దనర్చిన చిన్నది యొ త్తు కన్పడెన్॥ 3

తే॥ గీ॥ అమలశృంగారరసపూరమందు మునిఁగి
తేలునట్టులు శంతను దృగ్వితతికి
ననిమిషత్వంబు నొదవించినది నది యని
తెలుప వలయునే వేఱె సుధీవరులకు?॥ ౪

క॥ అంత నుడురాజముఖి దెస
వింత నుడుగకున్న కనుల వీక్షించుచు, నా
శంతనుఁడు కొంత తడవా
చెంత నుడువులేని లేనిస్థితి నిలుచుండెన్॥ ౫

ఉ॥ వాలికకన్ను తెప్పలను వ్రాల్చి, మొగమ్మొకకొంత వ్రేల్చి, కెం
గేలఁ బయంటకొంగు పయికిన్ బిగలాగుచు మోముఁదమ్మికిన్
మేలిముసుంగొనర్చుకొని, మేను ముడుంగఁ గలంగుచున్న యా
బాల తెఱంగుఁ గన్గొని, త్రపంగని, యా నృపపుంగవుండనెన్॥ ౬

మ॥ "అతివా, నా విరసత్వమున్ సయిఁపు; లోకాతీతమౌ తానకీ
నతనూరూపవిలాసవిభ్రమకళల్ నా నాల్కకున్ లేని మూఁ
గతనంబుం గలుగంగఁ జేసె; మఱి, నా కన్దోయికిన్ లేని మో
టుతనంబున్ ఘటియించెఁ: గేవలవనాటుంగాఁగ నన్నెంచితో?॥ ౭

భుజంగప్రయాతము॥ వనాటుండఁ గా; నింద్రవాస్తవ్యమౌ హ
స్తినాపట్టణంబేలు శ్రీమంతుఁడన్, శం
తనుండన్: ఘనుండౌ ననంగుండొకండే
ననుం గెల్చె నీ ప్రాపునం గోమలాంగీ॥ ౮

ఉ॥ ఓడితి నన్న నాన మది నూనక యుమ్మరువానఁ బూని, నీ
కూడిగముల్ సదా సలుపుచుండెద; నింతటి దన్కనెన్నఁడుం
జేడెలతోడ స్నేహమును జేసిన వాఁడను గాను; నేలపూఁ
బోఁడి యొకర్తెయే సవతిపోరికి నుండును నీకు నాకడన్॥ ౯

చ॥ ఎవరితవీవు, నీదు కులమెయ్యది, నీ గుణమెట్టిదన్న యా
వివరణమేమియున్ వలదు; వేశ్యవు కావని తీరుఁ బట్టి, క
న్యవనుచుఁ ద్రాడు నీదు గళమందు కనంబడకుంటఁ బట్టి, ని
క్కువముగ నే నెఱింగితిని: గొంకక నిన్నుఁ బరిగ్రహించెదన్॥ ౧౦

క॥ దేవేరివగుచు నాకిల
నీవేరికి లేని సుఖము నీవే సఖి, నీ
వే వేఱొకఁ జేసినచోఁ,
జావే రిపుతుల్యుఁడైన స్మరుమూలమునన్॥" ౧౧

శా॥ ఈ రీతిన్ వచియించు శంతనుని మోమిందిందిరశ్రేణి య
ట్లే రాణించెడి ఘోరచూపులను దానీక్షించుచున్, సుస్మితాం

కూరంబుల్ పవడంపుమోవిపయిఁ దళ్కున్ముత్తెపుంగోవ గాఁ
గా, రాజాసవ తేనెసోనగములొల్కం బల్కె నీతీరునన్॥ ౧౨

శా॥ "రాజా, మీ రసికత్వసంపదకు నే రంజిల్లితిన్; మీరిటుల్
నా జన్మాదులెఱుంగఁగోరమి మహాశ్లాఘ్యంబు; నన్గూర్చి యీ
యోజన్ మీరలు నమ్ముచున్నయెడ మిమ్ముద్వాహమై సర్వసా
ధ్వీజాలంబున నోజబంతి నయి రక్తిన్ భక్తియుం జూపెదన్॥ ౧౩

ఉ॥ దోషము నేనొనర్చినటు తోఁచిన నేనియు, మీరలెన్నఁడున్
దూషణమాడఁ జెల్లదు నన్; మఱి, నాకడ దానిఁగూర్చి సం
భాషణమాడ రాదు; పొరపాటున మీరటులాడిరేని, భవ
త్పోషకవర్గమున్ విడిచి పోయెదఁ జెప్పక చేయకుండఁగన్॥ ౧౪

మ॥ ఇది మీ రొప్పెదరేని జెప్పుఁ; డటు కాదే, నింక మీ దారి మీ
యది, నా దారియు నాది, యన్న సతితో నాధారణీశుండు, "త
ప్పిదమీవెట్టిది చేసినన్ సరియె నిన్ బృచ్ఛింపఁబో," నంచు నొ
ప్పుదలం బొంది, యథావిధిం గొనియె నప్పుణ్యాంగనన్ దేవిగా॥ ౧౫

చ॥ శయనగృహంబులన్, విమలసైకతభూముల, శైలసానుసం
చయముల, నిష్కుటంబులఁ, బ్రశస్తనికుంజములన్, యదృచ్ఛ రే
యియుఁ బవలంచు నించుకయు నెంచక చంచలగాత్రిఁ గూడుచుం
బ్రియమున శంతనుండు గడిపెం బ్రథమాబ్దమభీష్టకేళులన్॥ ౧౬

క॥ గర్భమొదవె సతికిఁ; బతికి
నిర్భరముదమొదవె; నెలలు నిండంగా, నా
విర్భవమయ్యెను జక్కని
యర్భకుఁడొకరుండు; నాఁటి యద్దమరేయిన్॥ ౧౭

చ॥ ప్రసవగృహంబునం బసిఁడి ప్రమ్మిదలోపలి దీపమెంతయో
యసదగు నట్లుగా నలిపి, యచ్చటి మంత్రసానికున్ నా
రసి, సడిచప్పుడున్ వినఁగ రాని తెఱంగునఁ బాన్పు డిగ్గి, క్రొ
న్నిసువును గేలఁ బట్టుకొని, నెమ్మదిగాఁ బురుటాలు పిమ్మటన్॥ ౧౮

చ॥ తలుపొకకొద్దిగాఁ దెఱచి, దాని మఱుంగునఁ దొంగిచూచి, పై
నలికిడి లేకయుంటఁ గని, యందెలు చప్పుడు గాని యట్లుగా
వెలువడి, యెట్టులో తుదకు వీథిని బడ్డదియై, బిరాన తె
క్కలు గలదాని యట్టులరుగంగఁ దొడంగెను ముందుచూపుతో॥

మ॥ కిటికీలోపటినుండి శంతనుఁడు పైకిం బోవు నాకాంత నం
తట వీక్షించి తటాలునం బయనమై, తానామె వెంటన్ హుటా
హుటిగా నేగుచు, "నిట్టి యర్ధనిశియందొక్కర్తె బాలెంతరా
లెట, కేలా చనుచున్న? దీతెగువచే నేచేటు పాటిల్లునో?॥ ౨౦

ఉ॥ ఆఁపుదునా? చనం దగదటంచును నా కరమాపె మూఁపుపై
మోపుదునా? స్వతంత్రముగఁ బోవుట స్త్రీలకుఁ గూడదంచు బి
ట్టూఁపుదునా? ప్రతిజ్ఞ చెడునో? చెలి సన్నెడఁబాసి పోవునో?
యోపుదునా తనున్ విడిచియుండఁగ నొక్కనిమేషమేనియున్?"॥

క॥ అని డోలాందోళనమొం
దిన డెందమునందు నీగతిం దలపోయం
గను, బోటి యంతలో వీ
టిను సూటిగ దాఁటి యేటిచెంకికిఁ జనియెన్॥ ౨౨

క॥ "ఏటికి నీవిటు వచ్చితి
వేటికి నని యడుగ, విడిచి యేఁగును: నాకున్
బోటికి ఋణానుబంధము
నేఁటికి సరి," యనుచు నృపుడు నెవ్వగతోడన్॥ ౨౩

ఉ॥ చూచుచునుండఁ, బాల్కడలిఁ జొచ్చిన లచ్చి యనంగ నాత్మసం
కోచము గాని జంకు మఱి కొంకును గాని యొకింత లేక, స
ర్వోచితకార్యమున్ సలుపుచున్నదియున్ బలె నప్పుడామృగీ
లోచన యేటిలోన దిగి, లోతునకుం జన సాగెఁ దిన్నగన్॥ ౨౪

ఉ॥ చల్లని యేటిగాలికిని జప్పన మేల్కొని కావుమన్న యా
పిల్లని యేడ్పు గుండెలు గుభేలన శంతనుఁడాలకించి, మేన్

జల్లుమనంగఁ, బాదములు సాఁగక, నోటను మాటరాక, చూ
డ్కుల్లవలేశమేనిటునటుం గదలింపక నిల్చె బొమ్మయై॥ ౨౫

క॥ మొలబంటి నీటిలో నా
కలకంఠి బుడుంగుమనఁగఁ గన్నసుతుని, గ్రొ
న్నెలవంటి బాలు ముంచి, మ
రల నింటి మొగంబుఁ బెట్టి రయమునఁ జనియెన్॥ ౨౬

తే॥ గీ॥ ఎగువ ప్రాణంబులెగువకే యెగిరినట్లు
నీటియంచునఁ జూచుచు నిలిచియున్న
శంతనునికయ్యెఁ; నారీతిఁ గొంత తడవు
తెలివి తప్పి, యాతఁడు కనుల్ తెఱచి చూడ॥ ౨౭

ఉ॥ చుక్కల నీలిదుప్పటి ముసుంగున ముచ్చముడింగి, ప్రాణులన్
మెక్కుటచే నజీర్ణరుజ మిక్కుటమై పొరలాడుచున్న పెన్
రక్కసి పోలె నే, ఉడుగణంబుల నీడలతోడ, నెక్కుడౌ
నక్కలిపిండుతో, నతిభయంకరమై కనిపించె నన్నిశిన్॥ ౨౮

ఉ॥ గట్లను బారులై నిలిచి, గాలికిఁ గొమ్మలు సంచలింపఁగాఁ
జెట్లు కనంబడెం, దమదు చేతుల బిట్టుగ నూఁపుకొంచుఁ, జీ
కట్లను మంటలన్ వెడలఁగ్రక్కుచు వచ్చెడి భూతసంచయం
బట్లు, మిణుంగురుంబురువులాకులసందున మిన్కుమిన్కనన్॥ ౨౯

మ॥ "కలయా, లేకిది నిక్కమా ? కలయెయౌఁ; గాకున్నచో, నట్టికో
మలి ఘోరంబగు నిట్టి కార్యమొనరింపం గల్గునే ? నిద్రలో
పలనే న్నేఁ దిరుగాడి యాడి, యిట స్వప్నంబందు నేమేమియో
తలయుం దోఁకయు లేనియట్టి యతిచిత్రంబుల్ విలోకించితిన్"॥ ౩౦

చ॥ అని యిటు లేనిపోని యడియాస మనంబునఁ బెట్టుకొంచు శం
తనుఁడు మహారయాస్పదపదంబులతోఁ బురుటిల్లు చేరి క
న్గొన, నటఁ బొత్తులన్ నిజతనూజుని జాడయు లేకయుండెఁ; గా
మిని తనపాన్పునుండి మెలమెల్లగ లేచి, యెలుంగు రాల్పడన్॥ ౩౧

మ॥ "హృదయేశా, దయచేయుఁ; దర్భకుని నేఁడే నేటి పాల్సేసితిన్ ;
బ్రదుకన్ వానికి, వానిఁ బెంప మనకుం, బ్రాప్తంబు లేకిట్టియా
పద పాటిల్లెను; గర్భశోకమిది యబ్బా! యబ్బ! నాకున్ భరిం-
పఁదరంబే!" యనిభర్తపైఁ బొరలఁగ, బాష్పంబుల్ మెయిన్ నించుచున్॥

ఉ॥ ఏమియుఁ దోఁచ, కావసుమతీశుఁడు మాటయు మంతి లేక, యా
భామిని బాష్పవారిఁ బయిబట్ట చెఱంగున నద్ది, ముంగురుల్
మోమునఁ జక్కదిద్ది, నునుమోవిని ముద్దును బెట్టె: ముద్దుతో
నే మతి దప్పి, యా సతిపయిన్ నిలిచెం బతిప్రేమ క్రమ్మఱన్॥ ౩౩

ఉ॥ కాన్పును గన్న దాని వలెఁ గాక నిజంబుగఁ గన్నకైవడిం
గన్పడుచుం, దనున్ మొదటికంటెను మించిన యింపుసొంపులం
దన్పడు తన్విఁ దన్వియమి నాథుఁడు రేయిపవల్గఁ గూడుచుం
గాన్పుననుండి డిగ్గుటయె మానెను రెండవ వత్సరంబునన్॥ ౩౪

సీ॥ మృదువైన చానసమ్మేనుఁ గేల స్పృశించి,
మనసు కఠినమన్న మాట మఱచె;
స్వచ్ఛంబులైన జవ్వనినవ్వులం గాంచి,
మలినహృదయ యన్న మాట మఱచె;
నమృతంబుఁ గురియు తొయ్యలిమోవి చవి చూచి,
మది విషమయమన్న మాట మఱచెఁ;
దేటలై తోఁచెడి బోటిమాటలు విని,
మాయలాడి యటన్న మాట మఱచె;

ననవరతసౌఖ్యవారాశియందుఁ దన్ను
ముంచి తేల్చుచు నున్న యామోహనాంగి
కోర్కులెట్టు తీర్చి సౌఖ్యంబు గూర్తు నన్న
చింత నుండు నెల్లప్పుడున్ శంతనుండు॥ ౩౫

క॥ మరలను గర్భంబొదవెను
దరుణీమణి; కామె మరలఁ దనయుని గాంచెన్ ;

మరల జలమ్ముల ముంచెఁ గొ
మరునిన్ ; మరలఁ దనవరుని మరులున ముంచెన్॥ 3౭

ఆ॥ వె॥ అమృతరసపు బుగ్గలై రత్నమాణిక్య
ములను బోలు ముద్దులొలుకు సుతుల
నేఁటికొక్కరునిగ నేడుగురం గని,
యేటి పాలు చేసె నింతి యకట!॥ 38

క॥ ఎనిమిదవ యేఁట మరలం
గనకాంగికి విధివశమున గర్భంబొదవెన్ :
దినమణిని గర్భమునఁ దా
ల్చిన ప్రాగ్దిశ యనఁగ సతి వెలింగెం గాంతిన్॥ 3౯

క॥ వేవిళ్లుదయంబై, మ
న్నే వనిత తినంగఁ దొడఁగె : నిటుపైఁ దనకున్
భూవిభు కూటమి తగ్గుం
గావున, సవతి పయి నుండగాఁ దగదనియో ?॥ 3౯

శా॥ భర్తృప్రేమయుఁ బోలె వృద్ధి గని గర్భంబింత యంతౌచు సం
పూర్తింబొందఁగ, దానిమోసికొనుచుం బూఁబోఁడి లేఁగాను దా
నార్తిం బొందక గొప్పదై ప్రబలె, శూన్యావస్థ తన్నాయఁగాఁ :
గర్తవ్యమ్ మహదాశ్రయమ్మనెడి వాక్యమ్మారకే పోవునే ?॥ ౪౦

మ॥ అమలంబౌ నునుజిల్గుపుట్టమును హెచ్చైనట్టి కుచ్చెళ్లతోఁ
గమనీయంబుగఁ గట్టి, చుట్టుఁ దనకుం గైదండకై దండనే
ప్రమదల్ గుంపుగ రాఁగ మెల్లనదుచుం బల్మాఱు తానాఁగుచున్,
సుమనారాచుని గుమ్మటమ్ము కరణిం జూలెంత రాలయ్యెడన్॥ ౪౧

మ॥ నవమాసంబులు నిండినట్టి పిదపం దన్వంగి, కుచ్చస్థితిన్
రవిముఖ్యగ్రహపంచకంబును, జతుర్థానన్ బుధుండుండఁ, బూ
ర్ణ విధున్ రాహుశనుల్ దగుల్కొన, ధనుర్లగ్నంబునన్ సూనుఁడు
ద్భవమయ్యెన్ నవభానుఁడై శుభముహూర్తంబైన కాలంబునన్॥

తే॥ గీ॥ అష్టమగురుస్థితియుఁ, దృతీయతనుపతుల
యుచ్చగతియు, నాయుష్కారకోచ్చముఁ గని,
పాపనికిఁ బరమాయువు పట్టె నంచు
దృఢముగ వచించిరచటి జ్యోతిషుకులెల్ల॥ ౮౩

ఉ॥ ఆయువు పట్టె బాలకునికన్న నుడుల్ విరినట్టి ధారణీ
నాయకుఁ, డానితంబిని యొనర్చిన సప్తకుమారవర్గహ
త్యాయతఘోరకార్యనిచయంబుస్మరించుచు నట్లె యీసుతుం
జేయకమానునే ? యనుచుఁజిత్తమునందుభయంబునొందుచున్ ॥

సీ॥ "అడుగుదునా, నిర్దయం గన్నబిడ్డల
నేటి పాల్చేసితివేటికంచుఁ ?
గడుగుదునా కాళ్లు కన్నీళ్ల, నీ పుత్రు
నేనియు బ్రతుకఁగా నిమ్మటంచుఁ ?
దొడుగుదునా జాలి విడిచి సంకెలల, నీ
విలువీడి వెడలఁగా వలదటంచు ?
నుడుగుదునా యింక యువతితోఁ జొందు, నీ
యిచ్చ వచ్చిన చోటికేగుమంచు ?
నెలఁత నెడఁబాసి ప్రాణముల్ నిలుపఁ గలనె ?
సుతుని బలవంతపుంజావుఁ జూడఁ గలనె ?"
యంచు మఱునాఁటి పగలెల్ల నమితమైన
వంత నుండు నెల్లప్పుడున్ శంతనుండు॥ ౮౪

ఉ॥ "ఈయెలనాగ మానవిగ నెట్లుగ నమ్ముట ? రక్తపానముం
జేయు పిశాచి యేమొ ? పెఱచేడెల మోవులకింతకావి యు
న్నే ?" యని యెంచుశంతనుని కెల్లెడ నెత్తురె తోఁచు, సంజకెం
జాయలు రక్తవర్ణమున సర్వజగంబున నిండె నంతటన్ ॥ ౮౫

తే॥ గీ॥ కాలకాంత తాఁ గడుపునఁ గన్నయట్టి
దివ్యతేజస్సమేతు నాదిత్యుని గొని

పోయి పశ్చిమవారాశితోయములను
ముంచె, దిగులుతో రాజు వీక్షించుచుండ॥ ౪౭

ఉ॥ చాన మనస్సు గాఢతమసంబు గతిన్ మలినంబటంచు భూ
జానికిఁ దోఁచి, యాపిదప సర్వజగంబు తమోమయంబుగాఁ
గానఁగ వచ్చెనో యనఁగ గాఢతమస్సు జనించి, కంటికిన్
భూనభముల్ సమానముగు పోలికగా నొనరించె నెల్లెడన్॥ ౪౮

చ॥ నునుచిఱునవ్వు వెన్నెల గనుంగవకింపుగ నింపు ముద్దు మో
మును గలయట్టి యా మెఱుఁగుఁబోఁడి కళంకిని యెట్లొ యన్న శం
తను మదిలోని సంశయమణంగఁగఁ బూర్ణసుధాంశుబింబమ
ల్లన నుదయించె, లోపటి కళంకము స్పష్టముగాఁ గనంబడన్॥ ౪౯

శా॥ సూనుం బ్రాణము దీయునేమొ సతి యంచుం జూడ్కు లల్లాడఁగా
మేనెల్లం గనులైన శంతను గతిన్, మిన్నెల్ల నక్షత్రసం
తానంబాఁచుఁ బ్రపంచమప్పుడలరెన్, ధర్మేతరుల్ హత్యలే
వేనిం జేయుదురంచు వేగనులతో వీక్షించుచున్నట్లుగన్॥ ౫౦

సీ॥ "పొత్తున భోజనంబును నేఁడు చేయుదు,"
నంచు, నచ్చోటనే యారగించి,
"రమ్ము, తాంబూల చర్వణమొనర్త," మటంచు
పీఁట మచ్చోటనే వేసికొనియు,
"నిది నీవు వింటివా? యది వింటివా?" యని
యున్నవి లేనివి యూసులాడి,
"నిదుర రాకున్నదిన్నిశి నేటికో?" యని
యచ్చోట దిండునఁ గానుకొనియు,

నిట్టిగతి నెపముల నెన్ని యేని బన్ని,
ప్రొద్దు గ్రుంకినంతటినుండి పురుటిగదిని
విడిచిపోకుండఁగ మకాము వేసి, కాంత
చెంత నుండు భయంబుచే శంతనుండు॥ ౫౧

తే॥ గీ॥ కొమ్మ కదలంగ దడదడఁ గుండె కదలు ;
లేచు లేవఁ బోఁ, బ్రాణముల్ లేచి చనును ;
నెలఁత నిలువగాఁ, నూపిరి నిలిచిపోవు ;
శంకతో నామె దెసఁ గను శంతనునకు॥ ౫౨

ఉ॥ అంతట నర్ధరాత్రసమయంబున మంచముపైఁ బరున్న యా
కాంత ముసుంగొకింత తొలఁగన్ మెలమెల్లనె కూర్మముఁ బలెం
గొంత శిరంబు నెత్తి, తళుకుంగనులన్ గదియెల్లఁ జూచుచుం,
జెంతనె కూరుచుండి తన చేష్టలఁ గాంచుచు నున్న కాంతునిన్॥ ౫౩

ఉ॥ చూచెను ; జూచియుం, బయికిఁ జూడని యట్టులుగా నటించుచున్
లేచెను ; బొత్తులందుఁ బవళించిన బాలకు వంక హస్తముం
జాఁచెను ; జంటిపాపలను జంపి భుజించెడి శక్తి కైవడిం
దోఁచెను, వింతతో వెఱపుతోఁ గనుచున్న నృపాలు కంటికిన్॥ ౫౪

ఉ॥ "ఆఁ!" యని కేక వేయఁగఁ బ్రయత్నమొనర్చినయట్టియాక్షమా
నాయకు నోటి వెంబడిని నాదము వెల్వడి రాదు ; లేవఁగాఁ
బోయినఁ, గాళ్లు రావు ; మఱి పోవలదంచును సన్నచేయఁగాఁ
జేయియు రాదు : చూపె నిలిచెం జెలిచర్యల నెల్లఁ జూచుచున్॥ ౫౫

క॥ ఆలో నాలోలాక్షి ని
జాలోకనపాళి విభుని యాస్యము మీఁదన్
నీలోత్పలతోరణముల
చాలో యన నిలిపి, తనయుఁ జంకను గొనియెన్॥ ౫౬

చ॥ కొని, "కొనిపోవుచుంటి నిదిగో! నను నడ్డు తలంపు మీకు నె
మ్మనమునఁ గల్గెనేని యనుమానము మానుచు నడ్డిచూడుఁ," డం
చును దనుఁ బిల్చుచున్నటులు చూచుచు సుందరి నిల్చె, మందహా
సనిలయమైన కన్నుఁగవ చాటున నక్కిన వెక్కిరింతతో॥ ౫౭

చ॥ కొడుకును జంకఁ బెట్టుకొని కొన్ని పదంబులు పోయి, యచ్చటన్
మెడ నిటు త్రిప్పి శంతనుని మీఁదను దృష్టులు గ్రుమ్మరించుచున్,

నడకలయందు మందత గనంబడ గుమ్మము చేర నేగి, య
క్కడనొకకొంతయాఁగి, పతి గన్గొనఁ గా సతియిల్లువెల్వడెన్॥ ౫౮

తే॥ గీ॥ కరచరణముఖనిఖిలాంగకములయందుఁ
జలనమొక్కింతయును లేని శంతనుండు,
మంత్రమునఁ గట్టువడు వాఁడు మంత్రబలము
తొలఁగ నెట్లానొ యట్టులే తెలివి గాంచి॥ ౫౯

చ॥ కడువడి లేచి, చీఁకటులు గ్రమ్మి కనంబడకున్న కన్నులుం,
బుడమిని మోవకున్న పదముల్, తడియాఱిన నాల్కయున్, దడా
దడమనుచున్న గుండెయును, దద్దయుఁ గంపిలుచున్న మేనునై,
పడుచును లేచుచున్ వెడలె భామిని పోయినదారిఁ బట్టుచున్॥ ౬౦

చ॥ తన కనుచూపుమేరఁ, దిలదానము పట్టిన యట్టి వైఖరిన్
వెనుకకుఁ జూడకుండ నతివేగమునం జనుచున్న కామినిం
గనుఁగొని, యవ్విడన్ భయము కాళ్లకు లేనిరయంబొసంగఁగా
జనపతి యేగి, యేట దిగు చాన కరంబును బట్టె గట్టిగా॥ ౬౧

ఉ॥ లేమ వెఱంగపాటు లవలేశముఁ జూపక నిల్చి, మెల్లగా
మోమును ద్రిప్పి భర్తమొగముం జలియింపక చూచె, "మీరలా?
యేమిటు వచ్చినారు? నను సిప్పటికడ్డఁ దలంపు గల్గెనా?
యోమగరాజ!" యంచడుగుచున్నటు స్పష్టములైన దృష్టులన్॥

క॥ గమనావేగమ్మున నో
ట మాటరాకతఁడు తల్లడపడుచు నటులో
క్క ముహూర్తమట నిలిచి, గొం
తు మరల విడినంత నింతితో నిట్లనియెన్॥ ౬౩

మ॥ "అకటా! యేమిది? యెందునైనఁగలదా యన్యాయమీరీతి? దొ
క్కొకపుత్రుం గని యేటిలోపలను ఱాయో అప్పయో యన్న పో
లికగా నేడ్గుర నీవు ముంచితివి జాలిన్ మాని యోపుత్రఘా
తుకురాలా! యటుచేయ నీకెటులు చేతుల్ వచ్చెనో చెప్పుమా॥ ౬౪

శా॥ పుత్రప్రేమ సమస్తజంతువులకుం బూర్ణంబొ, లేశంబొ, యీ
ధాత్రిన్ సాజముగాఁగ నుండు: జగమంతంబొందకుండంగ నీ
సూత్రంబున్ భగవంతుఁ డేర్పఱిచె నంచుం జెప్ప వచ్చున్; మహా
చిత్రంబై కనుపట్టె నీచరితమో సీ గోముఖవ్యాఘ్రమా॥ ౬౫

మ॥ బలితంబౌ క్షుధచేత బాధపడుచున్ బాలెంతరాలైన బె
బ్బులియే తాఁగనినట్టి పిల్లలను జంపుం: గన్నులం గానమిన్,
నెలవున్ వీడఁగ లేమి, నట్టులది వానిన్ మ్రింగు; నీకేమి యాఁ
కలి, గర్భంబునఁ గన్నబిడ్డలను మ్రింగంగా? మహాభూతమా॥ ౬౬

శా॥ ఉన్మాదంబు గలట్టి దానవని నేనూహింతునో యన్న, నా
కున్మోహంబు ఘటించు నీ చతురవాక్యాల్ వెఱ్ఱిలోఁ గల్గునే?
జన్మింపంగనె జాలిమాలి సుతులం జంపంగ నీమానసం
బిన్మో, వజ్రమొ, యంతకంబె దృఢమా నేలోహమో? మోహినీ॥

మ॥ అనపత్యస్థితి దిట్టయై తిరుగు గొడ్రాలేనియున్ నోరు మా
లిన లేఁబాపలఁ గాంచినంతటనె జాలిం బూని, ముద్దాడి, లా
లనముం జేయును: నీవయో! సుతుల నేలా కంటివో పుత్రఘా
తిని? నిన్నుంగనఁ గాటిసత్తివను సందేహంబు గల్గెన్ మదిన్॥ ౬౭

శా॥ రాకాశీతమయూఖబింబము గతిన్ రాజిల్లు నీమోము న్నో
రాకాసీ! కని, నీ మనస్సమృతపూర్ణంబంచు నే నెంచుచుం,
గాకోలప్రతిమానమంచు నెఱుఁగంగా లేక నీ కేల న
య్యో! కీల్బొమ్మటులుంటిఁ బుత్రకుల నీవొక్కొక్కనిం జంపఁగన్॥

శా॥ లోపంబుల్ గలయట్టి పిల్లలనె తల్లుల్ ప్రేమతోఁ బెంపఁగా,
రూపంబందు సమస్తరీతులను మారున్ మీఱి యున్నట్టి నీ
పాపల్ కన్నులు నీకుఁ గుట్టెరఁటవే? పాపాత్మురాలా, మదీ
యాపత్యంబగు వీని నేన్ బ్రతుక నిమ్మా, వంశమున్ నిల్పఁగన్॥

మ॥ ఇనునిం బోలె వెలుంగు వాఁడు, పరిపూర్ణేందుండునుం బోలెఁ జ
ల్లనివాఁడున్, మరురూపు వాఁడును, గులాలంకారుఁడై యుంటక

త్యనుకూలుండగు వాఁడు, సర్వజనాహ్లాదప్రదుం: డట్టి వీ
నిని బోకార్పక నాకొసంగు; మిదిగో, నీకాళ్లకుఁ బ్రమ్మొక్కెదన్"॥

వ॥ అని యేకథాటిని। ౭౪

ఉ॥ ఆపగ యానకట్ట తెగ, నాఁపఁగ రాకెటుగాఁగఁ బాఱునో
యాపగిదిం బ్రతిజ్ఞయను నడ్డును గిడ్డను ద్రోసివేసి, ధా
త్రీపతి కోపతాపములు తీవ్రతరంబుగ నప్పుడట్టి వా
గ్రూపమునన్ బయల్వెడలి కొమ్మపయిం బడె నొక్కయుమ్మడిన్॥

చ॥ తెలివ మఱొండు పల్కక, "ప్రతిజ్ఞ! ప్రతిజ్ఞ! ప్రతిజ్ఞ!" యంచుఁ గ్ర
చ్చఱఁ దనచేయి లాగుకొని, చాపము వెల్వడు తూపుఁ బోలెఁ జె
చ్చెఱఁ జని యేటిలోనఁ బడి, చిన్నికుమారునితోడఁ గూడ న
త్తఱి మఱి లేవదయ్యెఁ; బతి తత్తరమొందుచు నుత్తలంబునన్॥

క॥ హా! హా! హా! యను కేకల
తో హా స్తద్వయము గన్నదోయి నునిచి, స
మ్మోహనమహాస్త్రమున బలె
దేహస్మృతి దప్పగా క్షితిఁ మూర్ఛిల్లెన్॥ ౭౫

ఉ॥ క్రమ్మఱఁ దెల్వి వచ్చి పతి కన్నులువిచ్చి కనుంగొనంగ, నం
గమ్ముల రంగునన్ వసువు గల్గఁగఁ జేయుచునున్న వారు, వ
క్త్రమ్ములనుండి వచ్చు వసుకాంతిని సూర్యుని బోలువారు, దై
వమ్ములనంగఁ దగ్గ మగవారొకయేడ్గురు జాలిచూపులన్॥ ౭౬

క॥ జనపతి నెమ్మోము గనుం
గొనుచు; నతనిఁ జుట్టుముట్టి కూర్చుండిరి, చ
ల్లని తమ కరములతో నె
మ్మి నతని మేనెల్ల మెల్లమెల్ల నిమురుచున్॥ ౭౭

ఉ॥ ముప్పదియేండ్ల యీడు గల మూర్తులతోడ సమాన దేహులై
యప్పురుషుల్, కనిష్ఠుఁడితఁడంచును జ్యేష్ఠుఁడితండటంచునుం

జెప్పగ రాని వారయిరి : జ్యేష్ఠుడొ వేటొకరుండొ తేనియల్
చిప్పిలునట్టి వాక్యములఁ జెప్పఁగ సాగెను తేనికీగతిన్॥ ౭౮

వ॥ “నిరంతరధర్మచింతనుండవగు నో శంతనుండ! చిరంతనంబగు చింత నుండి స్వాంతంబు వేఱుపాటు గావించి మా యుదంతంబు నేరుపాటుగా నాలింపుము : నన్ను ధరుండందురు ; ధ్రువసోమనహోని లాగ్ని ప్రత్యూషులన నీయార్వురును బేర్వడసిన వారు ; సంఖ్యను బట్టి సప్తమహర్షులమని మము భ్రమింతువేమో ? ప్రభాకరనిభ ప్రభావిభాసుండగు ప్రభాసుండను వానితోఁ గలిసి మేమష్టవసువులము ; పితామహుం బితామహుఁగాఁ గల ప్రజాపతి నిసువులము ; పుత్రవత్సలుండగు మా తండ్రికి మేమసువులము : ఆ విధమున మే మతనిం బంచప్రాణమాత్రయుతులగు నితరులకంటె నధికతరుని గావించితిమి ; మా యందఱిలోను గడపటి వాఁడని ప్రభాసుని మీఁద మా జనకునకుఁ బ్రేమ యెక్కువ ; మాకును వానిమీఁద హెచ్చు మక్కువ॥ ౭౯

మ॥ వినియేయుందువు రాజ, యంగిరు మహావిఖ్యాతి ; యా ఖ్యాతి యా
యనకుం గల్గుట బ్రహ్మమానససుతుండౌటం గదా ? పుట్టె నా
తనికిం గూఁతురు యోగసిద్ధి యన : నేతత్కన్యబుద్ధిక్ నుతిం
ప ననావశ్యకమా : బృహస్పతికి నప్పద్మాస్యతోఁబుట్టివే। ౮౦

ఉ॥ వేగనులున్న వాఁడు పదివేల కనుల్, పదివేల కన్నులం
దాఁ గల వాఁడు లక్షనయనంబులుఁ, గోరుచునుందురామె మై
బాగును బాగుగా నరయు భావమునం! బిత చేసికొన్నదా
యోగము సిద్ధిపొందియె సముద్భవమొందెను యోగసిద్ధిగా॥ ౮౧

తే॥ గీ॥ యోగ్యమగు బుద్ధి గలదని యోగసిద్ధి
ననుమతించె: గోడలిగ మా జనకుఁ : డిఁకఁ బ్ర
భావసంపన్నుఁడంచుఁ బ్రభాసుఁ దనకు
నల్లునిగ నియ్యకొనియె నయ్యంగిరసుఁడు॥ ౮౨

ఉ॥ పత్నిగ యోగసిద్ధిని ప్రభాసునితో జతగూర్చుటన్న, స
ద్రత్నముఁ బైఁడితోడ రుచిరంబుగఁ గూర్చుటయే : చిరత్నమా
యత్నము చేసి, దంపతులయందనుకూలత కెల్లవారలున్
నూత్ననిదర్శనంబుగఁ గనుంగొన బ్రహ్మయె కూర్చె వారలన్॥ ౮౩

ఉ॥ పెండిలినుండి మెండుగను బ్రేముడి వారికి మానసంబులం
దొండొరులందు నెక్కుడగుచున్న కతంబున నొండొకళ్ల నె
న్నండు ముహూర్తమాత్రమయినన్ విడనాడక వారు దేహముల్
రెండును బ్రాణమొండు నను రీతిగ నుండిరి నిండుకూరిమిన్॥ ౮౪

క॥ ఛాయయుఁ బ్రభాకరుండన,
జాయయును బ్రభాసుఁడొక్క సమయమునందున్
ద్యోయానంబునఁ బైనం
బై, యాననములను మందహాసము లొలయన్॥ ౮౫

ఉ॥ పోయెడివారు, దృష్టులను భూమికి దించి కనుంగొనంగ, నే
దో యొకయూరు మిన్నొరయుచున్న సమున్నత సౌధపంక్తితో
నా యమరావతీనగరమో యలకాపురమో యనంగఁ గ
న్దోయికి విందు సేయుచు, మనోహరమై కనిపించె వారికిన్॥ ౮౬

లయగ్రాహి॥

వే విధములైన పువ్వుఁదీవెలకు, నందమగు
పూవులకుఁ, గమ్మనగు తావులకుఁ, దేనెల్
ద్రావు నెలతేంట్లకును, మావులపయిన్ మధుర
రావము సదా సలుపు కోవెలలకుం దా
వై, వలపుఁదెమ్మెరలతో వెలయుచున్న సర
సీవితతికెల్లపుడుఁ దావలమునౌ కే
ళీవనిఁ బురంబునకు నావలి దెసం గనిరి
యా విబుధదంపతులు భావములు పొంగన్॥ ౮౭

చ॥ తరళతటిల్లతల్ జలదతండములోఁ బొడసూపు వైఖరిం
దరువుల నీడలన్ సుమవితానము గోయుచు సంచరించు సుం
దరులను గొందఱం గనుచు, దంపతులింపు జనింపఁగా వసుం
ధరకును డాపుగా దిగిరి తద్వచనశ్రవణాభిలాషులై॥ ౮౮

## వృషభగతి రగడ॥

"మానిని, కనుఁగొనుమా, యీ మల్లియ
నీ నెమ్మోనికి నిజముగఁ దల్లియ ;
ఇల నీ నగవులు, నీ విరవాదులు
తెలియఁ గదే, వాదిప్రతివాదులు ;
ఆకుల చాటున నదిగో, మంకెన :
నీ కెమ్మోవికి నెలఁతా, జంకెన ?
కలవిచ్చుటఁ జక్కని కుందమ్ములు
పొల్కతీ, నీ రదములకుం దమ్ములు॥ ౮౯

## మధురగతి రగడ॥

కోయుదము రంపు కలిగొట్టులను జెట్టులను :
బోయుదము నిండుగను బుట్టలను దట్టలను ;
వనిత, యిచ్చట సిందువారములపారములు;
తనరు నచ్చటను మందారములు తోరములు ;
మరునికై గ్రుచ్చు నవమాలికల మాలికలఁ :
బరఁగు నే విరులు శేఫాలికల పోలికల ?
నవల, కనుఁగొనుమ్మ, పున్నాగముల నాగముల :
నవి కోయఁ గలమే మహాగముల పూగముల?॥ ౯౦

## హయగతి రగడ॥

ముగుద, యా సరసీతటంబున మ్రోయుచున్నవి గండుతేఁటులు :
మొగముఁజూపకు, కమలమనుకొని మూఁగుఁజుమికోటానుఁగోటులు;

సంపెఁగలు గోసినవె చాలుం, జాలు : మితి గలదఁట వె యాసకు!
సొంపు నింపుచు నా సుమంబులె సుమి సమంబులు నీదు నాసకు ;
దురితమని భయపడక త్రుంపుఁడు దొరకినంతకు మీరు ననలను:
మరునికరమున శరములై యవె మాటిమాటికిఁ జంపు మనలను ;
"పడఁతులారా, రండు, మనవాప్రక్కకిప్పుడు పోయి తెత్తము
జడలలోపలఁ దుఱుముకొనుటకుఁ జాలు గొజ్జఁగిపూలమొత్తము" ॥

చ॥ అని తమలోనఁ దారు పరిహాసపు మాటల నాడుకొంచుఁ, జ
క్కని పలుచాలు తోఁపఁగఁ బకాపక నవ్వుచుఁ, బువ్వ లేఱఁగాఁ
జనుచును, గెవ్వుమంచు, నిటు జవ్వనులవ్వని నివ్వటిల్ల, నొ
య్యన దిగిరప్పుడాస్థలమునందుఁ బ్రభాసుఁడు యోగసిద్ధియున్ ॥

ఆ॥ వె॥ మింటిమీఁదినుండి మెఱుపును మొగులును
బోలె, నాలుమగలు భూమికి దిగఁ,
దమకు నబ్బురంబుఁ దబ్బిబ్బుఁ గలిగి బి
బ్బోకవతులు మూఁగమూఁక యైరి ॥ ౯౩

మత్తకోకిల॥ మూఁగి యీగతిఁగాఁగ నయ్యెడ మూఁగలా నెలనాగలన్
యోగసిద్ధి ప్రియంబునంగని, "యోసతీమణులార, సు
స్వాగతంబును మాకుఁ దెల్పక సందియంబున మీరలీ
లాగునన్ నిలుచుంటిరేటికి, లజ్జ పొందుచు నిందఱున్ ?॥

ఉ॥ లజ్జను గాంతురంచును దలంపక యించుక కల్గి యున్న, నీ
వజ్జకు నేనియున్ దిగక పైపయినే చనియుందు! మిట్టి వా
రిజ్జగతీనివాసులని యిప్పుడు మా కెఱుఁగంగ వచ్చె ; యో
షిజ్జనులార, పోయెదము, స్వేచ్ఛగమీరిఁక నాటలాడుఁడీ" ॥౯౪

క॥ అని పలికి కాంత తన కాం
తునితో, "నిఁక మనము మనదు త్రోవఁ జనుద," మం
చును లేవఁ బోవ, నొక యం
గన పరుగున నరిగి యధికగౌరవబుద్ధిన్ ॥ ౯౫

ఉ॥ ఆ పువుఁబోఁడి పాదములు హస్తయుగమ్మునఁ బట్టియాఁపి, "య
మ్మా, పొరపాటువచ్చెను, క్షమన్ సహింపుఁ; మమానుషంబులౌ
రూపులతోడ మీ రిరువురున్ దిగి కన్నులవిందు చేయఁగాఁ,
జూపఁగఁ దగ్గ గౌరవము చూపకయుంటిమి మిమ్ముఁ జూచుచున్॥

క॥ రం; డీవితర్దికం గూ
ర్చుండుఁడు; విసరెదను బూవుసురఁటిని: మీరల్
మెండుగ నలసితి", రని యా
యండనె నిలుచుండి, యన్న యట్లు సలుపుచున్॥ ౯౮

క॥ "ఓ యమ్మలార, మీరే
లా యూరక నిలిచి యుంటి?" రని తన వారిన్
డాయంగఁ బిలిచి, యచ్చటఁ
జేయూఁపులఁ గూరుచుండఁ జేయుచు, నందున్॥ ౯౯

ఉ॥ హంసలగుంపులోని కలహంసిని బోలిన యొక్క కన్య వా
మాంసమునందుఁ జేయునుచి, "యమ్మ, సురాంగన, యీకుమారికో
త్తంసము మానృపాలసుత; తత్పరిచర్యను మేము రక్తమున్
మాంసము పెంచుకొంటిమి సుమా; యనుమానము లేదు దీనికిన్॥

క॥ చెలికత్తెలఁగాఁ బనిక
త్తెలమగు మమ్మెల్లగతులఁ ద్రిప్పుకొనుటె కా,
కలివేణి యక్కలుగన్ మఱి
చెలియంద్రుగఁ జూచుకొను విశేషప్రేమన్॥ ౧౦౦

క॥ అతిధన్యుఁడగు నుశీనర
పతికీకన్యక దుహిత, స్వభావమహిత, ని
ర్జితరతి రూపమునందు, వి
జితసతి సౌభాగ్యమందు, జితవతి పేరన్॥ ౧౦౧

ఉ॥ ఓ కమలాక్షి, మీరు సురలో? పెఱలో? యెవరైన నేమి? మీ
రాక నవోత్పలంబునకు రాక యెటో యచె

తోకుతుకంబు గొల్పె నని యుజ్జ్వలమై వెలుఁగొందు నామెమూ
లోకనపాళి తెల్పు, నెదలోపలి కోర్కెని బైకిఁ జాటుచున్॥ ౧౦౩

క॥ ఉండు,'' మని రాచకన్నియ
దండకరిగి, నోటిచెంతఁ దన చెవి నిడుచుం
గొండొక తడవాదాసి య
టుండి, మగిడి వచ్చి, వేల్పుటువిదకు ననియెన్॥ ౧౦౪

చ॥ "తెలిపితిఁ గాదె? మీరరుగుదెంచుటచేఁ దన జన్మమెల్ల రీ
తులను బవిత్రమయ్యెనఁట! తొయ్యలి, నీహృదయేశ్వరుండు మా
లలనకు నన్నగారఁట! విలాసముగా నొక కొన్నినాళ్లు మీ
రలతిథులౌచు మాదునగరంబున నుండుట కోర్కెయామెకున్"॥

చ। అన విని యోగసిద్ధి పతియాననముం బరికించి, సమ్మతిం
చినవిధముం దదీయముఖచిహ్నములన్ గుఱుతించి లేచి, ప్రీ
తిని బలుమాఱులాజితవతిన్ బిగియారఁ గవుంగిలించి, మో
మున నునునవ్వువెన్నెలగముల్ ప్రసరింపఁగ నక్కుమారితో॥

క॥ "మఱఁదలు మాణిక్యంబా,
తఱుచుగ మీయింటఁ బప్పుదప్పళములపై
గుఱి కుదిరినం, గడుపుఁగ
క్కుఱితిని మీయన్నగారు కూర్చుందురు లే"॥ ౧౦౭

వ॥ అనిన స్మితవతియై జితవతి మూఁగపద్ధతి వాని యోగసిద్ధితో
వినఁబడియు వినఁబడని యల్పస్వరంబున॥ ౧౦౮

క॥ "వదినా, నీవిటుఁ దటు ద్రి
ప్పెదవే? మా యన్నగారి పేరు నుడివి, నీ
వు దినఁగఁ దలఁచితివేమో?
పదవమ్మా, చూతు నీదు బావురుఁదనమున్"॥ ౧౦౯

చ॥ అని పరిహాసమాడి, వినయమ్మున నమ్మిథునమ్ము నంత ర
మ్మనుచును బిల్చి, యందలములందు వసింపఁగఁజేసి, వారిఁ దో

డ్కాని నగరంబుఁజేరి, తనకుం గడుఁ జేరువగాఁగ వెండికొం
డను నిరసించు గొప్ప భవనంబున నుంచె సగౌరవంబుగన్॥ ౧౧౦

ఉ॥ శంతనురాజచంద్ర, యిటు శ్రద్ధమెయిన్ వినుచుంటివా? భవ
చ్చింతను దీర్పఁ బిట్టకథ చెప్పుట కాదిది; నీదు పూర్వవృ
త్తాంతము వచ్చు నీపయిని; దానికిఁ బీఠికగాఁగ నిక్కథం
గొంత వచింపఁగావలసె: గొంచెమె యున్నది యాలకింపుమా॥

క॥ మా సహజన్ముండైన ప్ర
భాసుండును యోగసిద్ధి పదిప్రొద్దులు నా
నాసౌఖ్యములొందుచును ని
వాసమచటఁ జేసిరి జితవతికి నతిథులై॥ ౧౧౨

ఉ॥ ఆయెడఁ, బంచభక్ష్యపరమాన్నములా? మధురంబులైన పం
డ్లా? యతిశీతలంబగు రసాయనమా? యమృతోపమానపా
నీయములా? యవన్నియును నే వివరింతు నటన్న, నోరు భూ
నాయక! యూరి, యాపయిని నాలుకయాడదు; కాన మానెదన్॥

శా॥ తాంబూలార్థముగాఁగఁ బెట్టిన పదార్థంబుల్ సహస్ వేలు సే
యుం; బన్నీరపరంజిబిందియలతోనుండున్ సదా స్నానశౌ
చంబుల్ సల్పఁగ; దీపతైలములు తాజామేలియత్తర్లు: నె
య్యంబయ్యుర్వరమీఁదఁ జూపె నృపకన్యారత్నమీరీతిగన్॥

చ॥ తరువడిఁ బట్టినట్టి కరిదంతముచేత నమర్పఁ బడ్డదై,
యరుదుగఁ బ్రాణులట్లు పనులన్నియుఁ జేసెడి కీలుబొమ్మలం
బరఁగిన యట్టి దోమతెరపందిరికోడులపట్టెమంచము
య్యురువురశయ్యకేర్పఱిచె నింపుమెయిన్ నృపకన్య యయ్యెడన్॥

ఉ॥ మెత్తని హంసతూలికల మేల్పఱుపుల్, మొకమాల్ తలాడలుం,
గ్రొత్తగఁ జల్వ మైన జిలుగుందెలిదుప్పటులుం దలిర్ప, నా
యత్తముగాఁగ దంపతులకై నృపకన్యక వెల్తురుండఁగాఁ
జిత్తజుకేళికిన్ విరులసెజ్జ ఘటింపఁగఁ జేయు సొంపుగన్॥ ౧౧౬

చ॥ ఉదయము పూవుఁబాన్పుపయినుండి ధరాస్థలిమీఁద దంపతుల్
పదములు మోఁపినంతనె నృపాలకుమారికపంపున౯ గుదుల్
గుదులుగ వచ్చి, తెల్పకయె కోర్కులనెల్ల నెఱింగి తీర్చుచుం
డుదురు పరుండునంతకుఁ గడు౯ భయభక్తులఁ జేటికాజనుల్॥ ౧౧౭

ఉ॥ చేటికలంటిరాఁగ, నృపశేఖరు పుత్త్రిక యోగసిద్ధికిం
దోఁటలు చూపి, యావనితతో దినము౯ వనకేళి సల్పు ; న
చ్చోట సరస్సులందు దిగుచు౯ జలకేళి యొనర్చు ; రాత్రుల౯
నాటకగానభాగవతనాట్యముల౯ జరిపించు నామెకై॥ ౧౧౮

మ॥ "వదినా, రాఁగదవమ్మ!" "యోమఱఁదలా, వైళమ్మరారమ్మ!" యం
చుదయంబాది పరున్నయంతకును వారొక్కింతయుం బాయకా
పదినాళ్లు౯ ముడివేసికొన్నటులుగా వర్తించి: రాస్నేహమే
చెదరు౯ లేక ప్రవృద్ధమౌచు వెలసె౯ క్షీరోదకన్యాయమై॥ ౧౧౯

వ॥ నానారీతుల నానారీతిలకంబొనర్చు నాతిథ్యంబును మా భ్రాతయు
నాతని నాతియుఁ జేతస్సంజాతసంప్రీతిని బరిగ్రహించి తిరిగి తమ
లోకంబునకరుగు నవసరంబున ననురాగబుద్ధిఁ జూపు యోగసిద్ధి
తో హితమతియై జితవతి యిట్లనియె॥ ౧౨౦

తే॥ గీ॥ "అష్టవసువులలోని వారన్నగారు ;
అంగిరోబ్రహ్మ పుత్త్రికవమ్మ నీవు :
నాదు జన్మంబు పరమధన్యంబుగాఁగ
నా గృహంబున నతిథులై నారు మీరు ॥ ౧౨౧

క॥ నా పరిచర్యలయందే
లోపంబులు గలిగిన నెదలోపల మీరల్
కోపింపకుండఁ గృపతో
సైఁప వలయుఁ జుండు పుణ్యదంపతులారా" ॥ ౧౨౨

వ॥ అనిన నక్కన్యక చెక్కిలి నొక్కి ముద్దాడి యోగసిద్ధి॥ ౧౨౩

ఉ॥ "మానిని, నీవు లోపమను మాటయు నెత్తుట మాను; నందినీ
ధేనువుఁ బోలెఁ గోర్కులను దీర్చుచు నీవిటులాదరింపఁగా,
మీ నగరంబునన్ సుఖసమేతులమై తాచును ప్రాణనాథుఁడున్
నేను వసించినార: మిది నిక్కము; నమ్ము," మటంచుఁ బల్కినన్॥

ఉ॥ "మానవరో, కామధేనువను సంగతి వింటిని గాని, నందినీ
ధేనువనంగ నెవ్వరును దెల్పఁగ మున్ వినియుండ; నట్టిదే
దేని నిజంబుగాఁగఁ గలదే? నను హేళనమాచరింపఁగా
లేనిది యున్నటుల్ కవి వలెన్ నవకల్పనమీవు చేసితో?"॥ ౧౨౫

వ॥ అని జితవతీకన్య యడిగిన, యోగసిద్ధి తన మనశ్శుద్ధి తేటపడ
నిట్లనియె॥ ౧౨౬

తే॥ గీ॥ "ఆదరమ్మున మముఁ దన్పినట్టి నిన్ను
హేళనము చేయఁగఁ గృతఘ్నురాల నఁటవె?
నందినీధేనువన్నదున్నది: వినఁ గదె
యోసఖి, దాని పుట్టుపూర్వోత్తరములు॥ ౧౨౭

క॥ కూఁతుం డ్రడ తండ్రి, శివు జా
మాతగఁ బడసిన యతం, డమరముఖ్యులకున్
మాతామహుఁడగు వాఁడు, వి
ధాతృసుతుఁడు, దక్షుఁ, డఖిలదక్షుండు గదా?॥ ౧౨౮

తే॥ గీ॥ అజుని దక్షిణాంగుష్ఠంబునందుఁ దాను
బొడమి, యతని వామాంగుష్ఠమునఁ బొడమిన
ధరణి యను పేరు గలయట్టి తరుణిని దన
ధర్మపత్నిగా దక్షుఁడుద్వాహమయ్యె॥ ౧౨౯

తే॥ గీ॥ దితి, నదితిని, గద్రువను, వినతనె, కాక
సురభి యను సుతన్ సతిగ దక్షుండొసంగెఁ
గశ్యపున ; కయ్యదియె సుమ్ము కామధేను:
వదియె కనె నందినీధేనువనెడి దాని॥ ౧౩౦

శా॥ హేమాంగీమణి, కామధేనువెట్టులట్లే నందినీధేనువి
చ్ఛామాత్రంబునఁ గామితార్థముల నీఁ జాలున్ సమృద్ధంబుగన్;
వ్యోమంబందె సదాగఁ గామగవి యుండున్; నందినీధేనువీ
భూమిన్ వాసమొనర్చు: భేదమిదిరో హో తల్లికిం బిల్లకున్॥ ౧౩౧

చ॥ యమిజనతావరిష్ఠుఁడగు నట్టి వసిష్ఠుఁడు తా నొనర్చు హో
మములకవశ్యమయ్యెడి సమస్తపదార్థములిచ్చు నన్న యా
సమెయిని దానిఁ గోరఁగ, నొసంగెను గశ్యపుఁడవ్వసిష్ఠు నా
శ్రమమున నిప్పుడున్నదది జవ్వని, యాతనిహోమధేనువై ॥ ౧౩౨

ఉ॥ స్నిగ్ధతరంబులై యమృతశీకరతుల్యములైన నందినీ
దుగ్ధచయంబుఁ ద్రాగు సుకృతుల్ క్షితిపైఁ బదివేలయేఁడులో
ముగ్ధ, సుఖంబుగా జరయుఁ బొందకయుందురు; మందులేటికిన్?
దగ్ధమొనర్పఁగాఁ గలుగు దానిపయస్సులె సర్వరోగముల్॥ ౧౩౩

తే॥ గీ॥ లేని దానిని నేను గల్పించితి నని
డెందమందు నీవొందిన సందియంబు
దీఱునట్టులా ధేనువుం దెచ్చి, నీదు
పెరటఁ గట్టింతు నెలయైనఁ దిరుగకుండ॥ ౧౩౪

ఉత్సాహ॥ నీకుఁ దగిన సుందరాంగునిన్ స్వకీయశక్తిచేఁ
జేకుఱంగఁ జేయు నదియె: శీఘ్రముగ వివాహమై
రాకుమారి, సిగ్గుతో శిరంబు వంచుకొన్న నీ
యాకృతిం గనంగఁ బుట్టెఁడాశ పుట్టె నామదిన్॥ ౧౩౫

తే॥ గీ॥ ఉండఁ గదె, పోయి వచ్చెద మోసఖి,'' య
టంచు నయ్యోగసిద్ధి ప్రియద్వితీయ
యగుచు గగనంబున కెగసె, మొగము లెత్తి
జితవతియుఁ జేటికలును వీక్షించుచుండ॥ ౧౩౬

ఉ॥ భార్యమొగంబుఁ గన్గొని ప్రభాసుఁడు, "నందినిఁ దెచ్చుటల్పమౌ
కార్యము గాదు; ముందువెనుకల్ దలపోయక తెత్తు నంటి, వే

ధైర్యముచేతనో ?'' యనఁగ దామరసాక్షి నిజేశుతో, ''సుగా
చార్యుఁడు నాదుభ్రాత గద ? సాధనమేదియొ చూపకుండునే ?॥

క॥ పదుఁడు పదు,''డని బృహస్పతి
సదనమునకుఁ బతియుఁ దానుఁ జని, యగ్రజుతో
సుదతి తనదు పని తెలిపినఁ,
బెదవి విఱిచి గురుఁడు పలికెఁ బ్రియసోదరితో॥ ౧౩౮

ఉ॥ ''చెల్లెల, మంచిదానవె ! వసిష్ఠుని నందిని భూమిమీఁది యే
పిల్లకొ కానుకా ? శివుఁడు పెంచిన నందిసి దెత్తు నంచు నేఁ
డెల్లి వచింతువేమొ ? యిది యెవ్వరు విన్నను నవ్వు వారె ; నా
తల్లివి గాని, యిట్టి బెడఁదం బడకుండఁగ నింటికేగుమా''॥ ౧౩౯

క॥ అనఁ జిన్నపుచ్చుకొని వ
చ్చిన పతిచెల్లెలిని, యోగసిద్ధిని, దారా
వనజేక్షణ కని, సంగతి
విని, కనులొక్కింత మూసి విప్పి, నగవుతో॥ ౧౪౦

తే॥ గీ॥ ''అయ్యొ ! మఱఁదలా, నీవు మీయన్నగారి
మాటల నెఱుంగవే చిన్న నాఁటినుండి ?
నందినిని మీరు దొంగతనంబుగాఁగఁ
దేఁ గలుగు నుపాయంబు నేఁ దెలుపఁ గలను॥ ౧౪౧

శా॥ పాతివ్రత్యము గల్గినట్టి సతులం బల్మాఱు నేఁ జూచినం,
బ్రీతిం బొందుచునుందురెల్ల గతులన్ మీయన్నగా ; రెల్లియే
ప్రాతర్వేళ నరుంధతిం గనుటకై పైనంబు నేనయ్యెదన్ ;
నాతో వారును వత్తు : రొక్కగిత నెన్నండంప : రేహేతువో॥?

ఉ॥ ద్రోహపు బుద్ధులేవియు నరుంధతి చెప్పదు నాకటంచు, సం
దేహము మాని వారు తమ నీతులగ్రంథము విప్పి, మానిసం
దోహము చెంత సంతసముతో వినిపింతురు : మీరు సర్వస
న్నాహము చేసియు తఱిని నందినిం గొనిపొందు మలకన్''॥ ౧౪౨

తే॥ గీ॥ తీరునందు రత్యపరావతార మైన
తార యీ తీరునం దెల్పఁ, దారకాధి
నాథుఁడది విని నిర్భరానందమొందె
నో యనఁగ నిండుకళలతో నుదయమయ్యె॥ ౧౪౪

క॥ పొడిగింపక యవ్వలి కథ
నుడివెదఁ గ్లుప్తముగ శంతనుక్షితిపాలా;
పొడుపుంగొండ పయిం గనఁ
బడె వేఁగుంజుక్క; యిరులు పలుచన యయ్యెఁ॥ ౧౪౫

వ॥ తార చూపించిన దారిని జడదారి యాశ్రమంబునకు మఱునాఁటి యుదయంబున నదనెఱిఁగి, మాయన్నదమ్ముల మెనమండ్రము నరిగి॥

సీ॥ లక్ష్మికి నాలవాలంబై ప్రసన్నమై
కళకళలాడు మొగంబు దానిఁ,
గాటుకం బెట్టిన కైవడివై సాదు
తనమును దెలిపెడి కనుల దాని,
నునునీలమణులఁ జెక్కిన భంగి నొప్పి చ
క్కగ వంగినట్టి శృంగముల దాని,
నమృతకుంభంబిదె యనఁ దగి యబ్బురం
బుగ నుబ్బియున్నట్టి పొదుగు దానిఁ;
పాల సంద్రంపు నురువును బోలు మేని
దానిని, వసిష్ఠు నందినీధేనువు నపు
డీడ్చుకొని పోయినార మే మేడుగురము;
వెనుక నుండెఁ బ్రభాసుండు విల్లు పూని॥ ౧౪౬

వ॥ పేదకుఁ బెన్నిధియుం బోలెఁ దనకు లభించిన యా ధేనువు సన్నిధి నుండుటకై కుబేరు నడిగి తన్నిధిసంరక్షకులలోని గుహ్యకు నొక్కరుని స్థూలకర్ణనాముని వసిష్ఠుండు నిజగోసంరక్షణంబునకై నియమించి యుంచె॥ ౧౪౭

ఉ॥ గుహ్యకుఁడాతఁడప్పుడతికోపమునం జనుదెంచి, "యేరిరా,
గ్రాహ్యము గాని గోవు నిటుగా హరియించిన వారు ? మామకా
సహ్యములైన బాణములఁ జంపెద," నంచును, ధేనుశాలకున్
బాహ్యమునందు నిల్చిన ప్రభాసుని గన్గొని హుంకరించుచున్॥

క॥ "ఆవైపున వ్యాఘ్రంబని
రావంబొనరించి తస్కరా, నేనటకుం
బోవ, నిటువైపు మీరలు
గోవుం గొనిపోయితిరె నిగూఢముగాఁగన్ ?॥ ౧౫౦

క॥ నీతోడి దొంగలేరీ
యోతస్కర ? జీవితేచ్ఛ యున్నన్, గోవుం
దే తెందు : పాఱిపోవఁగ
మీ తరమా ?" యంచుఁ దనదు మీసము ద్రిప్పెన్॥ ౧౫౧

క॥ "మీసము నీకేటికి ? మగ
వేసము గల యాఁడుదాన వే నీ,"వనుచున్
హాసము చేయుచు నపుడు ప్ర
భాసుఁడతని మీసము పఱపఱమని గోరిగెన్॥ ౧౫౨

వ॥ ప్రభాసప్రయుక్తసమ్మోహనాస్త్రనిబద్ధుండైన స్థూలకర్ణుండు నిర్గతసత్త్వుండై యతండు నిర్గమించిన మార్గంబుఁ జూచుచు నిలుచుండి, వసిష్ఠదర్శనార్థమై యప్పుడావంకకు వచ్చిన నిరంతరతపఃపరాయణులగు నరనారాయణులవలన విముక్తిం జెంది వారి కంతయుం దెలుప, నారాయణాంశసంభూతుండైన నారాయణమహాముని నరునిం జూచి॥ ౧౫౩

ఉ॥ "దుష్టులు చేయుఘోరములతో జగమెల్లను నిండెఁ; గ్రమ్మఱన్
శిష్టులఁ బ్రోవ, దుష్టులను శిక్ష యొనర్పఁగ, జన్మమొంద నీ
కిష్టమె ?"నా, నరుండు, "సరియే యటులే జనియింత ; మీఁతనిం
గష్టము పెట్టినట్టి యపకారిని జంపెద నప్పుడే." ననెన్॥ ౧౫౪

క॥ "నను ముందుఁ బెట్టుకొని, యా
పని మీ రొనరింప వలయుఁ బరమమునీంద్రా,'
యని స్థూలకర్ణుఁడు నరుం
గని పల్కెను వగపు తెల్పు కంఠరవమునన్॥ ౧౫౫

వ॥ తారాబృహస్పతులకుఁ దగిన రీతి నాతిథ్యంబు సలుప నెంచి యందులకు నందినీధేనుసాహాయ్యంబు నపేక్షించి యచ్చటికి వచ్చిన వసిష్ఠుండు తద్గోచౌర్యవృత్తాంతం బాద్యంతంబుగా గుహ్యకుని వలన వినినంత॥ ౧౫౬

శా॥ శాంతంబంతయు నేడ కేగినదొ? విశ్వామిత్రు క్రోధంబు వే
యింతల్ గాఁగఁ బ్రవృద్ధి గన్నయెడ నెంతేపారునో, బ్రహ్మక
ల్పాంతోగ్రోజ్జ్వలరౌద్రమెంత యధికంబై యుండునో, యంతదు
ర్దాంతంబయ్యె వసిష్ఠుకోపము భయోత్కంపంబు గల్గించుచున్॥

ఉ॥ హుమ్మని మౌని కోపమున నూపిరి లోనికిఁ బీల్చ, దాని వే
గమ్మె? మతేమహత్త్వమొకొ? కట్టఁగఁగట్టి మముం, బ్రభాసు, శీ
ఘ్రమ్ముగ నమ్మునీశ్వరుని కాళ్లపయిం బడవైచె; నాతఁడున్
మమ్ములఁ జూచి, మండిపడి, "మర్త్యులుకం," డని శాపమిచ్చినన్॥

చ॥ గడగడమంచు మేమతని కాళ్లను వీడక, "తప్పు వచ్చె, ని
య్యెడఁ గరుణింపు; మమ్ము క్షమియింపుము; మేము మనుష్యయోనులం
బడమియు, దీర్ఘకాలమిలపైఁ బడియుండమియున్, ఘటింపుమా:
యడుగుకొనంగ లేదని మహాత్ములు పామ్మనరో మునీశ్వరా"॥

వ॥ అని యవ్విధంబున మేము॥ ౧౬౦

క॥ నానావిధదీనోక్తుల
మౌనిం బ్రార్థింప, శాంతమానసుఁడగుచున్,
"మానవయోనులఁ బుట్టకుఁ;
డే నలువది గడియలో వసియింపుఁడి వసుధన్॥ ౧౬౧

తే॥ గీ॥ వసువులార, తక్కుం గల వారి కంటెఁ
శాపమెక్కుడు చేసె బ్రభాసుఁ; డతఁడె
క్షితిపయిన్ దీర్ఘకాలంబు బ్రతికి యుండు,
గోవునకుఁ గీడు చేయుటన్ గొడ్డువోయి॥ ౧౬౨

తే॥ గీ॥ బ్రహ్మసభ కేగుఁ; డచట మీ భావిజన్మ
పద్ధతులెఱుంగ వచ్చు నేర్పాటుగాఁగ,”
నని వసిష్ఠుండు తెల్ప, మేమతని కెఱఁగి,
కదలి చనితిమి సత్యలోకమునకపుడు॥ ౧౬౩

మ॥ భృగుముఖ్యుల్ మునిముఖ్యులొక్క దెస, దేవేంద్రాగ్నిధర్మాదులా
దిగధీశుల్ మఱి యొక్క ప్రక్క, సకలాదిత్యవ్రజమ్మొక్కచో,
జగతీనాయకులొక్కెడం గొలువ నబ్జాతాసనుండుండె నో
లగమై, నాలుగు మోములందుఁ దన యిల్లాలోలగంబుండఁగన్॥

వ॥ ఇట్లు నిండు కొలువై యున్న నలువకు దండప్రణామంబులు సలిపి,
మే మొక మూల నాసీనులమైయున్న యంత॥ ౧౬౪

సీ॥ నాఁచు మొత్తంబైన నల్లని కుంతలం
బుల ఫుల్లకల్హారములు దలిర్ప,
నరవిందమే యగు నందంపు మొగమందుఁ
దుమ్మెదలగుచుఁ గన్దోయి మెదల,
నవమృణాళంబులైన భుజంబు, లాపైని
గంకణంబులు నూర్మికలును దనరఁ,
బులినంబులే యగు బలునితంబములు ర
మ్యోరుశోభలచేత నొప్పమీఱఁ,
దరఁగలే యైన యట్టి ముత్తెముల నడుమ
మీఁద వీఁచుచు [illegible]

నాభిసుడి యించుకంత కనంబడంగ,
గంగ వచ్చె మోదంబెసఁగంగ సభకు॥ ౧౬౬

క॥ స్త్రీరూపంబును దాలిచి
యా రీతిగ నున్న గంగ యంగంబులఁ గ
న్నారం గాంచె మహాభిషుఁ;
డా రాజును సాభిలాషయై కనె నదియున్॥ ౧౬౭

ఉ॥ తామరచూలి మోములను దాఁగుకొనన్ మృదువాణి సిగ్గునం;
"గాముకచర్యలీవిధముగా సభలో నఁటరా మహాభిషా ?
భూమిని గ్రమ్మఱం బొడమఁ బొ,"మ్మని గంగనుజూచి, "స్వైరిణీ,
యీ మగనిన్ వరింపుమపుడీ," వని బ్రహ్మ శపించె వారలన్॥ ౧౬౮

మ॥ ఇలలోనన్ బహుధర్మశాలి యనఁగా నిక్ష్వాకువంశంబులో
పలఁ బేరుం గని, యశ్వమేధములు నాపై రాజసూయంబులున్
సలుపం గల్గి, మహాభిషుండు తుదకున్ స్వర్గంబు సాధించినం,
గలిగెన్ జన్మము గ్రమ్మఱం, బరసతిం గన్నెత్తి తాఁ గాంచుటన్॥

ఉ॥ స్వాంతమునందుఁ జింతిలుచు సారసగర్భుని జూచి గంగ "శా
పాంతముఁ దెల్పవే," యన, "మహాభిషుఁడింకఁ బ్రతీపపుత్రుఁడై
శంతనునామధేయమున జన్మము నొందును జంద్రవంశమం;
దింతిరొ, నీకు నాతనికి నివ్వసువుల్ సుతులౌదురాతజిన్"॥ ౧౭౦

క॥ అని మమ్ముఁ జూపి యజుఁ, "డం
గన, పుట్టిన వారిఁ బుట్టఁగనె చంపుము; యీ
యెనిమిదవ వానిఁ జంపం
జన, శంతనుఁడడ్డు: నీకు శాపాంతమదే"॥ ౧౭౧

చ॥ శతధృతి యాగతిం దెలుపఁ, జయ్యన మేమపుడిండ్లకేగి, మా
సతులకుఁ బూసగ్రుచ్చినటు సంగతి యంతయుఁ దెల్పినంత, "నా

కతమున నింత పుట్టె; నెటుగాఁ బతిఁ బాయఁగనేర్తు?'' నంచు దుః
ఖిత యయి యోగసిద్ధి భువికిన్ దిగి వచ్చి, వసిష్ఠుపాలికిన్॥ ౧౭౨

ఉ॥ గ్రక్కునఁ బోయి, యా తపసికాళ్లపయింబడి, సాఁగి మ్రొక్కుచుం,
బ్రక్క నరుంధతీసతి కృపామతియై విన, "నాథుఁ బాసి, నే
నెక్కరణిన్ వియోగము సహింతు? నెటుల్ తనువున్ వహింతు? మే
నిక్కడనే దహింతు," నని యేడ్చుచు నెంతకు లేవకుండినన్॥ ౧౭౩

వ॥ తాపసశ్రేష్ఠుండైన వసిష్ఠుండు కరుణాగుణగరిష్ఠుండు గావున నమ్మధురోష్ఠి దుఃఖంబుఁ గాంచి, కించిదున్మీలితనయనంబుల నొక్కించుక యోచించి, "యోగసిద్ధీ, ప్రియవియోగసిద్ధి నీకు దుఃఖదాయకంబు గాని యుపాయంబు వినుము: మానవుల వత్సరంబు దేవతలకొక్క వాసరంబ కదా? భవద్విభుండయిన ప్రభాసుండు భువిం బ్రభవించి గతాసుండగు నంతకును శతవాస రంబులు నా యాశీర్వచనంబున నీవు నిద్రం బొందుము; మగని ముద్దు భవన్నిద్రాముద్రను విప్పఁగల," దని పలికె; విరోధి శిరోధినికృంతనుండవగు నో శంతనుండ, గతంబునకుఁ గతంబిప్పుడు తెలిసినది గదా?॥ ౧౭౪

ఉ॥ ప్రాణములం ద్యజింతు నను భావము మాను; ఋణానుబంధరూ
పేణసతీసుతాదులను పెద్దల వాక్యము నీవెఱుంగవే?
ప్రాణుల చావుపుట్టువులు ప్రాజ్ఞుల బుద్ధిఁ గలంపఁ జాల; వో
క్షోణితలేశ్వరా, తెలిసికొమ్మిది కర్మఫలంబుగా మదిన్॥ ౧౭౫

చ॥ అదె మెలమెల్లఁ దూర్పు తెలుపైపొలుపారఁగఁ జొచ్చెఁ; దామరల్
నిదురను మేలుకొంచు దళనేత్రములల్లన విచ్చె; గండుతు
మ్మెదగమిబిచ్చగాంద్రరొద మిక్కుటమై విన వచ్చె: మేముపో
యెద," మనుచున్ ధరుండనఁగనే, మఱి లేరట వారలెద్దురున్॥

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబువా;
రనఘులు వారి పాదముల నొదలఁ దాలిచి, దానిలోని భీ
ష్మునిచరితంబు గ్రొత్తఁదనముం గన వ్రాసినవాఁడ నేను నే
ర్చిన గతి సెట్టిలక్ష్మినరసింహసమాఖ్యుఁడ, ధీరసఖ్యుఁడన్ ॥

సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, దదంతరంగ
కార్యదర్శిని, దన్మహౌదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలక్షణుండ ॥



శ్రీ

# ప్రభాసశాపవిమోచనము.

II

శీర్షమునందుఁ జంద్రముని జేర్పని శంభుఁడు, పెద్దలైన స
ప్తర్షులయందుఁ బెద్ద యని ప్రస్తుతికెక్కిన మేటి, కౌశికా
మర్షము నీటి పాలయిన మంటగఁ జేసిన వాఁ, డరుంధతీ
హర్షవివర్ధనుండు, విమలాత్ముఁడు. నైన వసిష్ఠు పాలికిన్॥

క॥ గంగ యరుదెంచి, తన చం
కం గొని తెచ్చిన కుమారుఁ గాళ్ల వఁఱచి, తా
నుం గేవలభక్తిని సా
ష్టాంగనతులొనర్చి, విరచితాంజలి యగుచున్॥ ౨

శా॥ "నీ శాపంబున మానవుండగుచు జన్మించెం బ్రభాసుండు మా
నీశా! వీని నిఁకేమి చేసెదవొ నీ యిష్టంబు; నాకేటికీ
పాశమ్మొక్కటి? మానవుం గలియ గర్భంబయ్యె నాకంచుఁ, జీ
చీ! శర్వాణి హసన్ముఖంబునను వీక్షింపంగ సాక్ష్యంబొకో? 3

ఉ॥ ఆయువు నీవు పెట్టుటొక యడ్డుగ నిల్చెను, వీనిఁ బుట్టఁగా
నే యొకనొక్కనొక్క వధియింపక యుండఁగ; అంకులాఁడికే
లా యిటువంటి బిడ్డ తగులాటము? వీనిని బెంచుకొమ్ము:. నీ
వే యిఁక మాతవేనిఁ బితవేనియు వీనికి మౌనిశేఖరా॥ ౪

తే॥ గీ॥ తాతగారన్న చనువుచేఁ దఱచు నేను
బోవ, అంకు గట్టిరి మున్ సముద్రునకును,
నాకు, నూరకే లోకులు కాకులగుచు:
మూఁకుడేది లోకుల నోళ్లు మూయ నింక?॥ ౫

క॥ తల యెత్తుకొనుచు నేనిఁక
నలుగురలోఁ దిరుగ లేను; నాకిక్కడ నే
నెలవొక్కటి చూపింపుము
తల దాఁచుకొనంగ మునివతంసమ," యనుచున్॥ ౬

చ॥ త్రపమెయి లేవకుండెడి శిరంబయి, కన్నుల నిండ నీళ్లతో
నపుడిటు గంగ పల్కినఁ, దదంగనఁ గన్గొనుచున్ వసిష్ఠుఁ, డో
చపలమృగాక్షి, యూరక విచారము నొందెద వేటికమ్మ? వి
ష్ణుపదమునన్ జనించిన నినున్ వ్యభిచారగుణంబు చేరునే?॥ ౭

క॥ ముక్కంటి దేవివగు నీ
వెక్కడ? అంకుఁదనమన్న దెక్కడ? నీకా
మిక్కిలి కిన్నులవాఁడో
యక్కా, కలుగంగ నిచ్చునా యట్టి గతిన్?॥ ౮

ఉ॥ నీవు మహాభిషున్ వలపునెయ్యముతోఁ గనుఁగొంట, శంతనుం
డై వసుధన్ జనించినపు డాతని నీవు వివాహమాటయుం,
గేవలకాముకత్వభవకృత్యములంచుఁ దలంచుచుంటివో?
దేవరహస్యమున్న యది దీనికిఁ: దెల్పెద నాలకింపుమా॥ ౯

శా॥ దక్షుండధ్వరకార్యమున్ సలుప యత్నంబంతయుం జేసి, ఫా
లాక్షుం బిల్వఁగఁ బోయినట్టి కథ నీవాలించియే యుందు; "వీ
భిక్షుండింత యలక్ష్యభావమున నన్వీక్షింపఁడా?" యంచు యా
గక్షేమంకరు శంకరుం గనుచు దక్షబ్రహ్మ క్రోధాంధుఁడై॥ ౧౦

ఉ॥ "మానవజన్మమెత్తు! మిల మానవజన్మము నెత్తు!" మంచు నీ
శాను శపించె; నాపిదప జన్మము దక్షుఁడొనర్పఁ బోవ నే
మైనదొ నీవు విన్నదియె: యద్ది కథాంశముఁ గాదు; యోగమున్
మాని హరుండు విప్పెను క్రమంబుగ దక్షిణవామనేత్రముల్॥ ౧౧

తే॥ గీ॥ అక్షులగు సూర్యచంద్రులయ్యాభవుఁ గాంచి,
"నాదు వంశంబునం బుట్టు!" "నాదు వంశ

మందుఁ బుట్టు ! " మటంచును ప్రార్థనంబు
సలిపి, తెలిపిరి దక్షుని శాపమపుడు ॥ ౧౨

ఉ॥ "భానుఁడ, సీదియే మొదటి ప్రార్థన ; మా తరువాతఁ గాదె చం
ద్రా, నను నీవు గోరితివి ? దక్షుని మాట ద్విరుక్తమైనటుల్
మీ నుడులందుఁ దేటపడె : మీరలు కోరిన యాశ్రమంబునన్
నేనిల మానవుండుగ జనించెద మీ యుభయాన్వయంబులన్ "॥ ౧౩

వ॥ అని కృశానులోచనుండు తన ప్రధానలోచనంబులుగా నున్న
భానుని, శీతభానుని, సమాధానపఱిచె ॥ ౧౪

మ॥ శివునంశంబున నే మహాభిషనృపశ్రేష్ఠుండు పుట్టెన్ భువిన్
రవివంశంబున ; నమ్మహాభిషుఁడు కాంతా, శంతనుండై న య
ట్టి విధంబంతయు నీవెఱింగినదె : నీ డెందంబు నీకాంతుఁ గో
రి వరించెం ; దనువున్ భవత్పతిని చేరెన్ : వంత యింకేటికిన్ ?॥

తే॥ గీ॥ " స్వైరిణీ, " యంచు స్వేచ్ఛావిహారిణివగు
నిన్నుఁ గని బ్రహ్మ, " యీమగనిన్ వరింపు, "
మని మహాభిషుఁ జూపించు, టాన్నృపుఁడు శి
వాంశభవుఁడని ప్రబలసాక్ష్యంబు గాదె ? ॥ ౧౬

ఉ॥ అశ్రులఁ జేల నొత్తుకొనవమ్మ, మహేశ్వరు కొమ్మ ! నీవు మా
యాశ్రమమందు నుండునని యంటివి, మాటను నిల్పుకొమ్మ ; నీ
వేశ్రమ లేకయుండ నిటనే వసియింపుము ; నీ కుమారు నా
నాశ్రుతిశాస్త్రపారగు నొనర్చెద షోడశవత్సరంబులన్ " ॥ ౧౭

వ॥ అని తనసతి యగు నరుంధతిని రప్పించి, యామెకు గంగాదేవిని
జూపి యొప్పించి ॥ ౧౮

సీ॥ " పావనంబగు రమాపతిపాదపద్మమీ
యమ్మకుఁ బుట్టిన యట్టి యిల్లు ;
పరమేశ్వరుని జటాపటలమంతఃపుర
సౌధమీయమ, వాసము, చేయుఁ :

దగు స్వర్గమర్త్యపాతాళలోకమ్ములీ
యమ్మకుఁ గ్రీడాగృహమ్ములగుచు;
నుమఁ గూఁతుఁగాఁ గన్న హిమవంతు పెంపుడు
బిడ్డయై యీయమ్మ పెంపు గాంచె;
మహి భగీరథునకు నభిమానపుత్రి
యయి కులమ్ముద్ధరించె నీ దయ గలమ్మ:
యీమె గంగామహాదేవి; యింకెవరిత
యో యటంచు నుపేక్ష సేయుదువు సుమ్మ॥ ౧౯

క॥ మన యీ యాశ్రమమును పా
వనమును జేయుమని నేను వాంఛింపఁగాఁ,
దన తనయు విద్య ముగిసెడు
దనుక నిలువ సమ్మతించెఁ దరుణి కరుణామై॥ ౨౦

చ॥ వృషపతివాహు వంశమున వీర్యజితద్విషుఁడై భువిన్ మహా
భిషుఁ డుదయంబు నొంది, యటుపిమ్మట శంతనుఁడౌట దేవతా
ఋషియగు నారదుండెటకో యేగుచు నాకెఱిఁగించినప్పు, డా
విషయము నీవునున్ మునుపు వింటివి కాదె సవిస్తరంబుగన్?॥ ౨౧

క॥ శంతనుతోఁ గలదీమెకుఁ
బొంతనమనుచుఁ గడుపుణ్యముని దెలిపెఁ గదా?
కాంతా, వారికిఁ గలిగిన
సంతానములోన నితఁడె చావక నిలిచెన్॥ ౨౨

ఉ॥ తీవ్రతరంపుఁ బూనికను దేవుఁడె నాఁ దగి, పూనుకొన్న కా
ర్యవ్రజమాచరించుటతివా, వ్రతమై యితఁడుండుఁ గాన దే
వవ్రతుఁడన్న నామమున వాసికి నెక్కె జగంబునందు: నో
సువ్రత, వీని నెల్లపుడుఁ జూడుము కన్నకుమారు తీరుగన్''॥ ౨౩

వ॥ అని వసిష్ఠమహర్షి యరుంధతికిఁ బరమహర్షంబెసంగ నెఱింగించి.

గంగాదేవిని దన యాశ్రమమున నిలుపుకొని, యాయమ కుమారునకు జాతకర్మనామకరణాదులు యథావిధిగా నిర్వర్తించె॥ ౨౪

చ॥ కరుణను జూపుచుం, గనిన గంగకు నెక్కువగా నరుంధతీ
తరుణియు, నయ్యరుంధతికిఁ దక్కువ గాని విధాన గంగ, యి
ట్లిరువురుఁ బెంపఁ, బూఁటకొక యేటను గల్గఁగఁ దగ్గ యేపునం
బెరుఁగఁ దొడంగె శంతనునిబిడ్డఁడు తాపసియాశ్రమంబునన్॥ ౨౫

ఉ॥ ఉగ్గును ద్రాగు కాలమును, నుయ్యాలయందుఁ బరుండు కాలమున్,
మ్రొగ్గుచు లేచు కాలమును, ముచ్చటగా నడయాడు కాలముం,
బగ్గములుంచి పట్టినను బాఱెడు కాలమునన్, గమింపఁగా
మొగ్గ క్రమంబుగా విడిన పువ్వటు తేలెను బాలుఁడయ్యెడన్॥ ౨౬

తే॥ గీ॥ తాతగారు వసిష్ఠుండు తగిన శుభము
హూర్తమును జూచి చేయించె, 'ఓంనమశ్శి
వాయ,' యని యక్షరాభ్యాసమాయయిదవ
యేఁటి చిన్ని కుఱ్ఱనికిఁ దానే గురువయి॥ ౨౭

ఉ॥ ఛాత్రుఁడు దాను నేర్పినది సర్వము సూక్ష్మముగా గ్రహింప, సు
క్షేత్రము సాఁగు చేసిన కృషీవలు కైవడి సంతసించి, యా
పుత్రుఁడు యుక్తమౌ వయసు పొందఁగ జందెపుఁబోఁచ వైచి, గా
యత్రిని మాని వాని చెవియందుపదేశమొనర్చెఁ గూరిమిన్॥ ౨౮

శా॥ సాంగోపాంగములైన వేదములు శాస్త్రంబుల్ స్మృతుల్ కావ్యముల్
సంగీతం, బివి యన్నియంచు నన నేలా? విద్యలందెల్ల జం
కుం గొంకుం గన రాని భంగిగ మహాకూలంకషప్రజ్ఞ య
గ్గాంగేయుండు గడించెఁ, దాపసి శిరఃకంపంబుతో మెచ్చఁగన్॥

ఉ॥ శాంతనవుండు మాని సరసం బదునెన్మిది యైన విద్దియల్
సాంతము చేసి, షోడశకళాసహితుండగు చంద్రునట్లు భా
స్వంతుఁడు, షోడశాబ్దముల వాఁడును గాఁగఁ, దదీయమాత సీ
మంతతటార్పితాంజలిని మాని యనుజ్ఞను వేఁడెఁ బోవఁగన్॥ ౩౦

క॥ దేవవ్రతుని వసిష్ఠుఁడు
దీవించి, "కుమారక, భవదీయజనని తాఁ
బోవలయు ననుచు నున్నది:
నీవరుగుము; కీర్తి నెమ్ము నీకుఁ నాకున్॥ 30

శా॥ సత్యంబెన్నఁడుఁ దప్పకుండఁగ హరిశ్చంద్రుండు త్రైలోక్యసం
స్తుత్యుండయ్యె: గురుండు గాని భగవంతుండేనియుం గాని స
త్యత్యాగం బొనరింపుమన్న, వినరా: దన్నట్టి మాటే సుమీ
కృత్యాంబు, బెంత యసాధ్యమైన, మఱి యేకీడందుచే వచ్చినన్"॥

వ॥ అని యివ్విధంబున॥ 33

ఉ॥ ప్రేష్యుఁడుఁ బోష్యుఁడై తనదు ప్రేమను లోఁగొనఁ జాలినట్టియా
శిష్యునితోడఁ బల్కి, తన చేతను వాని శిరంబు ముట్టుచున్
ఋష్యవతంసమంప, నతనిం భయభక్తుల వీడుకొంచుఁ, దా
నేష్యముఁ గూర్చి చిత్తమున నెంచుచు జాహ్నవి యత్తనూజుతో॥

ఉ॥ షణ్ముఖు పాలికేగి, "తనుజా, యనుజాతుని వీనిఁ గాంచుమా!
రాణ్మణి యైన శంతనుఁడు త్ర్యంబకుఁ: డానృపు నేను గూడఁ, బ్రా
వృణ్మసృణాబ్దగర్భమణి రీతిగ నీతనయుండు పుట్టె; వి
ద్వాణ్మృగసింహశాసనటులు వీనిని నీవిఁక శిక్షచేయుమా॥ 35

క॥ సోదరుని వసిష్ఠుండ
ష్టాదశవిద్యలను మున్ను చదివించె: ధను
ర్వేదమునం బడినట్టి పు
నాదిపయిం నీవు పని యొనర్పు కుమారా॥ 36

మ॥ సురసేనానికితండు సోదరుఁడె యంచుం వేలుపుల్ మెచ్చు సం
గరనైపుణ్యము నేర్పుమా", యనుచు గంగాదేవి పల్కంగ, సో
దరునిం సాదరుఁడై షడాననుఁడు, "భ్రాతా, రాఁగదోయీ!" యటం
చురముం దాఁకఁ గవుంగిలించుకొని, యత్యుల్లాసియై తల్లితో॥ 37

ఉ॥ "విప్రులు గాకఁ దక్కుఁ-రులు విద్యను నేర్పఁగ నర్హులే? త్రినే
త్రప్రతిమానుఁడై పరశురాముఁడు చాపధురీణులందు న
మ్మా, ప్రథమాగ్రగణ్యుఁడగు; నాతని, నన్నుఁ, బరీక్షగా గురుం
డే ప్రధనంబు సల్పెఁడన, నే మునుపాతనికోడితిం గదా?॥ ౩౮

చ॥ గురుఁడన మామకీనజనకుండగు శంకరుఁడే కదమ్మ? మా
యిరువురయందు రాముపయి నెక్కుడు ప్రేముడి వారికిన్; హృదం
తరమున వారు విష్ణునవతారమటంచుఁ దదీయనామమున్
స్మరణమొనర్చుచుందురు సుమా: విను, మా భృగురాము పాలికిన్॥

క॥ చని, తమ్మునిఁ దనకడకే
ననిపితి నని నీవు చెప్పుమా; యాతండే
యనితరసాధ్యంబగు వి
ద్యను నేరిపి, తమ్మునిం గృతార్థుని జేయున్"॥ ౪౦

వ॥ అని చెప్పిన॥ ౪౧

ఉ॥ జాహ్నవి దానికొప్పుకొని, శంతనుపుత్రుఁడుఁ దాను, నెమ్మియే
చిహ్నముగాఁ గలట్టి సుతు చెంగట నెమ్మి దలిర్ప నాటి మ
ధ్యాహ్నము దన్క నుండి, యతఁడంపఁగ, క్షత్రియవంశపాళిపై
వహ్నిగ నిర్వదొక్కతడవల్ పడి యేర్చిన రాము పాలికిన్॥ ౪౨

క॥ కడువడిఁ జని, తన పని యే
ర్పడఁగాఁ దెలుపంగఁ, బరశురాముఁడు బిగ్గన్
వెడనవ్వు నవ్వి, "యహ! నీ
కొడుకునకున్ విద్యఁ జెప్ప, గురుఁడను నేనా?॥ ౪౩

ఉ॥ రాచపడంతు, "లమ్మ! భృగురాముఁడు వచ్చుచునున్నవాఁడు, బా
బో! చనుఁడీ," యటంచుఁ దమ పుత్రుల నెల్లర మూలమూలలన్
దాఁచుచు నుంట పద్ధతి గదా? యెటు నాకడ నీకుమారు సం
కోచము లేక నిల్పెదవు, క్రోల్పులి బోనున మేఁకపిల్లగా?"॥ ౪౪

మ॥ అనినన్ శాంతనవుండు, "పెద్దలని మీ యాచార్యకత్వంబు గో
రిన శిష్యుండను ; విద్య చెప్పనెడఁ గీర్తిం దెత్తు మీ ; కట్లు గా
క, ననున్ శత్రునిగాఁగ నెంచుచును గిన్కం జూప నూహింతురా,
కనుఁడీ, రాఘవుఁబోలు రాచకొమరుల్ క్ష్మాపైఁ గలారిప్పుడున్"॥

ఉ॥ నా, భృగురాముఁడాననమునన్ స్మితవిస్మితులంకురింపఁ, "గు
ణ్ణా, భవదీయశౌర్యము మదాత్మకు మెచ్చును దెచ్చె ; నావలెన్
భూభుజులన్ వధింతువను బుద్ధిని నిన్నొక వత్సరంబులో
నే భువనైకధన్వివని యెల్లరు మెచ్చఁగ విద్య నేర్పెదన్"॥ ౪౯

వ॥ అని గంగాదేవిం గనుంగొని ॥ ౪౭

ఉ॥ "వత్సరమైన పిమ్మటను వచ్చితి వేని, గృతార్థుఁడైన యీ
మత్సుతు వెంటఁబెట్టుకొని జాహ్నవి, నీవరుగంగ వచ్చు ; నే
వత్సలతం గనంబఱచి వర్ధితుఁ జేసెదఁ గాని, వీనిపై
మత్సరబుద్ధిఁ జూప ; ననుమానము మానుము మానసంబునన్"॥

క॥ అని తెలుపఁగ, మందాకిని
తన యనుఁగుం గొమరుని జమదగ్నితనయు చెం
తను విడిచె ; శాంతనవుఁడున్
వినయవిధేయతలతోడ విద్యను నేర్చెన్॥ ౪౯

చ॥ రథమును బూన్చి యుత్తమతురంగములన్ నడిపించుపద్ధతిం
బృథుగజసేన యుద్ధతిని బేర్చుచుఁ దాఁకిన నోర్చుపద్ధతిన్,
వృథ యగునట్లు శాత్రవుని వింటిని ద్రుంపఁగఁ జాలుపద్ధతిం,
బ్రథమమునందె నేర్పె భృగురాముఁడు శిష్యునికాదరంబునన్॥

చ॥ ఒకఁడె రణంబసంఖ్యులగు యోధులతో నొనరించుటెట్లొ, మం
చి కటికి చీఁకటిన్ విమతసేనలతో నని సేయుటెట్లొ, కా
ర్ముకము కరంబునందుఁ దెగిపోవఁగ నాజిని సల్పుటెట్లొ, యు
ద్ధకుశలుఁడైన భార్గవుఁడు దాఁచక నేర్పెను రాజసూతికిన్॥ ౫౧

మహాస్రగ్ధర॥ క్రమశిక్షాపద్ధతిన్ భారమనక మనసా
రం బ్రయోగోపసంహా
రములం జూపించి, దివ్యాస్త్రములను ఘనశ
స్త్రంబులన్ వాడు నైపు
ణ్యము, సైన్యంబెన్నియో వ్యూహములుగ సమరం
బందుఁ గల్పించు చాతు
ర్యము, నేర్పెం దాను దేవవ్రతునకు గురుఁడై
రాముఁడేడాఁదిలోనన్॥ ౫౨

క॥ ఈ విధమున ససమసమర
కోవిదుఁడై, గురుసమానకోదండధరుం
డై, వీరవరుండై, యా
దేవవ్రతుఁడుండ, గంగ తిరుగన్ వచ్చెన్॥ ౫౩

వ॥ నదీమతల్లియైన తల్లి వెంబడిం బయనంబై, యా వయినంబు తనకుం దెలిపి, సాష్టాంగనతులు సలిపి, యనుజ్ఞకై చేమోడ్పు ఫాలంబున నిలిపి యున్న దేవవ్రతునితోఁ బరశురాముండిట్లనియె॥ ౫౪

ఉ॥ "నా జనకున్ మహామదమునం గను గానక క్రూరకర్ములా
రాజసుతుల్ వధించిరని రాజకులంబునె రూపుమాపుచున్,
నైజవిరుద్ధమౌ చెడుగుణంబును జూపితి ; నీ గురుండనై
నేఁ జదువిడ్డ చెప్పుటను, నిక్కపు బ్రాహ్మణబుద్ధిఁ జూపితిన్॥ ౫౫

తే॥ గీ॥ కులముచెడియున్నయట్టి నాకున్ మగుడఁగఁ
గులము గలిగెను, నీకు నే గురుఁడ నగుట ;
గురుని మించు శిష్యుండవగుచు జగమునఁ
దగిన కీర్తి గడింపు శంతనుతనూజ"॥ ౫౬

వ॥ అని దీవించి యనిపిన, గంగాదేవి దేవవ్రతుని దన వెంటం గొని చనుచు, నతని వదనంబు వీక్షించి॥ ౫౭

ఉ॥ "నీ పిత శంతనుండనుచు; నీ జనయిత్రిని గంగ నంచు, నిం
తే పలుమాఱు వింటి: నది యెట్లుగఁ గల్గెనో విన్మటంచు ది
వ్యాపగ శంతనుండు తను నారయుటాదిగ నాఁటి దాఁకఁ దా
శాపకథల్ త్యజించి పెఱసంగతులన్నియుఁ దెల్పి, యాపయిన్॥

మ॥ "పదునేడేఁడులనుండి నీజనకుఁడబ్బాయీ, యిటుల్ మద్వియో
గదశం గుందుచునున్నవాఁడు; నను గంగంగా నెఱుంగుం జుమీ;
నదిగాఁ బాఱుచునున్న నాజలములన్ స్నానంబు గావించుచున్
బ్రదుకం జాలెను; నాఁటినుండి నది నీరంబుల్ తదాహారముల్॥

చ॥ అదె కనుఁగొమ్ము, గంగ యని యందఱు నోళ్లను బేరు గన్నద
న్నదియ: మదీయరూపమది, నాయన! దాపున నీదు తండ్రిగా
రుదకములందు మున్కలిడుచుందురు; నీరము పాఱకుండఁగాఁ,
గదలని యానకట్టొకటి కట్టుము తూపులతోడ నిచ్చటన్"॥ ౬౦

క॥ ఇటువలెఁ దల్లి దనకుఁ దె
ల్పుటయే తడవుగను బ్రదరములను బఱపి, య
ట్టిటుఁ గదలకుండునటులొ
క్కటి శంతను పట్టి యానకట్టం గట్టెన్॥ ౬౧

ఉ॥ ఏటికి నీరమిట్లు ప్రవహింపక యున్నదొ చూతమంచు న
చ్చోటికి వచ్చె శంతనుఁడు శుష్కత గాంచిన మేనితో, మదిన్
నాటిన చింత దెల్పు నయనంబులతోఁ, దెలుపెక్కు మోముతో,
బీఁటలువాఱి నల్లపడి వీడెపుఁ బోఁడిమి లేని మోవితో॥ ౬౨

క॥ గంగం గని "యంగన! హా!
యంగన! హా! యంగనా!" యటంచుఁ గడుం గ
న్నుంగవ విడంగ, గడగడ
నంగము వడఁకం గడంగ, నాతఁడు నిల్చెన్॥ ౬౩

చ॥ "కలవరపాటు చెందకుము క్ష్మాపతిచంద్రమ! నీకు, నాకు, మున్
కలిగిన యట్టి పొందునకుఁ గారణమీవ యెఱుంగు; దింక నా

కలయిక నీకు లేదు; కలకాలము నాకయి యుండఁబోకు; నీ
విల సుఖియించు కాలమిఁక నింతటి నుండియె నిశ్చయంబుగన్ ॥ ౬౮

క॥ నష్టద్రవ్యప్రాప్తి య
దృష్టంబుల నెల్లఁ గడు నదృష్టము గద? నీ
కిష్టము గలిగింపఁగ, మన
యష్టమసుతుఁ దెచ్చితిఁ: గనుమా, గుణయుతునిన్ "॥ ౬౯

చ॥ అని యిటు గంగపల్కఁగ నెయద్బుము, విభ్రమ, మాశ, సంభ్రమం,
బనునయ, మత్యపేక్ష, పరమాదర, మత్యనురాగ, మప్పడా
ననమునఁ దోఁచి, కన్నులఁ గనంబడు కాంతుల వెల్వడంగ, శం
తనునృపతల్లజుండు గనెఁ దల్లికడన్ నిలుచున్న పుత్రునిన్ ॥ ౭౦

సీ॥ శశిబింబమునకు భాస్కరతేజమొదవిన
ట్లుగ వెలుంగుచునున్న మొగము వాని,
శ్రీలమీఁది యపేక్షచేతనో యన శ్రవ
ణములను దాఁకు నేత్రముల వాని,
మగటిమి మొలకలట్లుగఁ ద్రోసికొని వచ్చు
చక్కని నూఁగు మీసముల వాని,
హృదయధైర్యశ్రీని బదిలంపఱుచు కవా
టమ్మన నొప్పు వక్షమ్ము వానిఁ,
మిన్ను విఱిగి మీఁదను బడ నున్న, నాఁప
నోపు నతితరదృఢభుజయుగము వాని,
జానువులఁ దాఁకు బాహుల వానిఁ, గొదమ
సింగముల గెల్చు నడుముబెడంగు వాని॥ ౭౧

క॥ కనుఁగొని శంతనుఁ డంతం
దన చేతులు పాఱఁ జాఁచి, "తనయా, రమ్మా,"
యనినన్ దేవవ్రతుఁడా
తని కాళ్లకు మ్రొక్కె వినయతాత్పర్యములన్॥ ౭౨

ఉ॥ మ్రొక్కిన యక్కుమారకుని మూఁపునఁ జేయిడి, మేలు గోరుచున్,
గ్రక్కున లేవ నెత్తి, తమకంబు దలిర్పఁగ వాని శంతనుం
డక్కునఁ జేర్చి, తీఱని మహాశను బల్మఱు మోముఁ జూచుచుం,
జెక్కిలి నొక్కి, మేనిమిరి, శీర్షము మూర్కొని, పొందె విస్మృతిన్॥

ఉ॥ "ఓ నరనాథసత్తమ, మహోత్తమబుద్ధిసమన్వితుండు, ప్ర
జ్ఞానిధి, జ్ఞానవైభవుఁడు, శైలశరాసనతుల్యవీరుఁ, డీ
సూనుఁడు: వీనిఁ జూచుకొనుచున్ మఱి యిప్పటినుండి నీవు నీ
మానసమందు నన్ మఱవుమా ; పరితాపము నెల్ల మానుమా॥

క॥ తనయా, యో దేవవ్రత,
కని, నిన్నుఁ బ్రయోజకునిగఁ గావించితి ; నీ
జనకునకు నప్పగించితిఁ ;
జనియెద : ననుఁ దలఁచుకొనినఁ జయ్యన వత్తున్॥ ౨౧

ఉ॥ తండ్రి యనంగఁ గేవలము దైవము పుత్రులకున్, మనోవిభుం
డాండ్రకుఁ బోలెనంచు హృదయమ్మున నమ్ముము ; నీవు వాండ్రనున్
వీండ్రను బోలు వాఁడవె? వివేకివి : తండ్రిని గొల్వు ; వారలే
మండ్రో, యదే యవశ్యముగ నాచరణీయము నీకు సర్వదా "॥

క॥ ఈ గతిని బలికి, పలుకుచు
నే గంగ యదృశ్య యయ్యె! నెదిగిన పుత్రుం
డాఁ గనుచు, శంతనునృపుం
డేగిన సతిఁ గూర్చి యించుకించుక మఱచెన్॥ 23

ఉ॥ హస్తిపురంబు వారలది యంతయుఁ జారులు దెల్పఁ, దేరులన్,
హస్తుల, వాజులన్, భటుల, నైదువలన్, శుభదాయకంబులౌ
వస్తుల వెంటఁ బెట్టుకొని వచ్చిరి మంగళవాద్యయుక్తులై,
స్వస్తివచస్తతుల్ ద్విజకులాగ్రణులగ్రమునందుఁ బల్కఁగన్॥

శా॥ ఆ దేవవ్రతు మోముఁ జూడఁగఁ బురంబందున్నతంబైన ప్రా
సాదశ్రేణుల నెక్కి నిల్చిరతివల్, చంద్రుండు త్మోమీఁదఁ దా

నేదో హేతువునం జరింపఁగను బ్రాణేశుం గనం గోరి వి
స్వాదిం జక్కని చుక్కలున్న గతి సర్వేళన్ మనోజ్ఞాంగులై॥ ౭౫

మ॥ "కమలాస్త్రున్ నగు రూపువాఁడె: యమునం, గంజాననా, నాదుచి
త్తము వీనింగనిన్ భ్రమింప; డితఁడుం బ్రాయంబునందుండియున్
రమణీవర్గము వంకఁ జూడఁ," డని వారస్త్రీలు డాబాల రా.
కొమరుం జూచిరి నాఁడు నూతనముగా గుంపై పురీవీథులన్॥ ౭౬

వ॥ ఇట్లు శంతనుభూకాంతుండత్యంతవైభవంబునఁ గుమారసహితుండై
కుమారసహితుండైన యుమారమణుం బోలె హస్తిపురప్రవే
శంబు గావించె॥ ౭౭

ఉ॥ గద్దియ నుండు వేళఁ, జెలుగద్దెను బ్రక్కనె సూనుఁడుండు; ము
ప్పొద్దు భుజించు వేళఁ, దన పొత్తునఁ బట్టి భుజించు; రాత్రులన్
నిద్దుర వేళ, నొక్క గదినే సుతుఁడున్ శయనించుఁ: దద్దయున్
ముద్దును జూపు శంతనుఁడు, పుత్రునితోడిదె లోకమై యిటుల్॥

ఉ॥ ఏండ్లొక నాల్గు దాఁటఁగ మహీశ్వరుఁడయ్యెడఁ, "గుజ్జువానికిం
బెండ్లివయస్సు వచ్చిన, దుపేక్ష యొనర్పఁగరా," దటంచుఁ, "నే
యిండ్లను నేని నా సుతునికీడగు కన్యను జూడుఁ," డంచుఁ బూఁ
బోండ్లను బంపి, యెవ్వతెయుఁ బుత్రునకుం దగదంచు నొంచుచున్॥

క॥ ఇరుగూళ్లకుఁ బొరుగూళ్లకుఁ
దిరిగెఁ దగిన వధువు నొకతె తెచ్చుటకై; యి
ట్లరిగి యొకనాఁడు సూర్యుఁడ
పరిగిరిశిఖరముల మీఁద వ్రాలుచు నుండన్॥ ౮౦

తే॥ గీ॥ మగిడి వచ్చి, యెవ్వరతోడ మాటఁ గాని
మంతి గాని యాడక, మహాచింత దెలుపు
మొగముతోడ శయ్యాగృహమ్మునకరిగి ప
రుండె, రాత్రిభోజనము చేయుటయు మాని॥ ౮౧

చ॥ ఒకరొక రేగి పిల్వ, విభుఁడుల్కఁడు, పల్కఁడు; చెంతకుం గుమా
రకుఁడె స్వయంబుగా నరిగి, ప్రక్కఁ బ్రియంబునఁ గూరుచుండి, "తం
డ్రి, కిరణహీనుఁడైన రవిరీతిగ మీ వదనమ్ము మాసె నే
టికి? విపరీతమెట్టిది ఘటిల్లెను, భోజనమీరు మానఁగన్?॥ ౮౨

చ॥ తనువున జాడ్యమేదొ కలదా? చనిపోయిన మామకాగ్రజుల్
మనమున మీకుఁ దాఁకిరె? సమస్తవిధంబుల మిన్నయైన మా
జనని తలంపునం బడెనె? సాధ్యము గాని యభీష్టమేదొ క
ల్గెనె? కరుణించి నాకు నెఱిఁగింపుఁడు; లెండు, భుజింత," మంచనన్॥

తే॥ గీ॥ "ఏమియును లేదు నాయనా, యీవు భోజ
నంబు నొనరింపు; మాఁకలి లేదు నా," క
టన్న శంతను మాటలకారటము జ
నింప, దేవవ్రతుండు తండ్రి చెలికాని॥ ౮౪

ఆ॥ వె॥ వికటశర్మయనెడి విప్రుని రావించి,
"యోయిశర్మ, నీవు, నాయనయును,
గలిసి యేగినారు గద? నాయనకుఁ జింత
యెచట, నేల, కలిగె? నెఱుఁగఁ జెప్పుమ"॥ ౮౫

వ॥ అనిన విని శంతనుని నర్మసచివుండగు వికటశర్మ వికటంబుగా
శిరంబు నాడించుచు నిట్లనియె॥ ౮౬

మ॥ "యువరాజా, యిది చిత్రమా కథయె; నీకూఁకొట్టఁగా నోపిక
న్న, వచింతున్ విను: మట్లు మీ జనకుఁడన్నా! నన్నుఁ దోడ్కొంచు నె
య్యవియోయాళ్ల నుద్రిప్పి, యింటిమొగమై యే తేరఁ, గాళింది కా
లువ యడ్డంబుగ వచ్చె; దానినపుడెట్లో దాఁటుటంచుండఁగన్॥ ౮౭

ఉ॥ అప్పుడు నీళ్లపై నసితహంసము చొప్పున వచ్చె నేడదో
తెప్ప; సురూపరేఖలకుఁ దిప్ప, బెడంగులకుప్ప, రంభకున్
గొప్పను దెచ్చు నందములకున్ మితియై, రతికైన నప్పగాఁ
జెప్పఁగఁ దగ్గఁ జెన్నుగల చిన్నది యున్నది యల్ల తెప్పపై॥ ౮౮

ఉ॥ ఏఁబదియేండ్లు పైఁబడిన యీతఁడు భవత్పిత; కింక నాదు మా
టా? బలుసాకుతో బ్రదుకు నచ్చపు వైదికవిప్రుడం గదా?
పైఁబడ రంభ వచ్చినను, భంగము రాని యవస్థ మాది; యో
బాబయ! యట్టిమాకును సెబాసనిపించినవామె యందముల్॥ ౮౯

క॥ నా మాటకేమి లే! నె
మ్మోమిటు ద్రిప్పుకొని, కనులు మూసికొని, "త్రినే
త్రా! మదనసంహరా!"యని
కామంబున కేను లోను గాకుంటిఁ జుమా॥ ౯౦

ఉ॥ సాక్షిగ నుండి నేనతని సంగతి యయ్యెడఁ జూచితిన్: సరో
జాక్షి యొకర్తు తప్ప, మఱి యన్యము దోఁచఁగ లేదు తేనికిం;
జక్షులె యింద్రియంబులను సందియమాతనిఁ గూర్చి పొందితిన్,
వీక్షణశక్తి తప్ప మఱి విన్కి మొదల్గలవుండకుండుటన్॥ ౯౧

ఉ॥ ఆ మృదులాంగి మేనిసొగసట్టి యవస్థ ఘటింపఁ, దగ్గదే:
యామె మొగంబు పున్నమ," యటంచును నర్మసఖుండు శర్మ యే
మేమొ వచింపఁ బోవ, ధరణీశ్వరనందనుఁడడ్డువచ్చి, "శ
ర్మా, మఱిచాలు; నాజననియాయమ, తండ్రి వరించినందునన్"॥

వ॥ అని పలికిన, వికటశర్మ చేతులెత్తి మ్రొక్కి॥ ౯౩

క॥ "బ్రతికితిరా, బాబూ! నేఁ
గతఁ జెప్పం గలను గాని, కచకుచములు నా
దు తరంబా వర్ణింపఁగ?
మతిమాలిన కవుల పనియె; మఱి నాకేలా?॥ ౯౪

ఉ॥ అమ్మధో, గౌరి వంటి జగదంబికదో, కవులైన వారు రూ
పమ్మును గూర్చి వెఱ్ఱిగను బద్యములల్లుచుఁ, జెప్ప రాని యం
శమ్ములివంచుఁ, జెప్పఁ దగు సంగతులివ్వని, వారు చూడరే
సు; మ్మహా! గ్రుడ్డియెద్దొకటి జొన్నపొలంబునఁ బడ్డతీరునన్॥ ౯౫

చ॥ అటుపయి మోము దామరఁట! యక్షియుఁ దామరలోనఁ దామరే
యఁట! చరణంబుఁ దామరయె యంట! కరంబును దామరంట! యిం
తటి విపరీతమున్నె? మొలతామర వింటిమి గాని, మేని యం
తట నిటు తామరం గలుగు తన్వి నిజంబుగ దూలగొండియే॥ ౯౬

తే॥ గీ॥ ఇట్టి వ్రాఁతలు వ్రాయుట కేనసహ్య
పడి, కవిత్వంబుఁ జెప్పుట విడుచుకొంటి;
గంటముం బట్టుకొని యొక గంటొ రెండొ
యాకుపై బరికినఁ, గవి గాక పోను॥ ౯౭

క॥ కవులపయిని గల కినుకను
సివమెత్తిన రీతి నిట్లు చెప్పితి నిపుడీ
యవసరము లేని గొడవను;
యువరాజా, వినఁ గదయ్య యున్నట్టి కథన్॥ ౯౮

క॥ తెప్పను నడుపుకొనుచు న
య్యొప్పులకుప్ప యరుదేర, నొడలిని వెడలెన్
గుప్పుమని సుగంధం; బది
తెప్పున మము ముక్కు పట్టి తిగువం దొడఁగెన్॥ ౯౯

తే॥ గీ॥ మొలను గట్టుకొన్నది వట్టి ముతుక గుడ్డ;
మీఁదఁ బైఁట తప్ప, రవిక లేదు; నగలు
లేవు; చందనాదులును లే: వేవిధమున
నొదవె నా రూపరేఖ లాయొడలి తావి?॥ ౧౦౦

ఉ॥ బూరెలగంపమీఁదఁ బడి మూఁగెడి యీఁగల ప్రోగు లాగునన్
ధారణినాథు చూపులు నిదానముగాఁ దీనపైఁ బడంగ, స
న్నారి పయంట చక్కఁగ నొనర్చుచు నాదెసఁ గాంచి, "బాఁపన
య్యా, రవి నెత్తిపై నిలువ, నట్టిటుఁ జూచుచు జాలమేటికిన్?॥ ౧౦౧

ఉ॥ ఇక్కడ నాది తప్ప మఱియే యొక తెప్పయు లేదు; నేనునున్
రొక్కము గోర, కిప్పని పరుల్ ననుఁ గోరినఁ జేయుచుందు; నొ

కొక్కరిగాఁగ మిమ్మవలి యొడ్డునఁ జేర్చెదరం," డటంచు నా
దిక్కుననుండి తేనిదెసఁ ద్రిప్పె గిఱుక్కున దృక్కదంబముల్ ॥౧౦౩

చ॥ ఘృతమును దొప్పలన్ గుటక త్రిప్పక త్రావెడి పప్పు బాఁపన
య్యతెఱఁగునన్ ధరారమణుఁడయ్యెడఁ గర్ణపుటంబులన్ వచ
స్తతి సతి వెల్లిగొల్పిన సుధారసమెల్లను గ్రోలి, " బాలికా,
యితఁడెటువంటి వేఁఱయిన నీఁదఁగలం," డని నన్నుఁ జూపుచున్॥

ఆ॥ వె॥ తెలవకెదురుగాఁగఁ దెప్పపైఁ గూర్చుండ,
నడుపుకొనుచుఁ బోయెఁ బడుచుమిన్న ;
యేట హాయము ద్రోసి యీఁద సాగితి దాని
తోఁక పట్టుకొనుచు రాకుమార ॥ ౧౦౪

ఆ॥ వె॥ కుక్క తోఁక పట్టుకొనుచు గోదావరి,
గోవు తోఁక పట్టుకొనుచు వైత
రిణియు నీఁదు వారి రీతిని దురగపు
చ్ఛమును బట్టుకొంటి యమున 'నీఁద॥ ౧౦౫

ఉ॥ ఆవలి యొడ్డు చేరుకొని యారయఁగా నొక చెట్టు నీడ," నో
భూవర, దాశరాజునకుఁ బుత్రిక ; నాతని సమ్మతిన్ మిమున్
నే వరియింతుఁ; గన్యలకు నీతి యిదే గద ?" యంచుఁ గన్నె యా
రేవున నేలమీఁద బొటవ్రేలను రాయుచు నిల్చె సిగ్గునన్॥ ౧౦౬

క॥ దాశమన గొప్ప పురమో
దేశమొ కాఁబోలు నని మదిన్ నమ్ముచుఁ బే
రాశను నేనుండఁగ, నొక
క్రోశమరిగి బెస్తపల్లెకుం బడుచరిగెన్॥ ౧౦౭

చ॥ వలలొక యోరఁ, దెప్పలొక వైపునఁ, దెడ్లొకవంకఁ, నెండుచేఁ
పలొకస్థలానఁ, గ్రొత్తగను బట్టిన చేఁపలతోడి యీఁతబు
ట్టలు పెఱచోట, నచ్చటచటం గల ; వైనను, బల్లెయందు న
మ్మలయజగంధి మైవలపు మచ్చెపుఁ గంపు నడంచెఁ బూర్తిగన్॥

సీ॥ బిళ్లల మొలత్రాళ్లు బిగియఁగా దోఁపిన
వెడఁద గోఁచులు ముందు వ్రేలువారు,
తిరుగలి దిమ్మల తీరును గల్గి రో
మమయంబులైన వక్షముల వారు,
కుడికేలు పైకెత్తి యెడమకేలను దొడ్డ
బిగి గల్గ బురిత్రాళ్లు పేను వారు,
మాటికి నీటఁ గ్రుమ్మఱుటఁ బిక్కల నొకిం
చుక రంగు మాఱు వెంద్రుకల వారు,

బెస్తలోక కొండజాపల్లె పెద్ద గడ్డి
గుడిసె ముందుండి: రండఁ బెన్గోఁచి వాఁడు,
తట్టపాగా తలను గల యట్టి వాఁడు,
దట్టమగు బొట్టు గల వాఁడు దాశరాజు॥ ౧౦౯

క॥ "రండో బాబులు! దండా
లండీ," యని మేలి తాటియాకుల చాఁపం
గొండికచేఁ దెప్పించి, య
తండప్పుడు సత్కరించెఁ దగినట్లు మమున్॥ ౧౧౦

తే॥ గీ॥ సేతుదేటి మీ జనకుఁడత్యాదరమున
దాశరాజును గాంచి, "శంతనుఁడ నేను;
నన్ను యమున దాఁటించిన కన్నె నీదు
కూఁతురే గద?" యని యడుగుటయు నతఁడు॥ ౧౧౧

క॥ "అయ్యో! నా బ్రతుకా! బా
బయ్యా, నాకంత మంచి పడుచు గలుగునా?
యయ్యమ్మ రాచ," దని నా
నెయ్యునితో సతి జననము నిజముగఁ దెలిపెన్॥ ౧౧౨

వ॥ అది యెట్టిదంటేని॥ ౧౧౩

తే॥ గీ॥ ఉపరిచరవసువనెడి రాజోత్తముండు
గిరికి ఝరికిని బుట్టిన గిరిక యనెడి
భామినిఁ వివాహంబయి భూమి నేలెఁ:
వాసవుండయ్యె నింద్రుండు వసుని బోలి॥ ౧౧౪

తే॥ గీ॥ వసుచరిత్రమత్యద్భుతావహము సుమ్ము:
యేటికిం గొండకు నయిన కూటమి సరి
గాఁగ వర్ణించుటెటు? శ్లేష కవిత నేర్చు
బట్టివఁడో చెప్ప వలయుఁ బ్రబంధముగను॥ ౧౧౫

ఉ॥ మాటల పోగుగా నృపకుమారక, తోఁచెను దాశరాజు: మో
మోటము లేక మమ్ముఁ దన ముందఱఁ గట్టి పడంగవైచి, యే
నాఁటివొ గాథలుం గథలు నాలుక నొవ్వక చెప్పె; మాటలే
మోటులు గాని, సంగతులు ముచ్చట గొల్పుచునుండె నన్నియున్॥

క॥ శుక్తిమతీకోలాహల
యుక్తి వలన గిరిక పుట్టెనో, లేదో? యా
ప్రాక్తనకథ కేరీతి ప్ర
సక్తి గలదు ముఖ్యమైన చరితముతోడన్?॥ ౧౧౬

క॥ గిరికాకథ యేనియుఁ ద
చ్చరితముతో నంతగాఁ బ్రసక్తి గలదె? జా
లరి పెద్ద మాటలఁ నే
ర్పరితనముం జూప దానిఁ బ్రస్తావించెన్"॥ ౧౧౭

వ॥ అని వికటశర్మ దేవవ్రతుని నెమ్మోము గనుంగొని యూఁగి॥౧౧౮

క॥ "నేనును మాటల పోగును
గానా యని కాదె నీ మొగంబునఁ జిఱున
వ్వానితి? విదిగో, టూకీ

తే॥ గీ॥ అద్రిక యటన్న దొక యప్సరోంగన యఁట!
శాపమున నాపె యమునలోఁ జేఁపగాఁగ
నుండి, వసువీర్యమున గర్భ మొంది, కనియె
నంట మన కథానాయకురాలి నచట!॥ ౧౨౧

ఆ॥ వె॥ మత్స్యగంధి యయ్యె మత్స్యగర్భంబున
జననమౌట వలన; జాలరులును
శక్తి పేరు పెట్టి సత్తమ్మ యనిరి; “ము
త్తెమ్మ యనఁ దగు మన యమ్మి,”యనిరి॥ ౧౨౨

వ॥ అద్రికాగర్భశుక్తిమౌక్తికమణి యైన యబ్బాలికామణిని దాశరాజు తన పుత్రికగాఁ బెంచె నఁట! యువరాజా, యతఁడిట్లు మత్స్యగంధి జననవృత్తాంతంబెఱింగించి, కడమ కథ యీవడువున నుడివె: “బాబూ, శంతనురాజా॥ ౧౨౩

ఆ॥ వె॥ కడుపునందుఁ దాను గన లేదు గాని, మా
యింటిదానికమ్మి కంటిపాప;
సంటిపాప యైన సత్తమ్మ పెరిఁగి, మా
యింటి దీపమయ్యె నిన్ని నాళ్లు॥ ౧౨౪

క॥ మేము సదువుకోకున్నను
సామీ, మాముద్దు బొట్టె సదువుకొ[illegible]: దో
నామాలంట! య దేదో
రామాయణమంట! నాకు రావా పేరుల్॥ ౧౨౫

ఉ॥ అమ్మికి బాఁపనయ్య గురువై చదువుల్ సదివించినాఁడు; స
త్తమ్మను జూచి సత్యవతి యంచొక పేరయవారు పెట్టఁగా,
నెమ్మదిగాఁగ మేమెటులొ నేరుచుకొంటిమి క్రొత్త పేరినే:
తిమ్మిని బమ్మి సేయఁ గల దేవుఁడు బాఁపనవాఁడు బాబయా॥ ౧౨౬

ఆ॥ వె॥ పుస్తకానిఁ బట్టి బొట్టె సదువ, నీటి
పెకి లేచు నేటిపరిగెలెల్ల;

గంటమొకటి పట్టి గబగబమని వ్రాయఁ,
బిల్ల యచ్చరాలు జెల్ల గ్రుడ్లు ॥ ౧౨౭

ఆ॥ వె॥ గుడ్లులనె నటంచు గూఁబలు నులిపినాఁ
డయ్యవారు మా చినబ్బిగాని ;
నేతి బొట్టు పడఁగ, నిడుపులై నాల్కలు
తిరుగు బాఁపల, కేటు తిరుగుమన్న" ॥ ౧౨౮

వ॥ అని పలుకుచున్న దాశరాజు వాక్ప్రవాహంబునకేను గట్టు వైచి, మత్స్యగంధిశరీరసుగంధంబునకుఁ గారణంబేమని ప్రశ్నింప, నతం డిట్లనియె ॥ ౧౨౯

తే॥ గీ॥ "పిల్ల పుట్టినప్పటి యొళ్లు కుళ్లు కంపె ;
యింత మంచి వాసన దానికెట్లు వచ్చె
ననఁగ, వింత యైనట్టిదె యా కతయును :
సత్తమయె చెప్పె మాకు నా సంగతి మును ॥ ౧౩౦

క॥ జేఁడా, విను : మా చిన్నది
యీడేటిక ముందునుండి యేఁటి కడకు నా
తోడనె వచ్చుచు, నాకడ
వేడుకతోఁ దెప్ప నడుపు విద్దెను నేర్చెన్ ॥ ౧౩౧

క॥ ఏటిని గల నీటికి బలు
పోటు గలిగినపుడు, దారిఁ బోయెడి వారిన్
దాఁటించు నామె ; యటకొక
నాఁటి మొదటి జామునందు నదిఁ దాఁటుటకై ॥ ౧౩౨

క॥ గడ్డము మీసలు గలిగిన
దొడ్డ తబిసి వచ్చి, బత్తితోఁ గొలిచిన మా
బిడ్డపయి దయ గలిగి, యొక

వ॥ నాఁటినుండి మా యమ్మి యొడలికిట్టి కమ్మని వాసన గలిగినది; పసరు గాద్ధు, మంతరమని మా యమ్మి యనును గాని, మంతరము సింతకాయలనే రాల్ప లేదు; మా యమ్మి యొడలి కంపుఁ గూర్చి మేము సింతపడకుండ మాన్పఁ గలదా? అట్లు పోలుసు కంపు పోయి, కమ్మని వాసన వచ్చిన మాయమ్మికి మఱి రెండు పేరులు కలిగినవి; ఒత్త లేక నేను గింజుకొను పేరులు: గంధవతి, యోజనగంధి, యన్నవి; అమ్మయ్యా!" యని దాశరాజుచ్ఛ్వసింప, నతనిఁ జూచి మీతండ్రి యిట్లనియె॥ ౧౩౪

మ॥ "వసురాజేంద్రుని పుత్రియై, సకలశోభాధాత్రియై, నవ్యది
వ్యసుగంధామలగాత్రియై వెలయు మీయమ్మాయి నాకిచ్చి నా
యసువుల్ నిల్పెదునట్లు వేగముగఁ గల్యాణంబు గావింపు; స
ర్వసమేతంబుగ నేను దాసుఁడనుగా వర్తింతు నీ పుత్రికిన్"॥౧౩౫

వ॥ అనిన నుబ్బు తెలుపు వెడఁద మోముతో దాశరాజు॥ ౧౩౬

క॥ "అబ్బో! యబ్బో! యూనే,
దబ్బున రాఁగదవె యింటిదానా! యో పె
ద్దబ్బీ! చిన్నబ్బీ! యీ
యబ్బురమును మీరు వింటిరా? రా రండీ"॥ ౧౩౭

వ॥ అని పిలువ॥ ౧౩౮

సీ॥ పసుపుఁ బూఁతను గ్రొత్త మిసిమి వచ్చిన మొగం
బునఁ బెద్ద కుంకుముబొట్టు దనర,
నాగుజోళ్లు చెవుల, నాసికఁ నత్తుఁ, గ
త్తుకను బంగరుఁదీఁగె దుఱఁగలింపఁ,
గొంగెల్ల నడిమికంగుగఁ జుట్టి కట్టిన
నాగులకోక మేనం దలిర్పఁ,
గుదిరికతోఁ బెట్టుకొన్నట్టి కప్పుఁగొ
ప్పునఁ బెద్ద చేమంతిపువ్వు దనరఁ,

గిల్లు-మని మట్టియలు మ్రోయఁ, గుల్కు- నడల
నరుగుదెంచెను ధనలక్ష్మి యనెడి దాశ
రాజు గృహలక్ష్మి, యుభయపార్శ్వములయందు
నిరువురు కొమాళ్లు ప్రేమతో నేగుదేర॥ ౧౩౯

ఉ॥ వచ్చిన యంత వారికి భవత్పిత శంతనుఁడంచుఁ దెల్పుచుం,
"హెచ్చయినట్టి చుట్టఱిక, మెంతటి పున్నెమొ గాని, యమ్మికిం
దెచ్చెను దైవ: మిచ్చటికి దేశము నేలెడి ఱేఁడె వచ్చి, తా
నిచ్చను మెచ్చి, యమ్మి నిపుడిమ్మని కోరెను నిండు కూరిమిన్"॥

క॥ అని యంతట సతితో మం
తనమేదో కొంత సలిపి తల యూఁపుచు, శం
తనుఁ గని, "యాంట్రెండఱయా ?
మనుఱేఁడా, నీకు మఱి కొమాళ్లెందఱయా?"॥ ౧౪౧

వ॥ అని దాశరాజడిగిన, మీతండ్రి యాతనికిట్లనియె॥ ౧౪౨

ఉ॥ "సువ్రత యంచుఁ బేర్వడిన సుందరిఁ బెండిలియాడి, యేకప
త్నీవ్రతమాచరించితిని ; దేవి పదేఁడులు దాఁటకుండనే
తీవ్రవిషాదమేదురనదిం ననుఁ ద్రోయుచుఁ బోయె ; నాకు దే
వవ్రతుఁడొక్కఁడే సుతుఁడు : వాఁడిఁకనిర్వది యేండ్లవాఁడగున్"॥

ఆ॥ వె॥ అనిన దాశరాజు విని, "నీకుమారుండు
వచ్చి నన్ను నడుగ వలయు," నంచుఁ
బలికి, యెన్ని గతుల బతిమాలినను మఱి
పలుకకూరకుండెఁ బరమమూర్ఖు॥ ౧౪౪

ఉ॥ కొట్టుటు లెక్కి-యున్న మొఱకుం విడి, మీ జనకుండు వెంటనే
గుఱ్ఱముమీఁద నెక్కి-, తనకుం వెనుకం నను నిల్పుకొంచుఁ, దా
గిఱ్ఱున నింటిమోమయి బిగింపుమొగంబున నూరు సేరె, నే
మొఱ్ఱను బెట్టినం వినక ముప్పును దెచ్చెడు నట్టి దాడుతో॥ ౧౪౫

శా॥ చండాలుండు సుమా సుమాంబకుఁడు! బెత్తం గన్యకం గోర వృ
ద్ధుండౌ టేనికి వాంఛ గొల్పె; మదియందున్ సిగ్గునం గ్రుళ్లినా
తండే మోమునఁ, ''పెండ్లిమాటలకుఁ బుత్రా! పో,'' మ్మనుందానినున్?
రండాగర్భము వంటి చిక్కుదశ సంప్రాప్తించె మీయయ్యకున్॥

ఉ॥ అంతటి కంటెఁ జిక్కొకటి యక్కట! నాకు ఘటిల్లె: నీవు వృ
త్తాంతముఁ జెప్పుమంటివి గదా? యటు చెప్పుచునుండ, నిద్ర సా
మంతముఁ జూప నాపయికి మాటికి మాటికి,'' నంచు వాక్యమున్
సాంతము చేయకే వికటశర్మ పరుండెను వట్టి నేలపై॥ ౧౪౮

మ॥ దిగులుం బాసిన యట్టి మానసముతో దేవవ్రతుండంతఁ ది
న్నగ రాజేంద్రుని సన్నిధిం దటిసి, ''నాన్నా, విన్నపంబొండు చ
క్కగ నాలింపుఁడు: వంశమున్ నిలుప నొక్కండైన పుత్రుండుఁ, గాం
చఁగ నొక్కండగు కన్నుఁ, జాలమి ప్రపంచంబందు లోకోక్తియే॥

ఉ॥ మా పెదతండ్రి మాని జనమార్గము బాల్యమునందె పట్టి దే
వాపి చనంగ, మీరును భవత్సహజన్ముఁడు బాహ్లీకుండునున్
దాపున నుండఁ బట్టిరె గదా యొక చింతయు లేక తాతగా
రూపిరి హాయిగా విడిచి, రుండును వంశమటంచు నమ్ముచున్॥ ౧౪౯

చ॥ పొడమిన యంత, మానవులఁ బొట్టను బెట్టుకొనంగ నెన్నియో
వడువులఁ జావు గాచుకొని వచ్చును; గర్మము చాలకెప్పుడె
క్కడ మృతి నాకు చేకుఱునొ? కావునఁ గ్రమ్మఱ మీరు సంతతిం
బడయుటవశ్య; మింకొక వివాహము చేసికొనుండు దానికై॥ ౧౫౦

చ॥ వసుసుత యైన సత్యవతి వంకను మీమది పాఱెనంచు న
ర్మసఖుఁడు శర్మ చెప్పె వివరంబుగ; మా చిననాన్న, నేను, ని
న్నిసి చని దాశరాజుఁ గని, నిశ్చయవాక్యములాడి వత్తు: మ
ట్లు సెలవొసంగుఁ; డెంగిలిపకుం,''డని తండ్రిని లేపి, వెంటనే॥

చ॥ అరదము లెక్కి బాహ్లికుఁడు, నాతని భార్యయుఁ, బేరటాండ్రు, భూ
సురులును, మంగలుల్, తెరువుచూపెడి శర్మయుఁ, దాను, బైనమై

త్వరితముగాఁగ నేగి, తెలవాఱక మున్ రథనేమిఘోషలున్
హారిచయహేషలుం దనర నల్లరిగాఁ బడె బెస్తపల్లెపై ॥ ౧౫౨

మ॥ దివిటీదొంగలటంచు డెందముల సందేహించుచున్ జాలరుల్
దవులం బాఱ, నృపాత్మజుం డపుడు కేల్సాచెత్తి, "దేవవ్రతుం
డ; వివాహార్థము వచ్చితిన్; భయము పొందం బోకుఁ," డన్నంతనే
సవిధస్థానము చేరిరొక్కొకరె బెస్తల్ పిన్నలుం బెద్దలున్ ॥ ౧౫౩

క॥ "శంతనుని కొడుకువా? బలు
సంతోస," మటంచు నెన్నొసటి హస్తముతో
వింతగఁ గనుఁగొనుచు, నతని
చెంతకపుడు దాశరాజు చెచ్చెర వచ్చెన్ ॥ ౧౫౪

క॥ శకటములు దిగిరి వీరలు;
నికటమునకుఁ జనిరి వారు: నిలిచిరి వారొం
డొకరి మొగంబుల దెస మా
టికిఁ జూపులఁ బఱపి దివ్వటీల వెలుఁగునన్ ॥ ౧౫౫

క॥ ఇరు దెసలఁ గలుగు తరుణులు
బిరబిర నొక కడకుఁ జేరి, పిఱుఁద నిలిచియుం
డిరి; దేవవ్రతుఁ డుచ్చ
స్వరమొప్పఁగ దాశరాజు వంకం గనుచున్ ॥ ౧౫౬

శా॥ "తాతా! నీ సుత యైన సత్యవతి సౌందర్యంబు నాతండ్రికిం
జేతఃప్రీతిని గల్గఁ జేసెను; మహాశ్రీమంతుఁడౌ శంతనుం
డేతన్మాత్రుఁడుగాఁగ నెంచెదవొ సుమ్మీ! యట్టి భూనేత జా
మాతంగాఁ గొనవయ్య: తద్విషయమై మాటాడ నే వచ్చితిన్ ॥

ఉ॥ నా జనయిత్రి నాకభువనంబున నున్నది; నేఁటినుండి నా
కీ జగమందు సత్యవతియే జనయిత్రి; తదీయవాక్యమున్
నే జవదాఁట నెన్నఁడును; నిశ్చలభక్తిని దత్పదాబ్జముల్
పూజ యొనర్తు, మా జనకు పూతపదంబులతోడ నిత్యమున్" ॥ ౧౫౮

ఆ॥ వె॥ అనిన దాశరాజు, "మనుమఁడా, సంతోస
మయ్యె నీదు మాటలాలకింప;
నా కొమార్తె కడుపునం బుట్టు వారల
మాటయొ?" యన నృపకుమారకుండు॥ ౧౫౯

ఉ॥ "వారల నాదు సోదరుల వైఖరినే కనుఁగొందుఁ గాని యీ
ధారణిలోఁ నరుల్ సవతితమ్ములఁ జూచినయట్లు చూడ; నే
నేరిచినట్టి విద్యలను నేర్పెద; భార్యల నేనె కూర్చెదన్;
భారము నాదె సర్వ," మని పల్కినఁ గ్రమ్మఱ దాశరాజనెన్॥

క॥ "అది గాదయ్యా, నేన
న్నది; రాజ్యము నీజ్యమెల్ల న్యాయముగా నీ
యదె గద?" యన దేవవ్రతుఁ
డెదలోపలి కోర్కె తెలిసి యెల్లరు వినఁగన్॥ ౧౬౧

మ॥ "ఎకరారిప్పుడె దాశరాజ, వినవోరియీ, చేయుచున్నాఁడఁ: బై
తృకరాజ్యంబునయందు నాకుఁ గల హక్కెల్లన్ విసర్జించితిం;
దకరారేమియు లేక యుండఁగ భవద్దౌహిత్రుఁడే భూమిభా
రకుఁడై యేలుతఁ బుత్రపౌత్రచయపారంపర్యమీరాజ్యమున్"॥

చ॥ అని శపథంబుఁ జేసె; నపుడచ్చటి చెట్లను విచ్చియున్న క్రొ
న్ననలు ప్రభాతమారుతమునం బడి, వేల్పులు పుష్పవృష్టి నిం
చిన గతిఁ దోఁచెఁ; దెమ్మెరలచే యమునన్ జనియించినట్టి మం
ద్రనినదమంత దుందుభినినాదము చందమునన్ వినంబడెన్॥ ౧౬౩

మ॥ "బళిరా పుత్రక! తండ్రి మాట నిలుపం బద్నాల్గు సంవత్సరం
బులు రాజ్యంబు త్యజించె నంచుఁ గద రాముండొందెఁ బ్రఖ్యాతి? నీ
వలె రాజ్యంబును దండ్రికోసమయి యావజ్జీవమున్ వీడు వా
రలు లే," రంచును వెన్నుదట్టెఁ బ్రియమారన్ బాహ్లికుండాసుతున్॥

చ॥ "ఎవరవొ గాని, నీవు నిజమే యనినాఁడవు బాబయా! యితం
డు విడిచెఁ గాని, రాజ్యము నిటుల్ వలదంచును బల్కఁ బోదు రే

భువిని మఱొక్క.? రీతనికిఁ బుత్రకులెందఱు పుట్ట, నందఱుం
దవులుచు రాజ్యమిమ్మనుట తప్పు," దటంచును దాశరాజనెన్॥

క॥ "ఎంతటి యాశ!" యటంచు ది
సంతులు పలుకుటకు వికటశర్మ గడంగన్,
శాంతనవుఁడతని నాఁపుచు
శాంతము మూర్తీభవించు చందము దోఁపన్॥ ౧౬౬

మ॥ కలఁకం దేఱినయట్టి నెన్నుదుటితోఁ, గాంతుల్ వెలారించు చూ
పులతోఁ, నించుక యంత మాత్రముగ విప్పం గన్న వక్షంబుతోఁ,
మొలపై నిల్పినయట్టి కేలుగవతోఁ, మోమెత్తి మిన్ చూచుచున్,
నిలువంగాఁ బడి పల్కె నంబుదమహానిర్ఘోషరావంబునన్॥ ౧౬౭

మ॥ "తనయుల్ నాకు జనింతురంచుఁ గద తాతా, దాశరాజా, భవ
న్మనమందున్ భయమొందుచుంటి? విటు విన్మా, శంకలన్ మాని; యో
జననీ, సత్యవతీసతీ, మదిని లజ్జన్ మానుచున్ నీవునున్
వినవమ్మా; వినుఁడో మహాప్రజలు, మీవీనుంగవల్ విచ్చుచున్॥

శా॥ ఓ ముక్కోటి సుపర్వులార, వినుఁడీ; యో పంచభూతంబులా
రా, మీరున్ వినుఁ; డంతరిక్షమునఁ దారాచంద్రమస్సూర్యులా
రా, మీరున్ వినుఁ; డో త్రిమూర్తులు, వినుం; డన్నింటికిన్ సాక్షివా
స్వామీ, సర్వజగన్నియంత, విను దేవా, నీవునున్ సాక్షివై॥

శా॥ యావజ్జీవము బ్రహ్మచర్యమె వ్రతంబై యుండఁగా నేనిలన్
వైవాహంబును మానియుండెద; మనోవాక్కాయకర్మంబులన్
స్త్రీవర్గంబును మాతృభావమున నీక్షింతున్; సతీరూపునిన్
నే వీక్షింపక యుండెదం బురుషు నేనిం, బ్రాణముం బోయినన్॥

మ॥ ఇసుమంతేనియు నీప్రతిజ్ఞ చెడునట్లేనుండుటే సంభవిం
ప, సురాపానము సల్పు వారు, గురుభామాసంగమంబొందు వా
రు, సువర్ణంబు హరించు వారలును, విప్రుం జంపు వారుం, దదీ
యసహాయుల్, గనుఘోరమౌ నరకముల్ ప్రాప్తించునా కెప్పుడున్॥

శా॥మాతృద్రోహమతుల్, పితృఘ్నులును, గోమాంసాశనుల్, నాస్తికుల్
భ్రాతృద్వేషులు, దేవవిత్తహరణుల్, పాషండులున్, న్యాయవి
క్రేతల్, పొందెడి ఘోరవాదినరకక్లేశంబులే గాంతు స్త్రీ
జాతిం గామకళంకితంబయిన వాంఛన్ నేను వీక్షించినన్॥ ౧౭౩

మ॥పురుగుల్ గాఱుచుఁ జత్తుఁగాకఁ! బిడుగుల్ మొత్తంబుగాఁగోటి నా
శిరమందుం బడుఁ గాక! నెవ్వరును నన్ జేరంగ రానీని కు
ష్ఠరుజం గ్రుళ్ళుదుఁ గాక! నన్నమును నోటం బెట్టుకొన్నంతనే
గరళంబయ్యెడుఁ గాక! స్త్రీలదెస నేఁ గామంబుతోఁ జూచినన్''॥

వ॥ అని॥ ౧౭౪

శా॥ భీష్మంబైన ప్రతిజ్ఞ యిట్లు సలిపెం బృథ్వీశసూనుండు; "బేష్!
బే! స్మెచ్చందగు ని!''న్నటంచును వచించెన్ దాశరా; జంతటన్;
"యుష్మన్నామము భీష్ముఁడే!'' యనుచు ఖిన్నున్ దిక్కులున్ మ్రోసె; న
ర్చిష్మంతుండయి భీష్మురీతి రవి దోఁచెన్ మింటఁ బ్రాగ్దిక్కునన్॥

చ॥ "బళిరె! బళా! సెబా! సహహ! బాఁపురె! వహ్వారె!'' యన్న వాక్యముల్
నలుదెసలన్ వినంబడె; ధణంధణ యంచును దుందుభిధ్వనుల్
వెలువడె దిక్తటంబులను; వేల్పులు మింటను బుష్పవృష్టి జ
ల్లులఁ గురియించి; రర్కరుచులం దెలివిం గనె దిక్కులన్నియున్॥

చ॥ "జనకుఁడు సౌఖ్యమొందఁ, దన జవ్వనమిచ్చెను గొంత కాలమం
చును గద పూరునిన్ ఘనయశుండనియందురు? తండ్రి సౌఖ్యముం
గనుటకుఁ, బ్రాయమెల్ల నిటుగాఁగ నొసంగిన నీదె యెక్కుడౌ
ఘనత!'' యటంచు బాహ్లికుఁడు కౌఁగిటఁ జేర్చుచు మెచ్చె భీష్మునిన్॥

తే॥ గీ॥ "తోడికోడలా, రావమ్మ! నేఁడు నీవు
హస్తినాపురికిన్ రాజ్ఞివైతి,'' వనుచు
వసుకుమారిక యగు సత్యవతిని గౌఁగి
లించుకొనె గారవమున బాహ్లికుని భార్య॥ ౧౭౮

క॥ "ఆనందం, బానందం
బా! నేఁడే శుభముహూర్తమత్యనుకూలం
బైనది గల; దిఁక బాఁపలు,
సానుతె ధను," లనుచు వికటశర్మ చెలంగెన్॥ ౧౭౯

తే॥ గీ॥ "పాలుఁ, బెరుఁగును, నేఁయి, బియ్యాలుఁ, గాయ
గూరలను దెండు వియ్యాల వారి కొఱకు
దబ్బున," నటంచు నఱచెను దాశరాజు;
పెండ్లి కళ వచ్చి శోభిల్లె బెస్తపల్లె॥ ౧౮౦

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబు వా:
రనఘులు వారి పాదముల నొదలఁ దాలిచి, దానిలోని భీ
ష్మునిచరితంబు గ్రొత్తఁదనముం గన వ్రాసినవాఁడ నేను నే
ర్చిన గతి సెట్టిలక్ష్మినరసింహసమాఖ్యుఁడ, ధీరసఖ్యుఁడన్॥

సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, దదంతరంగ
కార్యదర్శిని, దన్మహోదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలక్షణుండ॥



# ప్రభాసశాపవిమోచనము.

## III

"రాజన్న పేరు సార్థకమేకులంబు వా
రలకు వంశకరుండు రాజు గానఁ,
పేరు దెచ్చెను గులాధారుఁడై పూరుఁడే
వంగడంబునకు భూవలయమందు,
దేశంబునకుఁ బేరు దెచ్చిన భరతుఁడే
యన్వాయమున రాజై జనించె,
నరిమనోంబుజహస్తియౌ హస్తివలనఁ బే
ర్వడసె నే వంశంపు రాజధాని,
పురుడు లేని భూవరుఁడయి కురుఁడు నూత్న
మైన పేరును దెచ్చె నే యన్వయమున,
కట్టి కౌరవాన్వయమిలయందుఁ బేరు
గన్న యట్టిద యో రాజకన్యలార! ॥ ౧

క॥ కురుని యనంతరమాఱవ
తరమున హస్తిపురి రాజధానిగ నేలెన్
ధరను బ్రతీపుఁడు, హృతపటు
తరప్రతీపుఁడు, రవిప్రతాపుండగుచున్.॥ ౨

క॥ జనపతి యయ్యెఁ బ్రతీపుని
యనంతరము హస్తిపురికి నతని సుతుఁడు శం
తనుఁడు ; తదీయ యశంబెం
తనుఁడు నుడువఁగా నశక్యమహీపతికైనన్ ॥ 3

క॥ ఆ శంతను ప్రథమసుతుం
డా శాంతములందుఁ దనదు యశమును రిపుభూ
మీశులతో నిలిపె నితఁడు
కాశీభూరమణకన్యకామణులారా!" ॥ ౪

చ॥ అనుచు స్వయంవరస్థలసమంచితమంచగతావనీంద్రనం
దననివహంబునం దనరు తన్నుఁ గరాంగుళితోడఁ జూపి, యా
పనికి నియుక్తమైన కలభాషిణి యన్పెలికత్తె నిల్చి తె
ల్పిన, సభలోన లేచి యిటు భీష్ముఁడు పల్కె గభీరభాషలన్॥ ౫

మ॥ "అతిరమ్యాంగులు కాశిరాజసుతలౌ నంబాంబికాంబాలికల్
పతులన్ నేఁటి స్వయంవరంబున వరింపం బోదురన్నట్టి సం
గతి యాలించిన యంత నాయనుజుఁడిక్కన్యాత్రయంబందు నొ
క్కతె యేనిం దనకున్ లభించు నను వేడ్కన్ వచ్చె నిచ్చోటికిన్॥

ఉ॥ ఏను వివాహమొల్లనని యెల్లరెఱింగినదే," యనంగ నం
బానలినాయతాక్షి కలభాషిణి వీనులలోన నేమొ యే
మో నుడువుల్ వచించి, మఱియున్ మఱి భీష్ముని జూచె: నామెక
న్గోనలఁ గావి యేర్పడుట కోపముచేతనొ? ప్రీతిచేతనో?॥ ౬

క॥ కలభాషిణి భీష్ముని దెసఁ
దిలకించుచు, "మీరిటకరుదేరఁ దగరు: పెం
డిలి యొల్లని రాజతనూ
జులకు, నపుంసకులకు, నిది చోటే నిలువన్?" ॥ ౭

ఉ॥ నావుఁడు భీష్ముఁడిట్లనియె: "నాపిత రెండవపెండ్లిఁ గోరఁ, ద
ద్భావితనూభవార్థమయి పైతృకరాజ్యము నుజ్జగించి, యా
జీవము బ్రహ్మచర్యమును జేయఁ బ్రతిజ్ఞ వహించి, వారికే
నే వధువుల్ ఘటిల్లునటులేర్పఱుపంగను బాస చేసితిన్॥ ౮

క॥ తరుణీమతల్లిగ వసుం
ధరఁ బరఁగిన నాదు సవతితల్లికి సుతులి

ర్వారు సకలసుగుణయుతులొాద
విరి చిత్రాంగదవిచిత్రవీర్యులనంగన్ ॥ ౧౦

ఉ॥ సింగపుఁ బీఠి నెక్కఁగను జేసితిఁ దండ్రి యనంతరంబు చి
త్రాంగదునిం, బ్రతాపరవియై తొలిప్రాయమునందె యాతఁడ
స్తంగతుఁడైన, సర్వజనసమ్మతచర్యుని నివ్విచిత్రవీ
ర్యుం గురురాజుఁ జేసితిఁ : బ్రయోజకుఁడయ్యె నితండు పూర్తిగన్॥

ఆ॥ వె॥ సవతితల్లి యైన సత్యవతీదేవి
"నాయనా !" యటంచు నన్నుఁ బిలిచి,
"కాశిలోన రాజకన్యలకు స్వయంవ
రమ్ము ; భ్రాతతోడఁ బొమ్మట," కని ॥ ౧౨

ఉ॥ ఆలలనామతల్లి యిటులానతి యీయఁగ వచ్చినారమీ
బాలుఁడు నేను," నంచుఁ దనప్రక్కనె యున్న విచిత్రవీర్యునిఁ
వ్రేలను జూప, నా లలితవేషుని బాలికలైన యంబికాం
బాలికలాశతోడఁ బలుమారును కనుంగొనిరోరచూపులన్ ॥ ౧౩

ఉ॥ వింశతి వత్సరంబులను వెల్లడి చేసెడి మీసకట్టు శీ
తాంశునిలోని చిహ్నమటులాననసీమఁ దలిర్ప, మారుఁడ
న్సంశయముఁ ఘటింపఁ గల చక్కనివాని, విచిత్రవీర్యు, రా
డ్వంశమణిఁ వరించుచు మెడం బువ్వుదండలు వైచిరాచెలుల్ ॥

ఉ॥ అంబ స్వయంబ సిగ్గుబిడియంబులు లేకిటు పల్కె : "నేను సా
ళ్వుం బతిగా వరింప మదిలోనఁ దలంచితిఁ గాని, బ్రహ్మచ
ర్యంబు వ్రతంబుగాఁ గలుగు నాతఁడు వచ్చెను గాన వానిఁ బం
తంబున కేవరింతు," నని దండను జేతులతోడ నెత్తినన్ ॥ ౧౪

చ॥ బెదరుచు లేచి నిల్వఁబడె భీష్ముఁడు : "సిగ్గద లేని యాఁడుదాఁ
డుదగునె ? యీమె పుట్టిన కుటుంబములోపలి కన్యలేటికిం ?
బదుఁడు పదం," డటంచును నృపాలసుతుల్ సభనుండి లేచి, సం
పద చెడువాని స్నేహితుల భంగిని వెల్వడి రొక్కమూఁకగా ॥ ౧౫

క॥ చిక్కిన మొగమున నెత్తురు
చుక్కయినన్ లేక, నృపతిసుతుఁడా సభలో
నొక్కండె మిగిలె; భీష్ముని
దిక్కయి యాపురుషుఁడిట్టి తెఱఁగునఁ బలికెన్॥ ౧౭

ఉ॥ "సాళ్వుఁడ నేనె; యంబ కడుఁ జక్కనిదంచు, నన్ను వరించు న
చ్చెల్వ యటంచు, నల్వురును జెప్పిరి; నీవిట కేల రావలెం
బిల్వని పేరఁటంబుగను? బెండిలి యొల్లని వాఁడవీసభన్
నిల్వఁగ నేల? నీవలన నిష్ఫలమయ్యె మదాశ పూర్తిగన్॥ ౧౮

క॥ నా పగ దీఱఁగ నిను మ
చ్చాపఘనఘనాఘనభవసమధికశరధా
రాపాతంబున ముంచుచు
నూపిరి వెడలింతు; రాఁగదోరీ పోరన్"॥ ౧౯

మ॥ అనినన్ భీష్ముఁడు శాంతభావమున, "సాళ్వా, నాకు నిచ్చోటఁ బి
ల్వని పేరంటము పేఁకులాటకును మూలంబౌట నిక్కంబె; యై
నను, నీకేటికిఁ గిన్క? యంబ నెదలో నా యంబగా నెంతు: నీ
వనుమానింపక ధర్మపత్నిగను గొమ్మా కొమ్మ," నంచాడినన్॥

చ॥ "ఒరుని వరించినట్టి సతి నొల్లఁగ వెఱ్ఱినె?" యంచు సాళ్వభూ
వరుఁడు వచించె; భీష్ముఁ, "డటు వట్టినె పంతముచేత బ్రహ్మచ
ర్యరతునిగా నెఱింగియె లతాంగి వచించెను గాని, నీపయిం
దరుణికి నిక్కమౌ వలపు: తప్పక యామెను బెండ్లి యాడుమా"॥

క॥ అనిన, "సతులఁ దార్చెడి కుం
టెన పని యొక్కటియె నీవు నేర్చితివఁటరా?
నినుఁ బోలిన పౌరుషశూ
న్యునకిది తగు," నంచు సాళ్వుఁడుల్లసమాడెన్॥ ౨౨

ఉ॥ గంటున భీతి గొల్పెడి మొగంబయి భీష్ముఁడు లేచి, "నీకిఁకం
గుంటెన యౌచు నచ్చరలఁ గూర్పఁగఁ జాలినయట్టి నేర్పు నా.

వింటికిఁ గద్దు; దేవతల వీటికిఁ బోవలె నంచు నున్న నో
తుంటరి, రార! యచ్చటికిఁ దూపుల నిచ్చెన గట్టి పంపెదన్"॥

తే॥ గీ॥ అనిన సాళ్వభీష్ములకు ఘోరాహవంబు
జరిగె: విఱిగిన విల్లును, సురిగిన హృద
యమును, దఱిగిన బలమున్నై యరిగెఁ బరుగు
తోడ సాళ్వుండు, తిరిగి తాఁ జూడకుండ॥ ౨౪

ఉ॥ యుద్ధమునందిటుల్ విజయమొందిన భీష్ముని వంక మెప్పుతో
వృద్ధుఁడు కాశిరాజు గని, "వీరులఁ బల్వురఁ గంటిఁ గాని, యీ
యుద్ధతిఁ జూపినట్టి రణయోధుఁడు నిక్కముగా మఱొక్కరుం
డిద్ధరలోన లేఁడు; జగదేకధనుర్ధరు నిన్ను మెచ్చితిన్॥ ౨౫

క॥ నా మేనల్లుఁడె సాళ్వుఁడు;
కామి యగుచు వాఁడు జ్యేష్ఠకన్య నడుగఁగా,
నే ముదుసలినై యుండుట
నా ముగ్వురు సుతలకొక్క నాఁడే పెండ్లిన్॥ ౨౬

చ॥ జరిపెద నంటి; నందులకు సమ్మతి చెందుచు వాఁడె యీ స్వయం
వరమును బెట్టి, యోగ్యులగు వారిని బిల్వక తన్నుఁ బోలు తుం
టరులగు రాజపుత్రులకె టక్కరియై శుభలేఖలంపినాఁ;
డరసియు నూరకుంటిని: భయంపడినాఁడను వాని నోటికిన్॥ ౨౭

క॥ శంతనుపుత్రుల రాకను
మంత్రులెఱిఁగింప, నాదు మదిఁ బొడమిన యా
సంతోషమేమి చెప్పుదు?
నింతంతా? చిన్ననాఁటి హితుఁడతఁడగుటన్॥ ౨౮

తే॥ గీ॥ అతని పుత్రులిర్వురును నా యల్లురగుట
నేను జేసికొన్నట్టి పున్నెమ్ము సు," మ్మ
టన్న, భీష్ముఁడాతనికి, "రాజాగ్రగణ్య,
బ్రహ్మచారినై యుంటయే ప్రతిన నాకు॥ ౨౯

ఉ॥ సాళ్వుని మీఁద నంబకును, సాళ్వునికంబ పయిన్, మనంబులన్
బల్వాలపున్న సంగతిని బాగుగ మీర లెఱింగినట్టిదే :
పిల్వఁగఁ బంపి యాతసికె పిల్ల నొసంగుట మంచి," దన్న మా
టల్వని యంబ, "చీ! విజితుఁడా ననుఁ బొందుటకర్హుఁ?" డంచ నెన్॥

తే॥ గీ॥ "సాళ్వుఁ బెండ్లియాడుటకంబ సమ్మతింప ;
దంబఁ బెండ్లియాడుటకు నీవనుమతింప :
విచిత్రవీర్యునకె నేనిచ్చెద సతి
గాఁగ నీమె," నంచును బల్కెఁ గాశిరాజు॥ ౩౧

చ॥ "జనక, స్వయంవరంబు గద సల్పితి? వందు స్వయంబు నే వరిం
చినతఁడె నా వరుండగును : జేయఁగఁ జాలితి వేని నాకు నా
తనికిని బెండ్లి సేయు ; మటు తప్పినఁ, గన్యకగాఁగ నుండియే
దినములు పుచ్చెదన్, విధిని దిట్టుచుఁ, బుట్టిన యిల్లు మెట్టుచున్"॥

చ॥ అనిన కుమారికన్ జనకుఁడా రసి, "యోసుత, చిన్ననాఁడె నీ
జనని గతించెఁ గానఁ దలి చాటు నెఱుంగక, ముద్దుఁ జూపు వృ
ద్ధుని నను లెక్క సేయ, కెటు తోఁచిన నట్టులె చేయుచుంటివిం
దనుకను ; బంతమున్ విడిచి నానుడి వి, "న్మని యెంత చెప్పినన్॥

క॥ "మార్మనువునకొప్పట కుల
ధర్మము గా," దనియె నంబ ; తత్పిత, "బుద్ధిః
కర్మానుసారిణీ," యని
కూర్మి తనయ కన్య యగుటకున్ సమ్మతిలెన్॥ ౩౪

సీ॥ సత్యవతీసతీసహితంబుగఁ దరలి
వచ్చిరంత వరుని వంక వారు ;
బంధుమిత్రాదులు పయనమై వడిగ రా
సాగిరి దేశ దేశములనుండి ;
మును నిత్యకల్యాణమును బచ్చతోరణ
మగు కాశిపురిశోభ ద్విగుణమయ్యె.

నవయంబు మంగళధ్వనులతోఁ గడు మాఱు
మ్రోఁగుచు నుండె వధూగృహంబు ;
దర్పకప్రతిమానసౌందర్యుఁడగు వి
చిత్రవీర్యుఁడు మంగళసూత్రములు క్ర
మంబుగాఁగ నంబికకు నంబాలికకును
గట్టె విధ్యుక్తవిధముగఁ గంఠములను॥ ౩౫

క॥ సకియలెకసకియములు మా
నక పలుకఁగ, జరిగె శోభనంబులు కులపా
లికల, కలయంబికాంబా
లికలకు, విభు కోర్కులు సఫలీకృతములుగా॥ ౩౬

క॥ అది మధుమాసము : ననలకుఁ
గదిరె వికాసము ; గుదిరెఁ బికమ్ములకామ్ర
చ్ఛదముల గ్రాసము ; సఖు న
భ్యుదయము గని మదనుఁడొందె నుల్లాసమ్మున్॥ ౩౭

క॥ లతకూనలుఁ, గొమ్మలుఁ, బు
ష్పితఫలితస్థితులఁ గాంచి చెలఁగఁ గలుగుటే
ఋతురాజమందె కాదే,
యతిరమ్యములగుచుఁ జేతనాచేతనముల్ ?॥ ౩౮

తే॥ గీ॥ ఇతరఋతువులఁ గాంచి మోమెత్తకుండ
మూఁగలై యుండు కోకిలమ్ములు వసంత
మేగుదేరఁగా గొంతెత్తి స్వాగతమ్ము
పలుకుటే దాని శ్రేష్ఠతం దెలుపఁ గలదు॥ ౩౯

సీ॥ ఒడలికి సౌఖ్యంబులొడఁగూర్చె నతితరా
మలకోమలమలయమారుతములఁ;
గనుదోయికిఁ హాయి గలిగించె వివిధవ
ర్ణసుమసమాకీర్ణరమ్యతరుల,

వీనులవిందు గావించెను బంచమ
స్వరసమంచితపికసంచయమున,
రసనకు సంతృప్తి యొసఁగించె మాధుర్య
ధుర్యమరందసందోహమునను,
నాసికకు నింపు ఘటియించె వాసనాని
వాసవాసంతికాదినానాసుమముల :
నిట్టులవ్వసంతమునఁ బంచేంద్రియములఁ
దనిపె వారాణసీపురోద్యానవనులు ॥ ౮౦

తే॥ గీ॥ అట్టిదగు నొక్క సుందరోద్యానమందు
నందములకెల్ల నెల్లయై, కందు లేని
చందమామ చందమున వెల్లందనమునఁ
బ్రీతి గలిగించునట్టిది భీష్ము విడిది ॥ ౮౧

శా॥ మూడంతస్తుల మేడ యా భవన; మామూలాగ్రరమ్యంబులౌ
గోడల్ నిల్వున వెల్వరించు తెలినిగ్గుల్ చంద్రికాశ్రీల నా
మ్రేడించెన్ ; శశి తద్గవాక్షముల దారిం దొంగి చూడంగ, నా
జాడన్ లోనికి మెల్లమెల్లనఁ బ్రవేశంబయ్యె లేగాడుపుల్ ॥ ౮౨

శా॥ విద్యుద్దీపములెల్లెడన్ గదులలో వెల్గొంది, యా శర్వరిన్
ఖద్యోతప్రభ గల్గఁ జేసె ; శయనాగారంబునన్ మాత్రమ
ల్పద్యోతంబు రహించెఁ ; బట్టు పఱుపుల్, బాలీసులొప్పారె సం
పద్యుక్తుల్ శయనింప యుక్తమగు మేల్పర్యంకమందచ్చటన్ ॥

తే॥ గీ॥ అట్టి శయనగృహంబున వట్టి గచ్చు
పైని దర్భశయ్య నిరతబ్రహ్మచర్య
దీక్ష గల భీష్ముఁడు పరుండె, దిండుగఁ దల
క్రిందఁ బెట్టుకొన్న యెడమకేలితోడ ॥ ౮౮

క॥ మసమసక వెలుఁగులోన
న్నిసి భీష్ముండట్లుగ శయనించిన యెడకుం

గుసుమాంగి యొకతె వచ్చెను
ముసుంగున మునింగి, సిస్తు ముస్తాబొప్పన్ ॥ ౪౫

చ॥ గలుగలుమంచుఁ బాదములఁ గల్గిన యందెలొనర్చు మ్రోఁతకున్
మెలఁకువ గాంచి, భీష్ముఁడు సమీపమునన్ నిలుచున్నయట్టి తొ
య్యలిఁ గని లేచి, "నీవెవతెవమ్మ ? సురక్షితమైనయట్టి యీ
స్థలమునకీవు వచ్చుటెటు సంభవమయ్యె ? విచిత్రమయ్యెడున్ ॥

మ॥ నడిరేయిన్ మగవారలున్నెడకు వెంటం దోడు లేకుండఁగం
బడఁతుల్ తెంపున నిట్లు రాఁదగునటమ్మా ? యన్యులీక్షించినన్,
నడికిన్ మూలము సుమ్మ ! నీవొక నిమేషమ్మైన నిచ్చో నిటుల్
తడయంగా వలదమ్మ," యంచు బలుకం, దన్వంగి వెన్వెంటనే॥

మ॥ ముసుఁగున్ వెన్కకుఁ ద్రోసెః నమ్ముదిత నెమ్మోమంబుదాచ్ఛాదనం
బు సడల్పాటును బొందఁగా వెలుఁగు సంపూర్ణేందుబింబంబనం
గ, సుధాసంగతహాసచంద్రికలతోఁ గన్పట్టెఁ ; జీకట్ల య
ట్లసితచ్ఛాయల నించె నల్గడల నయ్యబ్జాక్షి దృగ్జాలముల్ ॥ ౪౮

చ॥ అనె నిటులామె భీష్ముఁ గని, "యన్యనుగా నను నెంతువేమొ ? నీ
యనుజునకే వధూనికనె యాదును ; నీకిఁక నేమి యాదునో
మనమున నీవె యెంచుకొనుమా," యని మానిని జంకు మాని యా
తని మొగముం గనుంగొని యెఁదాండవమాడు మెఱుంగుఁజూపులన్ ॥

ఉ॥ "అంబవు నీవు; నిక్కమిది," యంచును భీష్ముఁడుపల్కె; "నాదు నా
మంబదె," యంచు నామెయన, "మాతవు నా," కని భీష్ముఁడాత్మభా
వంబును వెల్లడించె; "మన వావిని బట్టి భవత్కుమారవ
ర్గంబునకంబ నేనగుదుఁ; గావున నీకెటు మాత నయ్యెదన్ ?॥ ౫౦

చ॥ వరుసయు వావి లేక యిటువంటి యవాచ్యములాడఁ జెల్లునే
పురుషవరేణ్య ?" యంచు బుఁబోఁడి వచించిన భీష్ముఁడామెతో,
"నిరతము బ్రహ్మచర్యమును నేను వ్రతంబుగఁ బూనియుండుటన్
ధరఁ గల కాంతలెల్లరును దల్లులె నా," కని మోడ్చె హస్తముల్ ॥

క॥ “పిల్లలను గన్న సతులనె
తల్లులనుచుఁ బేర్కొనంగఁ దగుఁ గద ? నాకుం
బిల్లలఁ గలిగింపఁగ నీ
యుల్లంబున నెంచినాఁడవో పురుషవరా ?॥ ౫౨

చ॥ అది యటులుండ నిచ్చి వినవయ్య, సురక్షితమైన యట్టి యీ
గదికిటు నేను రాఁ గలుగు కారణమేమన, నేఁ బరుండు న
ట్టిది యిది ; శత్రుమూలమున డెప్పరమేదయినన్ హఠాత్తుగా
నొదవిన, గూఢమార్గమొకఁడున్నది లోపటి వారు వెల్వడన్॥ ౫౩

మ॥ పవళింపం జను వేళలన్ రవికయుం బైచీరయున్ విప్పి, నూ
త్నవయస్సిచ్చిన వన్నెచిన్నెలను విన్నాణంబుగా నున్న మ
ద్వివిధాంగంబుల నేను జూచుకొనఁగా వీలిచ్చుచున్ గోడలం
దు విరాజిల్లెడి నిల్వుటద్దములఁ గన్గొంటే యివే యిచ్చటన్ ?॥ ౫౪

చ॥ జడముడి విప్పినంత దిగజాఱుచు, దట్టపుఁ గారుమబ్బుకై
వడిని బిఱుందుదోయిపయి వ్రాలెడి నా బలువాలుపెన్నెఱుల్
నిడుపున నాదు చేడియలు నిద్దుర పట్టెడు దన్క దువ్వి పు
త్తడిపిడులున్నయట్టి నునుదంతపు దువ్వెనలివ్వె యీ గదిన్॥ ౫౫

చ॥ కలపపు గిన్నెలున్నయవి, కంటివె యిచ్చట ? వీనిలోని దే
పలుచని చందనంబురముపైఁ జెలికత్తెలు నాకుఁ బూయుచుం,
బులకితగాత్రులై మదులఁ బుట్టిన మోహము పట్ట లేక చే
తులచటనుండి తీయరు, కుతూహలతన్ మెలమెల్ల నొక్కుచున్॥

ఉ॥ పాముపొరన్ హసించు వలిపంబు వయస్యలు నాకుఁ గట్టి, యా
గోమున నున్న నన్నుఁ గనుఁగొంచు మనశ్చలనంబు గాంచి, తా
రే మగవారి రీతి నను నెంతకు వీడఁగ లేక, వీడ లే,
కీమృదుశయ్యఁ జేరుపుదు : రియ్యది చూడఁ గదయ్య సుందరా॥

మ॥ చెలికత్తెల్ పచరించు నప్పనులచేఁ జిత్తోద్ధతిం జెంది, వా
రలలో నొక్కతెఁ బ్రక్కకుం బిలిచి, భార్యాభర్తృసంబంధచ

ర్యలకున్ నే దిగి క్రింపుమీదగుదు : నయ్యాశ్లేషముల్, చుంబనం
బులుఁ, దృష్టుల్ లవలేశమేని నడఁపం బో, వెండమావుల్ బలెన్॥

చ॥ కడుపును నిండదిక్కఱణి కక్కుఱుతుల్ పడుచున్న నక్కటా!
నుడువఁగ సిగ్గు సి!" గ్గనుచు నోటిని జేతను మూసికొన్నదై
బిడియముఁ జూపు నంబ దెస భీష్ముఁడు గన్గొని, "నీకు సిగ్గు గొ
ల్పెడి విషయంబులీవిటువలెన్ వచియింపఁగ నేల బాలికా?॥ ౬౯

ఉ॥ సుప్తినె యిట్టి స్వప్నములు చోద్యముగాఁ గనినట్టి దానవో?
జ్ఞప్తిని దెచ్చుకొమ్మ! యటు గాక నిజంబులె యైన యట్టిచో,
నాప్తులకైన, నప్పసెలియండ్రకు నైనను, జెప్ప రానివై
గుప్తముగాఁగ నుంచఁ దగు గూఢరహస్యములివ్వి నమ్ముమా॥

చ॥ వరుసమెయిం బరాయి మగవారికి దాఁపఱికంబు లేక యీ
సరణిని గుట్టుమట్టులను సర్వము చెప్పఁగ వచ్చునా?" యనం
దరుణి, "ప్రియా, స్వయంవరమునన్ నిను నేను వరించియుంట,ని
ర్వ్యరకును బంధమేర్పడెఁ : బరుండవిఁకెట్టులు? నుద్వరుండవే। ౭౧

ఉ॥ కానని నోరు నొప్పి గొనఁగాఁ బలుసారులు నీవు చెప్ప మా
త్రాన మదీయభారమిఁకఁ దప్పెడునట్టిది కాదు నీకు; మా
రానలసాక్షిగాఁగ భవదంగన నైతిని; సంశయింప; కో
ప్రాణవిభూ, భవత్సుగుణబద్ధను : మంగళసూత్రమేటికిన్?॥ ౭౨

చ॥ ఇచటను నిల్వకుండ నను నేగుమనంగను న్యాయమా ప్రియా?
యుచితము గాదె భర్తకడ నుండుట భార్యకుఁ? బైని జందమా
మచలువవెన్నెలల్ ముదురు మంటలుగాఁ గనుపట్ట, భీతి గాం
చుచుఁ జనుదెంచితిం : గరుణఁ జూపుమ! నా మరువేఁడిఁ బాపుమా।

తే॥ గీ॥ నిన్న రాత్రి, మొన్నటి రాత్రి, వన్నెకాఁడ!
నాదు సవతిచెల్లెండ్రకు, నీదు సవతి
తమ్మునకు, వరుసన్ శోభనమ్ములాట,
నోడలచట, మది యిచటఁగా, నుంటి నేను॥ ౭౪

చ॥ అట నవదంపతుల్ సలుపునట్టి పనుల్ తలపోసికొంచు నే
గుటకలు మ్రింగుచుంటి : నుపగూహనమాచరింప, నీ కవుం
గిటను వసించి, మేను పులకింపఁగ, నీ యధరామృతంబు నే
గుటుకు గుటుక్కుమంచు నిక గ్రోలుచు నున్నయటుల్ తలంచుచున్॥

ఉ॥ ఈయెడ నున్న నన్నుఁ గని యెవ్వరు తప్పులు పట్టువార ? లో
న్యాయపురంబు గాదు కద యాల్మగలం గని యంకు గట్టఁగన్ ?
రేయి పవల్ వధూటిని శరీరమునందె ధరించి యున్న యా
కాయజవైరికిమ్మయిన కాశి సుమీ యిది యో మనోహరా॥

క॥ అంకయినం గానీ, ని
శ్శంకగ నినుఁ గూడు దాన : జాహ్నవి లేదే,
పంకంబును లోఁగొని యక
లంకగ నను జేయఁ దన జలంబుల మునుఁగన్ ?"॥ ౧౮

చ॥ అని వచియించినన్, "శివశివా !" యని చేతులు వీనుదోయిపై
నునిచి సురాపగాతనయుఁ, "డో నృపకన్యక, బ్రహ్మచర్యదీ
క్షను గలయట్టి నేను వినఁగాఁ దగదీగతి మాట," లంచుఁ బ
ల్కిన హసియించి యంబ చిటిలించిన కన్బొమలొప్ప భీష్మతో॥

తే॥ గీ॥ "బ్రహ్మచర్యంబు బ్రహ్మచర్యంబటంచుఁ
బలికె దేటికి మాటికీపగిది ? బ్రహ్మ
చర్య ననుకరించుటె బ్రహ్మచర్యము గద ?
కన్న కూఁతుఁ గూడిన వాఁడె కాఁడె బ్రహ్మ ?॥ ౧౯

ఉ॥ నీతులు నిష్ఫలుం బ్రజకు నేర్పెడి స్వాములవారలెల్లరుం
గూఁతులయట్టిరై తమకుఁ గొల్వొనరించెడి శిష్యరాండ్రతో
రాతిరి దీపమార్పి, తమ ప్రక్కకు లాగి రమించుచుందు, రా
రీతిని బ్రహ్మదేవుఁడు చరించుటచేతను బ్రహ్మచారులై॥ ౨౦

క॥ గారాబంబునఁ బాలును
నీరును బలెఁ గలిసిన రమణీరమణుల సం

సారములఁ గూలఁ ద్రోసెడి
జారశిఖామణులు బ్రహ్మచారు," లటన్నన్. ॥ ౭౧

తే॥ గీ॥ "బ్రహ్మచర్య శబ్దంబును బట్టుకొనుచు
నిర్వచించిన యట్టి నీ నేర్పు మెచ్చ
వచ్చు: నీవు చెప్పిన యట్టి వర్తనంబు
గలుగు బ్రహ్మచారులును లోకమునఁ గలరు ॥ ౭౨

ఉ॥ నన్నటువంటి వానిఁగ మనమ్మున నెంచకుమమ్మ! స్త్రీలపై
నెన్నఁడుఁ గామబుద్ధి వహియింపమి మామక దీక్ష సుమ్మ; యో
కన్నియ, మిన్ను మీఁద విఱుగంబడినన్ వ్రతముం ద్యజింపఁ బో,"
నన్న నదీతనూభవునకన్ననఁబోణి వచశ్చమత్కృతిన్ ॥ ౭౩

శా॥ "ఈ దీక్షన్ వహియించి నీదు జనకుండే యుండినన్, నీవు తా
మీఁదం బుట్టియె యుండ! వంగనలఁ గామింపంగ రాదన్న మ
ర్యాదన్ లోకులు సంచరించుటకుఁ బ్రారంభించినన్, మానవ
ప్రాదుర్భావము లేనిదై జగము నిర్మానుష్యమౌనే కదా? ౭౪

తే॥ గీ॥ కామబుద్ధిని స్త్రీలతోఁ గలియ నంటి;
వట్టి నీదీక్ష చెడకుండునట్లు నిన్నుఁ
గామబుద్ధితోడను నేనె కలియుదాన;
రాఁ గదోయీ!" యనుచుఁ జేయి లాగ నంబ ॥ ౭౫

క॥ వెక్కసమునఁ దన చేతిని
గ్రక్కున లాగుకొని యాపగాసుతుఁడు, "మనో
వాక్కాయకర్మములయం
దోక్కటిచే నైన స్త్రీల నొల్ల," నటన్నన్ ॥ ౭౬

ఉ॥ "ఇష్టుఁడవౌట, నొల్ల నన నేఁ జన నిత్తునె ని," న్నటంచు నా
దుష్టచరిత్ర మీఁదికిని దూఁకి, పయంట దొలంగి యంగముల్
స్పష్టపడంగఁ, జేతులు గళంబునకుం బెనవైచుచున్ లతా
వేష్టితమాచరించెఁ, బొర వీడినయట్టి భుజంగి భంగిగన్ ॥ ౭౭

ఉ॥ గుండెకు గుండె దాఁకఁగను గుబ్బెత యిట్టి తెఱంగుగాఁ దనున్
నిండుగఁ గౌఁగిలించుకొని నిక్కుచు వాతెఱ యానఁ బోవ, భీ
ష్ముండు తదీయబాహుయుగముం బెనయూడఁగ లాగి, యంసముల్
రెండును బట్టి త్రోసెను ధరిత్రి పయిన్ సుమగాత్రి గూలఁగన్॥

క॥ వ్రేటు వడిన త్రాఁచు వలెన్
బోటి వడిన్ లేచి, ముక్కుపుటములదరఁగా,
మాటికిఁ బ్రక్కలెగయఁగాఁ,
బైఁటయు సవరించుకొనక, పలికెం గినుకన్॥ ౭౯

ఉ॥ "కోరి తనంతఁ బైఁబడిన కోమలి కూరిమి నైన నెంచ, కీ
దారిని గ్రూరచిత్తమున ధారణిపైఁ బడునట్లు త్రోయుటే
పౌరుషమంచు నెంచితివె? భామలు కోమలులంచుఁ బల్కు, ట
వ్వారి శరీరముల్ విరుల వంటివి యాటనె యంచెఱుంగవే?॥ ౮౦

మ॥ అబలన్ మోటుతనంబుగాఁగ నిటు త్రోయం జేతులెట్లాడె? నే
లఁ బడం గూలుట వల్ల నాదు తనువెల్లన్ నొచ్చె; నన్నిట్టి రీ
తిఁ బరీభావము నీవొనర్చుటను నా దేహంబుకంటెన్ మన
స్సు బలిష్ఠంబయినట్టి నొప్పి గనియెన్ సుమోన్మాదయాహీనుఁడా॥

ఉ॥ ఆఁకలి యన్న మానవునకన్నము పెట్టక యుంట మాత్రమే
కా, కెదఁ గాకఁ బూనుచును గజ్జను జావఁగఁ గొట్టఁ బోదురే?
నీ కరపాటవంబు రమణీతతియందిటు చూప సిగ్గు లే
దే కఠినాత్మ? స్త్రీల యసురీధర హానికి మూలమౌఁ జుమీ॥ ౮౨

చ॥ వ్రతము వ్రతంబటంచు నుడువంగఁ దొడంగెదు, బ్రహ్మచర్యమే
వ్రతమయిన! ట్లహింసకెన వచ్చు వ్రతంబిలఁ గల్గునే? విమో
హితనయి నిన్నుఁ జేర, నను హింస యొనర్చుచున్నవాఁడ; వీ
గతి నను నేడిపింప, నెటుగా ఫలియించును నీవ్రతంబిఁకన్?॥ ౮౩

ఉ॥ వ్యర్థము నీదు జీవము మదాశను దీర్పనిచోఁ; బరోపకా
రార్థమిదం శరీరమని యార్యులు పల్కుదు నట్టి మాటకే

మర్థము దీసివాఁడవు? ప్రియంబున నా యనురాగమెంచి, మ
త్ప్రార్థనమాలకింపుము; కృపన్ ననుఁ గూడి రమింపుమింపుగన్॥

మ॥ అనురాగంబు వహించి రేని వనితల్ ప్రాణంబులర్పింపఁగన్
జెనుదీయంగను బోరు; కిన్క గని రేనిం బ్రాణముల్ దీయఁగా
ననుమానింపరు: రెండు పక్షములు నీ యాత్మన్ విమర్శించి, నా
యనురాగంబును గోరెదో, కినుకనే యర్థించెదో, యెంచుకో॥ ౫౭

క॥ నీ మీఁదఁ గలుగు వలపున
నీ మేలును మదిని గోరి నే నిప్పటికే
యే మొనరించితినో విను
మా, మామకచిత్తమెఱుఁగ నగు నద్దానన్॥ ౫౮

చ॥ విఱుగుడు లేని మందొకటి వెజ్జొకరుండిటు మున్ను నేర్పఁగా
నెఱిఁగితి; దాని మూలమున నెట్టి నరుండును యక్ష్మరోగియై
మఱుగుచు, వత్సరంబు పరిపూర్తిగ దాఁటక యుండఁ బ్రాణముల్
దొఱఁగును జుమ్ము; వీడియముతోడను దానిని బెట్టఁగా వలెన్॥

తే॥ గీ॥ నీవు రాజవు గాకుండ నీదు సవతి
తమ్ముఁడడ్డుగా నుండుట దలఁచి, వాని
కిం దదీయౌషధము ప్రయోగించితిఁ జుమి
నిన్న, మొన్న, శోభనములఁ గన్ను గప్పి"॥ ౫౯

మ॥ అనినన్ భీష్ముఁ, "డయో! యయో! యిది నిజంబై యుండునా? దైవమా!
దనుజస్త్రీయొ, పిశాచకామినియొ, భూతంబో యగున్; మానవాం
గనగాదియ్యది," యంచు నయ్యతివతోఁ, "గష్టాత్మ, నీమోముఁ జూ
చినచోఁ బాపము లెల్లఁ జుట్టుకొనుఁ; జీ! చీ! పొమ్ము, పొ," మ్మంచనెన్॥

క॥ తన వలపు భీష్ముఁడీతీ
రున నపుడు నిరాకరింప, రోషముచే నా
నన మెఱ్ఱవాఱ, మెఱుఁగులు
గనుఁగవను దుఱంగలింపఁగా, నంబ యనెన్॥ ౬౦

మ॥ "ఉపకారంబపకారమంచు నకటా! యూహించుచున్ నీవిటుల్
విపరీతంబుగఁ దిట్టి పొమ్మనదవే వేశ్యన్ బలెన్ నన్ను? ని
క్కపు నాప్రేమ నిరాకరించితివి గా? కానిమ్ము! కానిమ్ము! నా
దు పగం దీఱుచుకోనటంచు మదియందున్ నమ్ముకోఁ బోకురా॥

పంచచామరము॥ నపుంసకా! నృశంసుఁడా! వినం గదోరి: మేటి వీ
రపుంగవుండ నంచు నిబ్బరంబు గల్గు నిన్ను నీ
వపుస్సునందుఁ గానిచోఁ, దపస్సు నాచరించి వే
రు పుట్టువొంది యైన నిన్ను రూపుమాపుదాసరా"

చ॥ ఇటు పగ చాటుచున్ ధరపయిం జరణంబునఁ దన్నినంత న
చ్చటను సారంగమేర్పడ, భుజంగి బిలంబునఁ బోలె నందు న
క్కుటిలశిరోజ దూఱుచు నిగూఢముగాఁగను బోయె; నేల ము
న్నటి యటులై సారంగము కనంబడకుండె నొకించుకేనియున్॥ ౯౩

చ॥ ఉదయమునందు లేచి వెత నొందుచుఁ గుందుచుఁ బువ్వుఁదోఁటయం
దుఁ దరుణి యుండఁగాఁ, గలహదోహదకార్యవిశారదుండు నా
రదుఁడరుదెంచె, "నోమురహరా! మధుకైటభసంహరా!" యటం
చుఁ దనదు వీణ మీటుకొనుచున్ గగనస్థలినుండి ధాత్రికిన్॥ ౯౪

శా॥ "అంబా, క్షేమమె? రాత్రి భీష్ముఁ గను కార్యంబుండుటం దద్గవా
క్షంబుం జేరితి నేనదృశ్యముగ; నక్కాలంబునం దేమి చె
ప్పం, బూఁబోఁడి! వినంగ నయ్యె నట నంబాభీష్మసంవాదవా
క్యంబుల్ నాకు; మదీయమానసము నీరయ్యెం జుమీ యయ్యెడన్॥

క॥ తగిన పగ దీర్చుకొనుమా;
పగ దీర్చుకొనంగ లేని బ్రదుకేమిటి? కో
ముగుద, బహుదుఃఖభాజన
మగు జగమునఁ, బగను బోలినట్టిది గలదే?॥ ౯౬

సీ॥ 'అన్నమో రామచంద్రా!' యని క్షుధ నేడ్చు
నరునకుఁ బాయసాన్నంబు కంచె,

'నాలుక యెండుచున్న,' దటంచుఁ బనవు వి
దాహార్తునకు నమృతంబు కంటెఁ,
గూర్కు గంటికి రాక కొందలమొందు వా
నికి నొడలెఱుఁగని నిద్ర కంటె,
విరహంబుచే బలు వెతఁ జెందుచున్న కా
ముకునకుఁ బ్రియురాలి పొందు కంటెఁ,
దనకు మున్ను కీడు నొనరించి యున్నట్టి
మానవునకుఁ దాను మాఱు కీడొ
నర్చి తనదు పగను దీర్చుకొనుటె హెచ్చు
ముదము గూర్చు," ననుచు ముని వచింప॥ ౯౯

మ॥ "ఋషివర్యా, పగ దీఱఁ దద్వధమె సుమ్మీ నా యభీష్టంబు ; మ
ద్రుష తద్రక్తముఁ జూడకుండ నెటు డిందుం ? గాని, యత్యంతపౌ
రుషవంతుండగు భీష్ముఁ జంపఁ గల వీరుండేఁడి ? గూఢంబుగా
విషముం బెట్టుదు నన్న, నాదు మది తృప్తిం బొందదొక్కింతయున్॥

ఉ॥ ఏమియుఁ దోఁచకున్న," దని యీగతి వందురు కన్యతో ముని
గ్రామణి, "క్షత్రియాన్వయవిరాముని భార్గవరామునిం గుమా
రీమణి, నీ వెఱుంగవె ? ధరిత్రిని గల్గిన వీరులెల్ల రా
రాముని ముందు నిల్వఁ గలరా విలు పూని యతండు నిల్చినన్ ?॥

తే॥ గీ॥ భీష్ము విలువిద్దె యందింత పెద్ద చేసె
నాతఁడే ; శిష్యు వధియించునా యటంచుఁ
దలఁపకుము : తన్నుఁ గన్నట్టి తల్లి మెడఁ గు
ఠారమునఁ ద్రుంచె మున్ను కఠోరముగను॥ ౧౦౦

ఉ॥ ముక్కునఁ గోపమాతనికి ; మూర్ఖుఁడు భీష్ముఁడు బ్రహ్మచర్యపుం
దిక్కను మానకుండ గురుదేవుని యాజ్ఞను ధిఃకరించుఁ ; ద
ద్ధిక్కృతికగ్గిరాముఁడు మదిన్ సయిరించెడు వాఁడు గాఁ ; డతం
డొక్కఁడె నీకు దిక్కగుటకోపిన వాఁడు సమస్తధారణిన్॥ ౧౦౧

ఉ॥ భార్గవరాము పాదములపైఁ బడు ; నీ పగ దీర్చుకొంటకున్
మార్గమ దే, '' యటంచు సురమౌని వచించి, విపంచి మీటుచున్
స్వర్గము దారిఁ బట్టి తన వచ్చిన త్రోవను బోయె : వైరిష
డ్వర్గము గెల్చినట్టి మునివర్యుల చర్యలిటుండునా యహో ? ॥

వ॥ కలహాశనుని సలహా విని కలహంసగామిని యగు నక్కామిని మహేంద్రగిరిగామిని భృగురాముని దాను జేర వీలు గామిని దలంచి, యంబికాంబాలికావివాహంబునకాహ్వానితుండై. విచ్చేసిన నిజమాతామహుండగు హోత్రవాహనుని దండకుఁ జనిచనవున ॥ ౧౦౩

శా॥ '' తాతయ్యా, జమదగ్నిసూతి భవదాప్తస్నేహితుండంచు మున్
మాతో నీవనుచుంటి వే?'' యనిన, ''నమ్మాయీ, యసత్యంబు గా
దేతద్వాక్యము : నెయ్యమారఁగ నతండే కేటఁ గొన్నాళ్లు నా
యాతిథ్యంబును బొందు ;' నీనెలనె నా కాతండు వింద్రౌఁ జుమీ '' ॥

చ॥ అనుచును హోత్రవాహనుఁడిటాడఁగ ముద్దుగ నంబ, ''తాతయా,
ఘనుఁడగు భార్గవుం గనఁగఁ గౌతకమున్నది ; నీదు వెంటఁ దో
డ్కొని చనున,'' న్నటన్న, నతఁడుం దనకయ్యది, కోర్కి యాటఁ ద
జ్జనకుని గోరి, యామెయును దాను జనెం దన వీటికంతటన్ ॥

వ॥ ఆతఁడు నిజనగరంబునకే తెంచిన కొలఁది దివసంబులకు ఖండపరశుసదృశాఖండమహిమాభిరాముండగు రాముండు॥ ౧౦౬

మత్తకోకిల॥ మైత్రిమై నరుదేర, సాఁగి నమస్కరించి, యథావిధిన్
హోత్రవాహనుఁడర్ఘ్యపాద్యబహూకృతులోపచరించి, య
మ్మిత్రసత్తముఁడుంటకొక్క సమీపసౌధమొసంగి, దౌ
హిత్రినే పరిచర్యకుంచె, నభీష్టమౌ మెకదాటచే॥ ౧౦౭

సీ॥ అతిథికిఁ గాల్యకృత్యములు దీఱఁగనె, యు
ష్ణజలంబులుంచును స్నానమునకు ;

స్నానపానానంతలోననె, సిద్ధమొనరించు
సర్వవస్తువులు పూజాగృహమునఁ ;
బూజ పూర్తి యగు లోపుననె, భోజనము వ
డ్డనను జేయించు బాడబులచేత ;
భోజనానంతరంబున, నాకులకు సున్న
మును వ్రాసి తానె తాంబూలమిచ్చుఁ ;

దమ్ములము చేయుచుండఁ, జెంత నిలుచుండి
వీవనను మెల్లమెల్లన వీచుచుండు ;
శ్రద్ధయును భక్తి దోఁప, భార్గవునకిట్టు
లంబ సేవ గావించె నున్నన్ని నాళ్లు॥ ౧౦౮

శా॥ హృష్టుండై భృగురాముఁ డేగుచుఁ, "గుమారీ, నీదు శుశ్రూషసం
తుష్టస్వాంతునిగాఁగఁ జేసెఁ జుమి నన్నుం ; మెచ్చితిం నిన్నుః నీ
కిష్టంబైన వరంబు గోరుకొనుమా, యీడేర్తు ; సిగ్గేల ? వి
స్పష్టంబౌనటుల తెల్పుమా, భవదభీష్టంబెద్దియో ముద్దియా"॥

చ॥ అనుటయుఁ బ్రక్క నుండి దరహాసమొనర్చుచుఁ బల్కె హోత్రవా
హనుఁడు, "వయస్య, యీ మెఱుఁగుటులాస్యము సిగ్గున వంచుకొంట గ
న్గొనియును జిత్తమందుఁ గల కోరిక పోల్చుకొనంగ లేవె ? జ
వ్వనులకుఁ బెండ్లిదప్ప మఱి వాంఛ యిఁకొక్కటి యుండ నేర్చునే?॥

క॥ ఏమయ్యా, యంతే కద ?
నా మిత్రునితోడఁ జెల్పినం దీర్చును నీ
కామితమును ; సిగ్గయినం,
నీ మాటుగఁ దెల్పువాఁడ నే," నని పలుకన్ ॥ ౧౧౧

క॥ "నీ వేళాకోళముల క
రయో ! వేళాపాళ లేక యున్నది తాత
య్యా ! వారేమనుకొందురు ?
నా వాంఛితమిట్టిదంటినా నీతోడన్ ?॥ ౧౧౨

ఉ॥ వాంఛితమున్న నేమి? యది వట్టి నిరర్థక : మింద్రవైభవం
బుంఛపువృత్తి గల్గు నరుఁడొందఁ దలంచిన యట్లు; చంద్రమో
లాంఛనమైన యేణము నిలం బులి కోరిన యట్లు; కేకిదా
పింఛము కాకి దాల్పఁగ నపేక్ష యొనర్చిన యట్టులక్కటా!॥౧౧౩

ఉ॥ సాధ్యము గాని కార్యమును సల్పుమటంచును లేని పోని యీ
బాధ్యత నీ వయస్యు తలపైఁ బడవైచుట న్యాయబుద్ధియా?
యధ్యయనాదికార్యములకాజిటికర్తృత గల్గి యుంట నా
రాధ్యుఁడె కాని, యీ ముసలి బ్రాహ్మణునిన్ శ్రమపెట్టవచ్చునా?॥

మ॥ శ్రమ పెట్టంగను మాట దక్కినయెడన్ సంతోషమే; కాని, నె
య్యముమైఁ జెప్పిన, దేవునై గురువునై యంచూఁకొనం బోని వ
ట్టి మహామూర్ఖుఁడతండు; కయ్యమునకే డీకొన్నచో, గెల్వ రా
ని మహాశూరుఁడు: దేవదానవులకేనిన్ మించరాదాతనిన్ ॥౧౧౫

క॥ కూరిమి లేని పురుషులను.
గోరిన యవివేకవతులకున్ గతి గలదే?
వారేమి చేయ నేర్తురు?
నా రేఖను మార్పఁ గల్గునా యజుఁడైనన్''॥ ౧౧౬

క॥ అని చేలాంచలమునఁ దన
కనుకోయిని లేని యట్టి కన్నీళ్లను జ
వ్వని తుడుచుకొనఁగ, వెడన
వ్వును నవ్వుచుఁ బల్కె భార్గవుఁడనర్గళుఁడై ॥ ౧౧౭

శా॥ ''ఏమీ! సాధ్యమసాధ్యమంచుఁ గలదే యీ భూస్థలిన్ నాకు? నా
సామర్థ్యంబు నెఱుంగకంటివయొ! మీసల్ పండుటం గాంచి, సం
గ్రామానర్హుఁడ నంచు నెంచితివొ? వ్యాఘ్రంబెంత పండైనఁ గా
నీ మెండొడ్డిన గండులేడి నెటులేనిం దున్మగాఁ జాలదే?॥ ౧౧౮

శిఖరిణి॥ మహాశూరుండంచున్ మతి చెడినటుల్ మానక ముహు
ర్ముహుశ్శ్లాఘావాక్యమ్ములు పలికెదోముద్దియ! శర

ప్రహారంబుల్ నాచేఁ బడు నెడ, భవత్పాదములకున్
జోహారుల్ గావించుం జుమి యతఁడు దాసుండ ననుచున్॥

స్రగ్విణి॥ ఆ మహాశూరు నామాంకురంబుల్ కుమా
రీమణీ చెప్పుమా! యిప్పుడే పోయి నీ
ప్రేమ నాసించునో? మృత్యురంగత్సమి
త్సీమనే వాఁడపేక్షించునో? చూచెదన్॥ ౧౨౦

ఆ॥ వె॥ పరుసవేదికినుము బంగారమౌఁ గద?
యినుము వంటి వాని మనము నాదు
పరశువే దిటమును బాపి బంగరు వంటి
దానిఁగా నొనర్చుఁ: దథ్యమబల"॥ ౧౨౧

క॥ భృగురాముఁడీ పగిదిఁ బలు
కఁగ నంబ వచించెఁ, "దాతగారూ, మది మీ
మగఁటిమి నేనెఱుఁగని దా
నఁ గాను: భగవానుగానె నమ్మెదు మిమ్మున్॥ ౧౨౨

ఉ॥ మీరు కుఠారముం గొని సమిత్తలమందెదిరింపఁగా, మహా
శూరుఁడటంచుఁ బల్కఁ దగు జోదు జగత్తునఁ గల్గ నేర్చునే?
కూరిమి నాకుఁ గూర్చి మది కోర్కెని దీర్చుటకొప్పకున్న యా
పూరుషు మీరెదుర్పరను బుద్ధిని నేనటుగా వచించితిన్"॥ ౧౨౩

క॥ నా నవ్వి, "నేను యుద్ధము
మానఁగ, నాకతఁడు చుట్టమా? పక్కమ్మా?
మానిని, యెవ్వండైనను
గానీ, నేఁ దీర్తు నీదు కామిత," మనుచున్॥ ౧౨౪

తే॥ గీ॥ పరశురాముండు పలుక నంబ, "యనఘాత్మ,
తెలియకుండ బాసను చేసితి నని మీరు
తప్పుకొందురు: మీ మాట దబ్బఱ యగు
టెట్టి?" కనవుడు ఘంతంబు హెచ్చి యతఁడు॥ ౧౨౫

ఉ॥ "దబ్బఱ మాట గాదు, విను : దైవము సాక్షిగ సారసాక్షి, నీ
యబ్బురమైన రూపమునకక్షులు గల్గియు లొంగకున్న యీ
నిబ్బరమైన గుండె గల నిర్దయుఁ డెవ్వఁడు ? వాని నామముం
దబ్బునఁ జెప్పు: బంధుఁడయినన్, హితుఁడైనను, వీడనే సుమీ"॥

వ॥ అని శపథంబొనర్ప, నపథావలంబ మైన యంబ యిట్లనియె॥ ౧౨౭

క॥ "బంధుహితుల కంటెను సం
బంధము గురుశిష్యుల నడుమనె హెచ్చుఁ గదా ?
సింధురముఖశిఖివాహను
లంధకరిపు కృపకుఁ బాత్రులౌ విూ కరణిన్ ?"॥ ౧౨౮

వ॥ అనుటయుఁ బరశురాముండు॥ ౧౨౯

క॥ "నా శిష్యులలో నొక్కరుఁ
డా, శరుఁడయి నీమది నిటులటమట పెట్టెన్ ?
నే శాసింతు నతని, నీ
యాశకుఁ దగినట్లు నడువుమంచు," నటన్నన్॥ ౧౩౦

ఉ॥ "శాసనమీరు చేసినను సాఁగదు ; శిష్యుఁడు కేలు మోడ్చి, యే
దో సరి చెప్పు ; మీరలది యొప్పరు ; రాతఁడు బ్రహ్మచర్యముం
దా సలుపంగఁ బూనె నఁట! దానిని దప్పుట చెప్ప రానిదా
దోసపుఁ గార్యమంట! యిటు తోంబదితొమ్మిది చెప్పు హేతువుల్॥

ఉ॥ చెప్పుట కేమి ? కల్పనలు చేఁతయినన్ నెపముల్ స్ఫురింపవా ?
యుప్పును హెచ్చు, నాలి యన నొల్లని వానికి నీలకూరలో !
నొప్పక మీర లేమనెదరో కరుణాకర ? యెల్ల కాలముం
దప్పదు, పెండ్లి లేకయె వితంతువునై పడియుంట నాకిలన్॥ ౧౩౨

తే॥ గీ॥ మనసు సరి పెట్టుకొంటిని ; మరల నాకు
నాశ రేఁ పెదరేల మహాత్మ ? మీరు
శక్తి మించిన కార్యంబు సలుపఁ గలరె ?
మానుఁడీపూని్క," యంచు నంబ వచించుండ॥ ౧౩౩

తే॥ గీ॥ పంతమొక కొంత, జాలి యొకింత, గలిగి
భార్గవుండంబతోఁ బల్కె : "బాల, యేల
లేని పోని సందియములీలీల డెంద
మందుఁ బొందెద ? విది నిశ్చయమ్ము వినుము॥ ౧౩౪

ఉ॥ 'త్రోపుడు మాటలాతఁడొక తొంబదితొమ్మిది పల్క నిమ్ము, నూ
ఱే పలుకంగ ని, మ్మొకటి యేనియు నే విను వాఁడ గాను ; నే
దాపున నుండి పెండిలి యథావిధి మీకొనరింతు ముందుగా ;
నా పయి బ్రహ్మచర్యమతఁడాలిని గూడియె చేయుఁ గావుతన్॥

క॥ చెప్పు మతనిపే," రన్నను
జప్పునఁ దల వంచె నామె : "సరి సరి! యిది దా
నప్పుడె పెండ్లికొమారిత !
తప్పు గదా మగని పేరు తడవుట," యనుచున్॥ ౧౩౬

తే॥ గీ॥ హోత్రవాహనుఁడప్పు, "ఓ మిత్రవర్య,
మరుఁడు నాఁగ విరాళి నా మనుమరాలి
మదికిఁ గలుగఁ జేసిన రాకొమరుఁడు భీష్ముఁ,"
డన్న రాముండు దల యెత్తి మిన్ను చూచి॥ ౧౩౭

తే॥ గీ॥ "భీష్ముఁడా ? భీష్ముఁడా ? యట్టి పేరు నేను
విననె లేదనె; హోత్రవాహనుఁడు, "భీష్ముఁ
డనిన శంతనుని తనూజుఁ ; డతని మొదటి
పేరు దేవవ్రతుండంచు వింటి," ననిన॥ ౧౩౮

క॥ "దేవవ్రతుఁడా ? యెఱుఁగుదు :
నే విద్యను నేర్పినట్టి యెల్లరలో వాఁ
డే విలుకాఁడుగఁ దేలె మ
హావినయవిధేయతలకు నాకరమగుచున్॥ ౧౩౯

ఉ॥ వాఁడు మదీయవాక్యము నవశ్యముగా విను ; రండు, పోదమీ
నాఁడె ; శుభస్య శీఘ్రమను నానుడి యున్నది గాదె?" యంచు నా

వేఁడినె, యంబయుఁ సఖుఁడు వెంటను రా భృగురాముఁ డేగె : నె
వ్వాఁడొ టుసుక్కుమంచు నెటువంకనొ తుమ్మెఁ బ్రయాణవేళకున్॥

క॥ దడదడమను రథముల సం
దడిలోఁ దుమ్మెవ్వరికి వినంగఁ బడు ? నడా
వుడిగ వెడలి, యవ్వడువున
వడివడి హాస్తిపురి చేర వచ్చిరి వారల్॥ ౧౪౧

చ॥ గురుఁడరుదెంచె నన్న పలుకుల్ విని భీష్ముఁడు వేగ భక్తిసం
భరితమనస్కుఁడై చని నమస్కృతి చేయఁగ, "శిష్య, భక్తికే
మిర ? యిదె నీ నిమిత్తమయి మిన్న యనం దగు కన్నెఁ దెచ్చితిం ;
బరిణయమై సుఖింపు," మని భార్గవుఁడంబను జూపెఁ ; జూపినన్॥

క॥ "చిత్రము ! చిత్ర !" మటంచును
దత్తఱపడు భీష్ముతో నతఁడు, "చిత్రంబుల్
బత్తెంబును వలదుర ; మా
ఉత్తరమీకుండఁ, గూరుచుండు వరుఁడవై !" ౧౪౩

క॥ పుస్తె యిదే, భవదుభయా
యుస్తంతుయుతం : బయం ముహూర్తస్సుముహూ
ర్తో స్తనఁగఁ గట్టుమా నీ
హస్తంబులతోడ వధువు నఱుత గుఱుతుగా॥ ౧౪౪

క॥ తాత గలఁ, డితఁడు కన్యా
దాత యగును ; నేఁ బురోహితత్వమొనర్తున్ ;
మాతామహి గలదు ; చెలులు
మాతో నున్నారలయిదు మందీ యయిదువల్॥ ౧౪౫

కవిరాజవిరాజితము॥

పరిణయమాటకు సర్వము సిద్ధము ; బంధులు, మిత్రులు, నింత నె వ
త్తురు ; మఱి జాగొనరింపక లె," మ్మని తొందర పెట్టెడి రామునితో,

'గురువర,'' యంచును భీష్ముఁ డెదోనుడిగొంటుచుఁ జెప్పఁదలంపఁగ, న
ప్పరశుధరుండటుపై నొక మాటయుఁ బల్కఁగ నీయక యాతనితో॥

తరల॥ ''వ్రతముగాఁగను బూనినాఁడను బ్రహ్మచర్యమటంచుఁ బె
న్కతను జెప్పదు; వేనెఱుంగుదు: నాకు నీదు వ్రతంబుతో
గితముతోఁ బని లేదు: రంభను గెల్చి నంబను బెండ్లిమై
బ్రతికెదో? బవరంబునం బడి, రంభనే వరియించెదో?॥ ౧౪౭

తే॥ గీ॥ ఎంచుకొనుమిప్పు,'' డని వచియింప, భీష్ముఁ
డూష్మసహితమైనట్టి నిట్టూర్పు విడిచి,
''యకట! యొగఁ దీయ బ్రహ్మహత్యయు, మఱి దిగఁ
దీయ గోహత్యయు నటన్న తీరు వచ్చె''॥ ౧౪౮

తే॥ గీ॥ అంచుఁ జింతించి, ''దేవ, చేయఁగఁ దగని య
కృత్యమును జెప్పి గొంతు నొక్కితిరి; నేను
గిక్కుమనకుండ నోరు నొక్కితిరి; మ్రొక్కు
టొక్కటియె దిక్కు నా,'' కని యూరకుండె॥ ౧౪౯

ఉ॥ గొడ్డలితోడ క్షత్రియుల గొంతుల నిర్వదియొక్క సార్లు తా
బిడ్డలు వృద్ధులంచనెడి భేదము నెంచక త్రుంచినట్టి యా
దొడ్డమగండు భార్గవుఁడు తోఁకను ద్రొక్కిన త్రాఁచు రీతి మెం
డొడ్డిన భీష్ముపై నెగసి, హుంకృతితోడను బండ్లు గీఁటుచున్॥

క॥ జ్వాలదగ్నిహోత్రు గతి మం
టల నుమియుచు, ''నోరిమూర్ఖ! నా దెబ్బ యిఁకం
దెలిపెద రారా, యని బె
బ్బులి బలె నబ్బలియుఁడొక్క బొబ్బం బెట్టెన్॥ ౧౫౧

చ॥ గజగజలాడిరెల్లరును; గంపిలకుండెను భీష్ముఁడొక్కఁడే:
నిజగురు మోము నాతఁడు వినిశ్చలదృష్టులఁ జూచి, ''యోమహా
భుజ, మిము నేను డీకొనుచుఁ బోరఁగ నేరను; శిష్యునిం బరీ
క్ష జరుప నెంచినం, దమ యొసంగిన విద్యయె యొప్పగించెదన్''॥

ఉ॥ అంచు వచించి రామునకు స్యందనముం దగు సూతుతోడఁ దె
ప్పించెను ; విల్లు, శస్త్రములుఁ, బెల్లుగ నమ్ములుఁ, దూణముల్, సమ
ర్పించెను ; మస్తకంబున ధరింప శిరస్త్రము, మేనఁ దాల్పఁగాఁ
గంచుకవర్మముల్, మిగులఁ గట్టివి, చూచి యొసంగె ముందుగన్॥

క॥ యుద్ధమునకు రాముఁడు సం
సిద్ధుండై వచ్చినంత, శిష్యుండును స
న్నద్ధుండై యతని యెదుట
బద్ధాంజలి యయ్యెఁ, గురుఁడు ప్రారంభింపన్॥ ౧౫౪

చ॥ అణఁకువఁ జూపు శిష్యుపయి నాఱని కోపముతో గుణంబునన్
రణనము గల్గ భార్గవుఁడనర్గళరీతి ననేకశాతమా
ర్గణముల నేయ, భీష్ముఁడు శరంబులఁ ద్రుంచెను వాని నన్నిటిం,
బ్రణుతులొనర్చుచున్ సురలు బారులుగా దివినుండి చూడఁగన్॥

ఉ॥ "రాఘవరాము నిప్పరశురాముఁడెదుర్కొన నేగి మున్ శర
న్మేఘుని యట్టిఁడై కడుపు నిండని చాతకమట్లు చేసె న;
న్నీఘనుఁడిప్పుడిట్లు శరవృష్టిని గల్గఁగఁ జేయుచుండె : వ
హ్వా! ఘటియిల్లు విం," దనుచు వచ్చెను నారదుఁడిచ్చ మెచ్చుచున్॥

చ॥ ఇభము నిభమ్ముఁ దాఁకినటులేర్పడె : శిష్యుని రాముఁడాత్మస
న్నిభునిగఁ జేయఁ గోరి తన నేర్చినదెల్లను నేర్పెఁ గాన, వా
రుభయులు నొక్కరీతి పటుయోధులె ; యిర్వురు నొక్కరీతి భూ
రిభుజులె : వారి యుద్ధమలరింపక యున్నె నిలింపబృందమున్ ?॥

చ॥ వయసునఁ బెద్దయై యనుభవంబున భార్గవుఁడెక్కుడైనఁ, బి
న్నయిన కతంబునన్ బలమునందు నదీసుతుఁడెక్కుడౌచుఁ, వా
సి యొక రవంత లేక యని చేసిరి తద్గురుశిష్యులించుకే
నియు వెనుదీయకుండఁ, దమ నేర్పునకోర్పును దోడు చేయుచున్॥

ఉ॥ పట్టినయట్టి పంతమున బాడబుఁడే ప్రదరమ్ములేయుచుం
గొట్టును ; వచ్చుచున్న యలుఁగుల్ దనమీఁదికి రాకయుండ రా

పట్టి యడంచుఁ గాని, చలపట్టి గురుల్ మరలంగఁ గొట్టఁ, "డి
ట్టట్టుగ నూతె ధర్మము," లటంచును జూపఱు వింత పొందఁగన్॥

ఉ॥ ఆహవమందు శిష్యు నెటులైనఁ బరాజితుఁ జేసి యంబకు
ద్వాహమొనర్చుటొక్కటియె వాంఛితమై, యతనిన్ వధింపఁగా
నూహము లేని రాముఁడు, మహోగ్రమనస్కుఁడెయయ్యు, శస్త్రసం
దోహము గుప్పఁగాని తొలుదొల్తనె యస్త్రములేయఁడేవియున్॥

చ॥ బహుతరచాతురీగతుల బాణసహస్రములేయుచున్ మహా
మహుఁడయినట్టి భార్గవుఁడు మార్కొని శిష్యునకున్ రణంబు దు
స్సహమొనరింప నెంచ, నది సైఁచి ప్రతిక్రియలాచరించె, వ
ర్షహతికి నోర్చు కొండవలె శాంతనవుండతిధీరచిత్తుఁడై॥ ౧౬౧

ఉ॥ శస్త్రములన్ గురుండు బహుసంఖ్యలుగాఁ బరఁగించినన్ ధను
శ్శాస్త్రవిశారదుండయిన శాంతనవుండవి యెల్లఁ ద్రుంపఁగా,
భస్త్రికవోలె రోజుచును భార్గవుఁడాగ్రహచిత్తుఁడౌచు ది
వ్యాస్త్రములేయఁగాఁ దొడఁగె నంతటఁ: బంతము చెడ్డదక్కటా!॥

మ॥ భృగురాముండు సమంత్రకంబులుగ నీరీతిన్ మహాస్త్రంబులే
యఁగ, దేవవ్రతుఁడవ్వి వ్యర్థముగఁ బ్రత్యస్త్రప్రయోగంబు సే
యఁగ, 'నాహా! వహావా! సెబాసు' బళిరా!'' యంచున్ గురుం డెన్నుచుం
డె: గుణంబున్నను శత్రులందయిన నేనిన్ మెత్తురత్యుత్తముల్॥ ౧౬౩

సీ॥ గురుఁడు నాగాస్త్రంబు గొని యేయఁగ, మరల్చె
గరుడాస్త్రమునను గంగాసుతుండు;
మరుదస్త్రమ్మంతటం బరశురాముండేయ,
గుహ్యకాస్త్రంబునం గొట్టె శిష్యుఁ;
డాగ్నేయమును జమదగ్నిసూనుండేయ,
వారించె భీష్ముండు వారుణమున;
రాముఁడయ్యెడలఁ బర్జన్యాస్త్రమేయ, శాం
తనవుఁడు వాయువ్యమున నడంచె:

నిట్లు దేవవ్రతుండు దా నేసినట్టి
యతులితమహాస్త్రముల నెల్లఁ బ్రతిహతంబు
సలుప, శిష్యుని గాంచి రోషమ్మును బరి
తోషమును బొందె గురుఁడు విశేషముగను॥ ౧౬౪

ఉ॥ "అన్నముఁ, గూరలుం, బులుసు, నైన యనంతరమందె చద్ది, శ్రీ
రాన్నముఁ, బిండివంటలుఁ, బ్రియంబుగ వడ్డన యైన యట్టులే
యున్నది యీ రణం," బనుచు నూటలు గొఱుచుకొంచు నారదుం,
"డెన్నఁడొ కాని చేకుఱునె యీగతివిం?" దని గంతె వేడ్కమై॥

వ॥ ఇట్లిరువదిరెండు దినంబులు నారదమనోభిరామంబైన సంగ్రామంబు భీమంబుగా జరిగె॥ ౧౬౬

తే॥ గీ॥ భోజనానంతరంబునఁ బోరు సలుప
నరుగుదురు గురుశిష్యులు పురి బయటికిఁ ;
బ్రొద్దు గ్రుంకు ననంగను బోవుదురు గృ
హాభిముఖులయి యవ్వారలహరహంబు॥ ౧౬౭

వ॥ మఱునాఁటి రేయి గాంగేయునకు వసువులు స్వప్నంబున సప్తమహర్షిరూపంబులతో సాక్షాత్కరించి, "వత్సా, వసిష్ఠోపదిష్టంబయిన సమ్మోహనాస్త్రంబు మఱచితే? పరశురాముఁడది యెఱుంగఁ," డని పలికిన నులికిపడి లేచి చూచు భీష్మునికంటి కెవ్వరును దోఁచకుండిరి ; అంత॥ ౧౬౮

ఉ॥ "అత్యధికోగ్రతేజము గలట్టి భృగూద్వహుచేత ద్వాదశా
దిత్యులటన్న మాట జగతిం జెడి నూత్నముగాఁ ద్రయోదశా
దిత్యులటంచుఁ దేలెను; నదీసుతుఁడింక నణంచెడుం దదా
ధ్ధత్య,"మటంచుఁ జూచెడు విధంబున భానుఁడుతోఁచెఁ దూర్పునన్॥

చ॥ పగలు ఘటించు నారదుని పద్ధతికిన్ మది నేవగించుచుం,
బగలు ఘటించు నీరవిని మాత్రము మిత్రుఁడుగాఁ దలంచుఁ ; జీ!

జగమును జూడ రా," దని యసహ్యతఁ గన్నులు మూసెనో యనం
దొగలు ముడింగె: దోషనిరతుల్ గనుచుందురు లేని దోషముల్॥

చ॥ రమ రవిబింబమధ్యమున రాజిలుచున్న నిజాధినాథుఁడై
న మధువిరోధినిం గనుఁగొనన్ బహురూపములన్ ధరించుచుం
గమలగృహంబులం దెఱచెఁ; గాటుకకన్నుల నామె చూచు దృ
క్సముదయమో యనం గమలగర్భములన్ వెడలెన్ ద్విరేఫముల్॥

చ॥ నిశి తొలఁగంగఁ, దారకలు నిల్వక మాటు పడంగఁ, జంద్రికన్
శశి వొఱఁగంగ, దంపతులు శయ్యను వీడఁ దొడంగఁ, దెల్లనై
దిశలు వెలుంగ, సద్ద్విజులు తీర్థములందు మునుంగఁ, దద్వటుల్
కుశలు గొనంగఁ, జీఁకటుల గొంగ క్రమంబుగ లేచె నింగిపై॥

ఉ॥ పూర్వపు రీతిఁ బోరుటకు ముందుగ మ్రొక్కిన భీష్ముఁ జూచి, "నీ
గర్వము హెచ్చి కన్నులను గానక యుంటివి! నీదు దెబ్బకే
నోర్వఁగ లేనటంచు మది యూహ యొనర్చిన యట్లు నా పయిం
బర్వఁగఁ జేయకుంటి వొక బాణము," నంచును భార్గవుం డనన్॥

క॥ "అపరాధమ్మె స్వామీ!
కృపతో నను మొదటఁ గొట్టుఁడీ; మీ పయి నే
నపుడు పరఁగింతు భవదా
జ్ఞ పగిది నేనెఱిఁగినట్టి శస్త్రాస్త్రంబుల్"॥ ౧౭౪

క॥ ఈ కరణి భీష్ముఁ డన, "సరి
యే కాని," మ్మనుచుఁ బలికి భృగురాముఁడు ద
ర్వీకరభీకరశరముల
నేకంబులు పఱపి యాతనిన్ మార్కొనియెన్॥ ౧౭౫

క॥ ఆ పిదపఁ బోరు ఘోరం
బై పరఁగె: నిరంతరంబు నడరు తదుభయ
జ్యాపటుతరనినదంబున
గీపెట్టెను దిక్కరితతికిన్ శ్రవణంబుల్॥ ౧౭౬

చ॥ ప్రబలులు వారలొండొరులపై గుఱిగా వివిధాస్త్రశస్త్రముల్
నిబిడముగాఁగ నేయుచు ననేకవిధంబులఁ బోరి : రించుకే
ని బడలికేని లేని సరణిం గనిపించెడి భీష్ముఁ గాంచి, యిం
క బవరమిట్టి రీతిగనె కాని తుదిం గనదంచు నెంచుచున్॥ ౧౭౭

స్రగ్ధర॥

ఆనాఁడే భార్గవుండాహవము ముగియ బ్రహ్మాస్త్రముం దీసి యేసెం;
దానిన్ బ్రహ్మాస్త్రమే శాంతనవుఁడుగొనియంతం బ్రయోగంబుచేసెన్;
హానిం గావింప వేగంబరిగి నడుమ నయ్యాస్త్రముల్ దాఁక, హాహా
ధ్వానంబుల్ పుట్టె లోకత్రయమిఁక నవి దగ్ధంబుఁ గావించునంచున్॥

ఇంద్రవజ్రము॥ అమ్మై నదీసూతి భయంకరంబౌ
సమ్మోహనాస్త్రంబును జయ్యనం జా
పమ్మందు సంధించుచు వైవఁగా, ను
గ్రమ్మౌ గతిన్ మంటలఁ గ్రక్కకొంచున్॥ ౧౭౯

ఉ॥ వచ్చెడు దాని నాఁపుటకు వశ్యము గామిని రాముఁడాత్మలో
ఱిచ్చపడంగ జొచ్చి కనుఱెప్పలు మూయక చూచుచుండఁగాఁ,
"జచ్చెను! జచ్చె రాముఁ!" డని చప్పున నుప్పరవీది వీడుచున్
వచ్చెను శంకరుం; డజుఁడు వచ్చె, వియచ్చరకోటి గొల్వఁగన్॥

మ॥ "ఉపసంహారమొనర్పుఁడస్త్రముల, నోహో! యిద్దఱున్ మంచి బు
ద్ధిపరుల్ మీరలు! బద్ధశత్రువుల భాతిం జంపుకో సిద్ధమై
విపరీతంబగు శిష్యుఁడున్ గురువుగా వెల్గొందుచున్నారు! వి
ష్టపముల్ నాశనమౌటయుంగనరు! చాల్చాల్! త్రిప్పుఁడీయస్త్రముల్"॥

తే॥ గీ॥ అనుచు వారించి, భీష్ముతో నన వలసిన
యట్లు భీష్ముతో, రాముతో నన వలసిన
యట్లు రాముతోడ, నని చీవాట్లు పెట్టి,
యస్త్రముల మరల్పఁగఁ జేసె నపుడు హరుఁడు॥ ౧౮౨

వ॥ నిజగురుండగు హరుండు చెప్పిన చొప్పున తన బ్రహ్మాస్త్రంబు నుపసంహరించి, విరించిముఖుల యెదుట ఖిన్నుఁడై యున్న భార్గవుని గాంచి భర్గుండిట్లనియె॥ ౧౮౩

ఉ॥ "ఓటమి గల్గె నంచు నిటులుల్లమునన్ వెతఁ బొందెదేటికి? క
ల్లాటకుఁ గారణంబు గల: దల్లపుడీవు షడాస్యుతోడఁ బో
రాటము సల్ప, నాతఁడు పరాజితుఁడయ్యెను: జ్ఞప్తి యున్నదే?
పోటరి యాచు నిన్గెలుచు పుత్రుని గోరెను గంగ నాఁడె నన్॥

చ॥ నిఖిలవిదుండ; నీవెఱుఁగ నేరనిదున్నదె? యిన్నదీసుతుం
డు ఖలుఁడు గాఁడు; నీయెడఁ గడున్ వినయాత్ముఁడు: తండ్రి కోసమై
సుఖమును బొందఁ దగ్గ వయసుం దరుణీరహితంబొనర్చి, స్త్రీ
ముఖమును గాంచ రాని వ్రతమున్ వహియించెను బ్రహ్మచారియై॥

చ॥ అఘము నొనర్ప లేక భవదాజ్ఞను మీఱిన వాఁడె కాని, నిన్
లఘువుగఁ జూచె నంచును దలంచుటకుం బని లేదు సుమ్ము; నీ
కు ఘనత దెచ్చు; నిన్నుఁ గనుఁగొంటకు జంకుచు నున్నవాఁడు; నీ
దుఘృణకుఁ బాత్రుఁ: డాదరముతోఁ గనుమా,యిదె నీదుశిష్యునిన్॥

మ॥ గురునిన్ మించితి నన్న యీ వగపు నీకుం జాలు నోభీష్మ! యీ
సరణిం గమ్మనె నీ గురుండె, మును నిన్ సాఁగంగ నంపించుచోఁ;
దిరుగెన్నండును లేని వాక్కగుట సిద్ధిం బొందెఁ జు, " మ్మంచు ని
ర్వ్యరమున్ శర్వుఁడు నచ్చఁ జెప్పెను;సుపర్వుల్ మెచ్చిరా నేరుపున్॥

తే॥ గీ॥ "నను క్షమింపుమో గురువర్య," యనుచు రాము
చరణములకు భీష్ముండు సాష్టాంగపడియె;
"శ్రమము పెట్టితి నిన్ను వ్యర్థముగ," ననుచుఁ
గాఁగిటను జేర్చుకొనియె భార్గవుఁడతనిని॥ ౧౮౪

తే॥ గీ॥ కౌఁగిలించి, "యోవత్స! నిష్కరుణ నీదు
ప్రాణములఁ దీయ నెంచిన పాపమెడల,

వరము నిచ్చెదఁ గొనుమ : కా వలసినపుడె
ప్రాణముల వీడు శక్తిని బడయుమయ్య॥ ౧౮౯

శా॥ ఓ బాబూ ! యొక మోసకత్తె నను నేవో మాయలన్ ముంచఁగా,
ఆ బూమెల్ నిజమంచు నమ్మి నిను నన్యాయంబు నేఁ జేసితిన్ ;
స్త్రీబుద్ధిః ప్రళయంకరీ యనుట సంసిద్ధించె ; నా చెట్ట నన్
దా బుట్టం బడఁద్రోసె," నంచు వగచెన్ రాముండు లజ్జిల్లుచున్॥

క॥ "ఏదీ యంబ ?" యనుచు హరుఁ
డాదెస నీదెసను జూడ నపు, "ఓ దేవా
నీ దేహంబునఁ గల యం
బాదేవియె కాని యంబ మఱి లేదిచటన్॥ ౧౯౦

తే॥ గీ॥ తప్పి వచ్చినదని తన దారి దాను
బట్టి చనినట్టులున్నదంబ : సతులిట్టు
జుట్టులున్ జుట్టులున్ ముడి పెట్టి, సమయ
మునకు దాఁటుదు," రని దేవముని వచింప॥ ౧౯౧

తే॥ గీ॥ "నారదా, నీవు నిచట నున్నాఁడవయ్య ?
కడుపు పూర్తిగా నిండెను గద ? మఱి పద !
మనదు దారిని మనమును జనుద," మంచు
హరుఁడు చనె మింటికజునితో, సురలతోడ॥ ౧౯౨

తే॥ గీ॥ గురుని ప్రార్థించి, తమ వీటఁ గొన్ని నాళ్లు
నిలుపుకొనియెను భీష్ముండు ; నిశ్చయభయ
భక్తుల నతండు సలుపు సపర్యలఁ గని,
రాముఁడధికసంతుష్టాంతరంగుఁడయ్యె॥ ౧౯౪

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబువా:
రనఘులు వారి పాదముల నౌదలఁ దాలిచి, దానిలోని భీ
ష్ముని చరితంబు గ్రొత్తఁదనముం గన వ్రాసినవాఁడ నేను నే
ర్చిన గతి సెట్టిలక్ష్మినరసింహసమాఖ్యుఁడ ధీరసఖ్యుఁడన్॥

సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, దదంతరంగ
కార్యదర్శిని, దన్మహాదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలక్షణుండ॥



# ప్రభాసశాపవిమోచనము.

## IV

ఉద్వాహమునకు మున్ను మ
రుద్వాంఛ్యుండగు పరాశరు కృపఁ గనిన జ్యే
ష్ఠోద్వహ్యుఁడగు వ్యాసుం, గృ
ష్ణద్వైపాయనుఁ, దలంచె సత్యవతి మదిన్॥

సీ॥ ఋషిరాజచిహ్నకిరీటమహాచు జటాభ
రమ్మెత్తుగా శిరోగ్రమున వెలయ,
జ్ఞానాగ్నిచేత భస్మంబౌ నిఖిలపాప
పుంజంబనఁగ మేన బూది దనర,
నాత్మలో నున్న బ్రహ్మానందముబికిన
సరణి నాస్యమునఁ దేజస్సు వెలుఁగ,
సకలపాపముల పాలికిఁ దాను దండధ
రుండన వలకేల దండ మొప్ప,

నంబరీకృతకృష్ణమృగాజినుఁడయి,
సంబరంబునఁ దల్లియౌ సత్యవతి క
నం బరాశరమానినందనుఁడు, వ్యాసుఁ,
డంబురుహగర్భసన్నిభుండరుగుదెంచె॥ ౨

ఉ॥ జన్మముతోనె పెద్ద యయి, జ్ఞానము గల్గి, తపస్వియైన సూ
ను, న్మరలంగఁ గన్నులఁ గనుంగొనకుండిన తల్లికయ్యెడం,
జన్మానలందుఁ బాలుబికెఁ; జక్షువులందు ముదశ్రువుల్ జనిం
చెఁ; న్మది పొంగెఁ బున్నమశశిం గనుఁగొన్న సుధాబ్ధికైవడిన్॥ 3

శా॥ కన్యాత్వంబుడివోవకుండ మును దా గర్భంబునన్ ద్వీపమం
దన్యుల్ చూడని చోటఁ గన్న సుతుఁ, డవ్వ్యాసుండు జన్మించినం
త, న్యోగీశ్వరుఁడై తపస్సు సలుపం దానేగుచుం దల్లితో,
"దైన్యంబొందకుమమ్మ! నీవు మదిలో ధ్యానింప, నే వచ్చెదన్"॥ ౪

తే॥ గీ॥ అనుచుఁ జనినట్టి వాఁడు గావునఁ, దలంచి
నంత నతఁడు సత్యవతికిఁ బ్రత్యక్షమయ్యె;
మ్రొక్కిన తనూజుఁ గాంచి యమ్మ్రుదిత సమ్మ
దితమనోబ్జయై తగు గతి హితముఁ జూపె॥ ౫

శా॥ "తల్లీ; యేల ననుం దలంచితివి? చింతం దెల్పు నీమోము: నా
వల్లం గాఁగల కార్యమేమి?" యనుచున్ వ్యాసుండు ప్రశ్నింపఁ, గ
న్నీళ్లం గార్చుచుఁ, దన్ను శంతనుఁడు పత్నింగాఁగఁ జేపట్టుటం,
బిల్లల్ పుట్టుట, వారు గిట్టుటయుఁ, దెల్పెన్ దేవి సంపూర్తిగన్॥

ఉ॥ తెల్పి, "కుమార, నాపిత మదీయతనూజులకెల్ల రాజ్యముం
బాల్పడఁ గోరి, భీష్మునకుఁ బైతృకముం జెడఁగొట్టి, పాపమున్
సల్పెను: దత్ఫలంబుగను జచ్చిరొ నా సుతులిట్లు! దైవసం
కల్పము చెల్లుఁ గాని, జరుగం గలవే మనుజప్రయత్నముల్?॥ ౬

ఉ॥ అట్టి మహామునీశ్వరు దయన్ నినుఁ బోలు కుమారుఁ గాంచి, నా
గుట్టును దల్లిదండ్రులకుఁ గూడ వచింపక వేఱెయొక్కనిం
గట్టుకొనంగఁ, గ్రమ్మఱను గల్గిన సంతతి యేల నిల్చు? మున్
పుట్టిన నిన్ను నే విడిచిపోయిన పాపమె కొట్టె నన్నిటుల్"॥ ౭

వ॥ అని యనివార్యంబగు మనోదుఃఖంబున॥ ౮

ఉ॥ ఈ సరణిం దలంచుకొని యేడుపు మానకయున్న తల్లితో
వ్యాసుఁడు, "నీదు కన్నెఱికమాయనచేఁ జెడకున్కి తండ్రిగా
రే సెలవిచ్చినారు; మఱి యేనె నినున్ విడనాడి యేగితిన్:
దోసము లేదు నీయెడల; దుఃఖము నొందకుమమ్మ, యూరకే॥ ౧౦

ఉ॥ ఇంకొక మాట విన్ము జననీ : తన తండ్రి వసిష్ఠు నానతిన్
శంకరు భక్తితోఁ గొలిచి శక్తిమునీంద్రుఁడు, నాదు తాత, యే
ణాంకవిభూషు నంశమున నాత్మజుఁగాఁగను గాంచె మత్పితన్ :
శంకిల : కప్పరాశరుఁడు, శంతనుఁడున్, గిరిశాంశసంభవుల్॥ ౧౧

ఉ॥ మార్మనువంచు సాగరుని మాటను మాటికి గౌరి దెప్పఁగా,
నోర్మి మనంబునందుడిగి యొక్కదినంబున గంగ గౌరితో,
"ధర్మము తప్పి నాకుఱక తప్పును గట్టుచునున్న దాన : వి
ర్వ్వర్మగలాచు నుర్విపయిఁ బుట్టు," మటంచు శపించె నల్కమై॥

చ॥ కిలకిలమంచు నజ్జనని కిన్కను గన్గొని నవ్వినట్టి పు
త్రులను, గజాస్యషణ్ముఖులఁ, రోషమునం గని గంగ, "యోరి! మీ
రలొదవి, గర్భశోకము ధరం గలిగింపుఁడీ యీమె," కంచనెం:
దెలియుము, నాదు తమ్ములు గతించుటకిద్దియె హేతువంబరో॥ ౧౩

క॥ సవతులు మీరిరువురు, నిపు
డవనీస్థలి మరల సవతులైనారలు : గౌ
రివి నీవని తెలుపుటకు రు
జువు వేఱొకదాని నింకఁ జూప వలయునే ?"॥ ౧౪

చ॥ అని యిటు తెల్పి, సత్యవతి వ్యాసుని గన్గొని, "పెండ్లి కాకయుం
డనె పెదతమ్ముఁడీల్గెనకటా ! చినవాఁడు విచిత్రవీర్యుఁడే
ని నిలువు వంశమంచును గణించుచు నుండఁగఁ, బెండ్లి యైనయోఁ
టనె చెడు రాజయక్ష్మము హఠాత్తుగ గ్రమింగెను వాని మిత్తియై॥

క॥ మగమొలక వారి యిరువుర
ముగుదలయందొక తెకైనఁ బుట్టఁగ రాదా ?
తొగతేని నుండి వచ్చిన
దగు వంశంబంతరించు నయ్యో ! యింకన్॥ ౧౬

తే॥ గీ॥ ఆత్మపుత్రులెన్నఁడును రాజ్యంబు పైకి
రాక యుంటకై బ్రహ్మచర్యవ్రతంబు

పూని భీష్ముండు : పేరాశచే నదియును
నాదు జనకుండె చేయించినాఁడు మున్ను‖. ౧౭

ఉ‖ ఆ యలఘువ్రతంబు తను నష్టుటచే మఱఁదంద్రి దేవర
న్యాయమునన్ గ్రహించుటకు నాతఁడొకింతయు నొప్పకుండెఁ; బు
త్రా, యెట్టులైన నీదు మఱఁదండ్రకు నీవిఁకఁ బుత్రదానముం
జేయక తప్ప,'' దంచును వచింపఁగ, వ్యాసుఁడు యోగి యయ్యెనున్‖

తే‖ గీ‖ మాతృదేవత మాటకు మాఱు చెప్ప
నోడి, సమ్మతించెను దన్ని యోగమునకు;
నంబికను నాఁటి రాత్రియే యతని కడకు
సత్యవతి పంపునట్టి నిశ్చయమొనర్చె‖ ౧౯

క‖ దాసికలు డాసి వేద
వ్యాసునకున్ సొగసు చేయ యత్నింపఁగ, స
న్న్యాసి వివాహంబున కెగ
వే సకలంబన్న యట్టులేర్పడె నహహా !‖ ౨౦

ఉ‖ వేదములందుఁ జిక్కులను విప్పిన వ్యాసు జటాభరంబు నా
పైదలులెల్లఁ జిక్కు నెడఁబాపి సమంబొనరింప నేర; రా
పైఁ, దనువందు మున్ను గల భస్మము దాఁ దుడువంగనీయఁ; డే
మాదిరి నైన వారి తరమా సొగసున్ ఘటియింప మౌనికిన్?‖ ౨౧

ఉ‖ గడ్డము, మీసలున్, జడలుఁ, గార్నలుపైన శరీరముం, గనం
బడ్డ క్షణంబ యంబిక గబాలున మూసికొనెం గనుంగవన్;
బిడ్డఁడు మౌనిసంగతిని భీతమృగాక్షికిఁ బుట్టెఁ: గన్నులే
గ్రుడ్డివి గాని, లోపమనుకొంటకు లేదు మఱేది యేనియున్‖ ౨౨

క‖ ధృతరాష్ట్రుఁడంచుఁ బుట్టిన
యతనికిఁ బేరుంచి, పిదప నంబాలికకున్
మతి చెప్పి సత్యవతి యా
యతి కడకుం బంపె, మాయకత్తులటంచున్‖ ౨౩

క॥ మాయని కనులును, వెలవెలఁ
బోయిన మొగము నగు సతికిఁ బుట్టెను బాండు
చ్ఛాయ గల యొక కుమారుం:
డా యర్భకు పేరు పాండుఁడనఁగా బరఁగెన్॥ ౧౪

ఆ॥ వె॥ గ్రుడ్డివాఁడుఁ, బాండురోగియుఁ, గోడండ్ర
యందుఁ బుట్టుటరసి, యంబిక నిఁక
జడియకనుచుఁ జెప్పి సత్యవతీదేవి
మరల నరుగుమనియె మౌని కడకు॥ ౧౫

మ॥ తన పుట్టింటిది, గట్టి గుండెదియు, శూద్రస్త్రీయు నైనట్టి దా
సిని, "నోసీ కలభాషిణీ, మరల బూదిం బోని గడ్డాల మౌ
నిని నేఁ గూడఁగ లేను ; నా బదులుగా నీవేగుమా ; నీకు వే
యినమస్కారములేనొనర్చెదను దల్లీ," యంచుఁ బ్రార్థించినన్॥

క॥ భూషలను బెట్టుకొని కల
భాషిణి యపుడేగి మౌనిపతి మదికిఁ సం
తోషమును గలుగఁ జేయఁగ,
బేషైన సుతుండు పుట్టె విదురుఁడనంగన్॥ ౧౬

క॥ "వెఱచుచు నున్నారమ్మా,
మఱఁదండ్రు : మతేల ?" యంచు మాతకు వ్యాసుం
డెఱిఁగించి, తత్పదంబుల
కెఱఁగి, తపోవనమునకు నిజేచ్ఛం జనియెన్॥ ౧౭

మ॥ ధృతరాష్ట్రుండును బాండురాజు నటుపై నింతౌచు నంతౌచుఁ బె
ద్దతనం బొందఁగ, భీష్ముఁడంతటను గాంధారేశు నన్గుం గోమా
రిత గాంధారిని, గుంతిభోజనృపపుత్రిం గుంతినిం దెచ్చి, త
త్సతులౌ నట్టు వివాహముల్ వరుసగా సల్పెన్ మహాశోభతో॥

శా॥ అంధుండాత్మవిభుండు గావునను దా నంధత్వమే కోరుచున్
గాంధారీసతి రేపవళ్లును సదా కన్నుంగవన్ గంతలన్

బంధింపంగను జేసి, భర్తృపదసేవల్ సేయుచుండెం: బున
స్సంధానంబున నుండియే జరిపె నా సాధ్వీవతంసంబటుల్॥ 30

క॥ కుంతి సకలసుగుణంబుల
దాంతి యనెడి మంచి పేరితో నింతుల మే
ల్బంతి యయి, కంతు పట్టపు
దంతి గతిం దోఁచెఁ బాండుధరణీపతికిన్॥ 3౧

తే॥ గీ॥ మద్రరాజపుత్త్రిని స్వయంవరమునందుఁ
బడసె రెండవ భార్యగాఁ బాండురాజు;
మాద్రికిన్ రూపురేఖల మాద్రిగా హి
మాద్రిసేతుల నడుమఁ దొయ్యలులు లేరు॥ 3౨

ఉ॥ ఆ ధృతరాష్ట్రు పెండ్లియయి యాతనికిర్వదియొక్క-యేండ్లు కాఁ
గా, ధరణీజనానుమతి గాంచుచుఁ, గౌరవవంశరాజ్యల
క్ష్మీధవుఁగాఁగ, భీష్ముఁడల జ్యేష్ఠకుమారుని నిల్పె, నంధతా
బాధకముండుటం బనులు పాండునృపాలుని పాలు చేయుచున్॥ 33

చ॥ "ఇది యలనాఁడె నేను ద్యజియించిన రాజ్యము; జ్యేష్ఠుఁడౌట ని
య్యది ధృతరాష్ట్రుఁడొందెఁ; బ్రజలందఱిక నేను నొకండ నైతి; నా
బ్రదుకు గలన్ని నాళ్లు ధృతరాష్ట్రుఁడు, నాతని పుత్త్రు, లేమి చె
ప్పుదు, రది నేను జేయుదును బుణ్యముఁ బాపము నంచుఁ జూడకే॥

భుజంగప్రయాతము॥ ప్రమాణంబు నేనీసభం జేయుచున్నాఁ
డ; మీరెల్ల నోపాండుఁడా, బంధులారా,
క్రమంబొప్పఁగాఁ జేయ రం," డంచు భీష్ముం
డు మోమెత్తి చూడంగ, నోరెత్తకుండన్॥ 3౫

ఉ॥ పాండువిభుండు మున్ను గల బంధువులున్, హితులుం, బ్రజాళి, కూ
ర్చుండినవారు మోఁకరిలుచున్, "ధృతరాష్ట్రుఁడె మాకికన్ నృపా
లుండు; తదాజ్ఞలందు నొక లోపము కల్గిన నేని వాని నె
న్నండును మీఱఁ బో," మని యొనర్చిరి బాసలు దైవసాక్షిగన్॥

ఉ॥ "అంధుఁడవీవు, రాజ్యమున కర్హుఁడవేమియుఁ గావు; భ్రాతృసం
బంధముఁ బట్టి యిన్నేడలఁ బాండుఁడు నీదు ప్రభుత్వమొప్పె; నీ
బంధుల ప్రోల నీవు నొక బాస యొనర్పుము: నీదు తమ్మునిం
గంధరయందుఁ బ్రాణములు గల్గిన యంతకు వీడకుండుమా॥ 3౭

తే॥ గీ॥ కురుపతికి నీకుఁ బుట్టిన కొడుకులెల్లఁ
గౌరవులు; పాండురాజకుమారులెల్లఁ
బాండవులు; నీవు కౌరవపాండవులకు
సమముగాఁ బంచి యిమ్ము రాజ్యమ్ము నెల్ల"॥ 3౮

క॥ అనుచుఁ దమదు పెదతండ్రి య
యిన భీష్ముఁడు తనకుఁ దెలుప ధృతరాష్ట్రుం, "డ
ట్లొనరింపక తప్పిన, నా
తనయులఁ బరిమార్చుఁ గాక దైవం!" బనియెన్॥ 3౯

క॥ విదురుని బహునీతివిశా
రదుని సచివుఁగాఁ గొని ధృతరాష్ట్రుఁడు పాండుం
డు దనకుఁ దోడుగఁ, బెదతం
డ్రి దైవమటు ప్రోవ నేలె నిఖిలధరిత్రిన్॥ ౪౦

స్రగ్ధర॥

ఆపాండుక్ష్మావిభుండాయతబలుఁడయి దిగ్యాత్రఁ జేసెం: దదీయా
టోపంబాజిస్థలిన్ మెండుగ మదిఁ గలగుండన్ ఘటింపన్ విరోధి
క్ష్మాపాలగ్రామణుల్ తచ్చరణములపయిన్ సాఁగిలన్ మ్రొక్కి, "యింకం
గాపాడన్ మాకు నీవే గతి," వని బలుకానుకల్ సమర్పించిరంతన్॥

ఉ॥ దిగ్విజయంబు సల్పి యరుదెంచిన తమ్ముని హాసమల్లికా
స్రగ్విసరంబుచేత ధృతరాష్ట్రుఁడు మిక్కిలి గారవించెఁ: దా
దృగ్విధమైన సాయమొనరించుచుఁ బాండుఁడు, మంత్రతంత్రముల్
వాగ్విభుబుద్ధితోఁ దెలుపువాఁడగుచున్ విదురుండుఁ గొల్వఁగన్॥

వ॥ అంధుండయ్యు నేత్రద్వయియాదృష్టి సమన్వితుండుం బోలె నాంబికే
యుండు రాజ్యంబు సేయుచుండె; నంత నొక్కనాఁడు॥ ४३

చ॥ అడవికి వేఁటలాడుటకునై చని పాండునృపాలుఁ, డందు నొ
క్కెడ మృగరూపులై మిథునకృత్యము సల్పుచుఁ దెల్పరాని సం
దడిని జరించుచున్న మునిదంపతులందు సతిక్ శరంబునం
బడునటు గొట్టె; మండి పడి మౌని, "యరే! కరుణావిహీనుఁడా॥

చ॥ మిథునసుఖంబులం బడి రమించు మృగంబుల వేఁటలోపలన్
వధమొనరింప రా, దెఱుఁగవా? తులువా, సతిఁ జంపి నాకు ని
వ్విధమగు ఘోరదుఃఖమొదవించితి: వట్లగుటం బడింతితో
నిధువనమాచరించునెడ నీవును జత్తువు గాత వెంటనే"॥ ४४

తే॥ గీ॥ అనుచు శపియింప నిఁక గృహస్థాశ్రమంబు
తగదటంచు వానప్రస్థుఁడగుచు నటనె
భార్యలును దాను శతశృంగపర్వతమున
నుండె యోగంబొనర్చుచుఁ బాండురాజు॥ ४५

ఉ॥ అవ్విధి నాతఁడుండి తన యంగనలం గనుఁగొంచు, "నక్కటా!
పువ్విలుకాని శాతశరపుంజము నోర్చుచుఁ గాలమెల్లనే
నెవ్విధిగాఁ దరింతు? నటులేను జరింపఁగ నేర్తుఁ గాక, యీ
జవ్వనులట్టులుండఁగను జాలుదురే తనువుల్ భరించుచున్?॥ ४६

చ॥ ధవుఁడు సజీవుఁడై వెలయఁ, దామిటుగా విధవాత్వమొందు ని
య్యువిదల నేను జూచినపుడుల్లము దల్లడమొందు; వీరి గ
ర్భవతులఁ జేయఁగా నొరులఁ బ్రార్థన సేయుదు; నాదు తప్పటుల్
సవరణ కాఁగ, నాత్మభవసౌఖ్యములొందఁగ నేర్తురీసతుల్॥ ४७

క॥ క్షేత్రజులగు పుత్రకులు క
ళత్రంబులవలన నాకు లభియించ, లతా
గాత్రులకుఁ జింత తొలఁగును;
బుత్రులచే నాకుఁ దొలఁగుఁ బున్నరకంబుల్"॥ ४८

వ॥ అని పాండురాజు తన మానసంబున సమాధానంబు వహించి వెండియు॥ ౫౦

క॥ "నే నెవరి నియోగింతును?
మానులకడకంప, నాదు మాతల వలెనే
యీ నెలఁతలు బెదరిన, సం
తానమునకుఁ గలుగు నంధతయు నిత్యాదుల్॥ ౫౧

తే॥ గీ॥ దివిజవరుల నర్థులను బ్రార్థింపఁగఁ దగు
నందనులఁ బ్రసాదింతురు నా సతులకు;
వారలు ప్రసన్నులగు నట్టి దారి యెట్లొ?"
యంచుఁ బాండువిభుండు చింతించుచుండ॥ ౫౨

ఉ॥ దుర్వాసుఁడాత్మశిష్యతతితో నరుదెంచెను బర్ణశాలకున్;
శర్వసమాను నమ్మునిని సత్కృతులం బరితుష్టుఁ జేసి, యా
శీర్వచనంబులొంది, తన చిత్తములోఁ గల యట్టి కోరికన్
సర్వముఁ జెప్పె నా నృపుఁడు; సంయమియుం గరుణాంతరంగుఁడై॥

తరువోజ॥

"ఏల చింతింతువుర్వీశ? నీ పెద్ద
యింతియా కుంతి నీయిష్టంబు దీర్పఁ
జాలు: నీ కోరు నిర్జరుల రావింప
శక్తిని గలది; యా సాధ్వీమతల్లి
బాలయై తన తండ్రి పజ్జ నున్నపుడు
భక్తితో నాదు సపర్యలు సలిపి,
యా లీల మహిమ గలట్టి మంత్రంబు
నర్థింపకుపదేశమందె నావలన॥ ౫౪

ఉ॥ ఇంతిని జిన్ననాఁటఁ జెలు, "లెవ్వరిఁ గోరెద?" వన్నఁ, బద్మినీ
కాంతయమానిలేంద్రులను గన్నియ పేర్కొను, నందఱున్ నరున్!

గొంతెమ కోర్కెలన్న నుడి క్రొత్తగ సామెత యయ్యె ధాత్రి; న
క్కాంత యటుల్ వచించుటకుఁ గారణమున్నది, విన్ము తెల్పెదన్॥

ఉ॥ కశ్యపుడన్ప్రజాపతికిఁ గల్గిరి ముగ్గుర్ చెలియండ్రాకిర్వు : రా
కైశ్యము, లాస్యముల్, కనులు, కంధరముల్, తనువుల్, కనుంగొనన్,
వశ్యలు గాక యుండు మగవారు దివంబున లేరు ; దేవతా
వేశ్యల సోయగంబులకు వేయి మడుంగులు వారి యందముల్॥

తే॥ గీ॥ పెద్ద యాపె రూపము వలపించె రవియ
మానిలేంద్రుల ; నల్లె చిన్నాపె రూపు
వలపు గలిగించె నాశ్వినేయులకు : వారి
భర్త చూచాయగాఁగఁ దద్వార్త యెఱిఁగి॥ ౫౮

క॥ "అమరవరేణ్యులు మీ రూ
పములం గనుఁగొంచు నాసపడిరి ; పుడమి జ
న్మములు గని మీరు తదభీ
ష్టములం దీర్పుఁ," డని తనను సతులకుఁ దెలుపన్॥ ౫౯

చ॥ "మిము నెడఁబాసి మేము పుడమిం బడియుండఁగలే," మటంచు దై
న్యమున వచించు సుందరుల నారసి, వారిని బాసి యుంట క
ష్టమని యెఱింగి యాతఁడు, "పడంతులు! చింతలు మానుఁ; డేనుమీ
కు మగఁడనై జనించెదను క్షోణి," నటంచును బల్కెఁ బ్రేమతో॥

తే॥ గీ॥ కశ్యపుని కడకేగి బిక్కమొగమగుచుఁ
బెద్ద చెల్లెలు కతను దెల్పింప నతండు,
"బెదరకమ్మాయి! నేను, నీ వదినె యయిన
యదితియును, ధర నిపుడు పుట్టుదుము సుమ్ము॥ ౬౦

మ॥ ధరణీభారముఁ బాప విష్ణుఁడిలమీఁదం గృష్ణుఁడై నేఁటి ద్వా
పరమందున్ జనియించు ; నట్లు జనియింపం బోవుచో, మాకు ని
ర్వురకే పుట్టుట తప్ప : దక్కమలనేత్రుం బుత్రుఁగాఁ గాంచ ను
ర్వర జన్మింతు," మటన్న కశ్యపునితో వామాక్షి ప్రేమంబునన్॥

తే॥ గీ॥ "అన్నయా, మనమిరుపురమవని నొక గృ
హంబునసె యున్న సెలియంద్రమై జనింప
వలయు నని యున్నదనఁగఁ, "జెల్లెల, హరి కృప
నట్లె యగుఁ గాక!" యనుచుఁ గశ్యపుఁడు పలికె॥ ౬౨

మ॥ యదువంశంబున శూరసేనుని సుతుండై పుత్రియై ధాత్రి వా
రుదయంబై, వసుదేవుడుం బృథయు నా నొప్పారి; రంతం దదీ
యదయాపాత్రుఁడు, మేనయత్త తనయుం, డౌకుంతిభోజుండు ప్రీ
తి దలిర్పంగను బెంచె నాపృథను గుంతీనామముం బెట్టుచున్॥ ౬౩

శా॥ సంతానంబును గుంతిభోజు సతి గాంచన్ లేనిదై నందునం
గుంతిం బువ్వులలోనఁ బెట్టి పెనిచెం; గొన్నాళ్లకే నేగ, నా
చెంతం గన్యను సేవ చేయుటకు నుంచెం దండ్రి; నేనా మెకున్
సంతోషంబున మంత్రముం గఱపఁ, దాఁ జాపల్యమే పారఁగన్॥

తే॥ గీ॥ కన్నె దానిని జపియించి తన్నుఁ దలఁచి
నంత నాదిత్యుఁ డెదుటఁ బ్రత్యక్షమగుచు,
సరిగఁ దన్నుఁ బోలిన ప్రభాశాలి యగు కు
మారుఁ గలిగించె: నట్టిదమ్మంత్రమహిమ!॥ ౬౫

క॥ సద్యోగర్భంబున నటు
లాద్యుమణికిఁ గలిగిన సుతు నామె యొరులకున్
వేద్యంబు గాక యుండఁగ
నద్యంబులఁ బెట్టెఁ నునిచి నాఁడే విడిచెన్॥ ౬౬

తే॥ గీ॥ రాధ యన్నట్టి యొక సూతరమణికతఁడు
దొరకి, పెరుఁగుచున్నాఁడు తత్సుతుఁడుగాఁగ;
నతఁడు సహజకుండలకర్ణుఁడగుటఁ, గర్ణుఁ
డన్న పేరితో మెలఁగుచనున్నవాఁడు॥ ౬౭

శా॥ తీరెను లోకబాంధవు మదిం గల కోర్కి; యమూని లేంద్రులీ
డేఱని వాంఛితంబులను డెందములం గల వారు; నీ మదిన్

వేఱు దలంప, కమ్మువురు వేల్పులం బిల్వంగం గుంతిం బన్పుఃము
మ్మాఱును నీకు మేలగు కుమారులు గల్గుదు రావిధంబునన్॥ ౬౮

క॥ మంత్రముం గుంతికడఃగొని, ని
మంత్రణమశ్వుల నొనర్ప మాద్రిం బనుపు : మా
త్మంత్రంబున నామెయును స్వ
తంత్రముగాం గను నిరువురం దనయుల నీకున్॥ ౬౯

ఆ॥ వె॥ పంచపాండవులన బహుసుప్రసిద్ధి ప్ర
పంచమందు వారు పడయం గల,'' ర
టంచు మాని యరుగ, నటులే నియోగించి
పంచెం దనదు సతులం బాండురాజు ౭౦

ఆ॥ వె॥ కుంతి గనియె నంతం గొమరుల, యమధర్మ
రాజువలన ధర్మరాజు, వాయు
దేవువలన భీము, దేవేంద్రువలనం న
ర్జునుని, బాండుభూవరుండు చెలంగ॥ ౭౧

ఆ॥ వె॥ మాద్రి కుంతివలన మంత్రోపదేశంబు
గనుచు నాశ్వినేయులను దలంచి,
సవతి గతినె నకులసహదేవులనియెడి
కవలం గనియెం బ్రాణధవుని యాజ్ఞ॥ ౭౨

తే॥ గీ॥ తొడికోడలు కుంతి పుత్రుని గనె నని
విన్న గాంధారి యంతకు మున్నె వత్స
రంబు క్రిందటం దాను గర్భవతి యయ్యుం
గాన్పు రాక యుండుటకుం జీకాకు చెంది॥ 23

చ॥ కుడితిని బోసికోం దగిన గోలెము రీతిని మోంతచేటుగాం
గడుపు వివర్ధితంబగుటం గన్గొని, నల్వుర యెక్కసక్కెముల్
పడుటతికష్టమై, కడుపు బాదుకొనెన్ ధృతరాష్ట్రరాణి ; యా
బిడుయుదరంబునందుం గల పిండము తుండులుతుండులై పడన్॥

ఉ॥ పిండము నూఱు ఖండములు భీష్ముఁడు తైలసమన్వితంబులౌ
భాండములందుఁ బెట్టి యటుపై, దిగువం బడి యున్న యట్టిదౌ
గుండను బ్రోవుచేసి యొకకుండను బెట్టఁ, గొమాళ్లు నూర్వురుం,
గొండిక యాచు నొక్కతియ కూఁతురు పుట్టిరి వేఱువేఱుగాన్॥

మ॥ పుడమిం గౌరవులీగతిన్ వరుసగాఁ బుట్టొంది : రందగ్రజా
తుఁడు దుర్యోధనుఁడన్న పేరు పడసెన్ ; దుశ్శాసనుండన్న యా
తఁడు దుర్యోధను వెన్కవాఁ ; డిఁక నగ స్త్యభ్రాతలాపై సుతుల్ ;
కడగొట్టై జనియించె దుస్సల యనంగాఁ గూఁతురొక్కర్తయే॥౭౬

ఉ॥ ఈధర దుర్నిమిత్తములనేకములెల్లెడఁ గల్గఁ జొచ్చె దు
ర్యోధనుఁడుద్భవంబయిన రోజున ; నయ్యవి గాంచి భీష్ముఁ, " డ
య్యో! ధవళాంశునుండియు మహోన్నతి గాంచిన కౌరవాన్వయం
బీధృతరాష్ట్రసూతి పొలియించునొ యంచుఁ దలంకె నాత్మలో॥

తే॥ గీ॥ పెరుఁగుచుండిరి కౌరవుల్ భీష్మరక్ష
ణంబు గాంచుచు నిట హస్తినాపురమునఁ ;
గుంతి వేయి కన్నులను గన్గొనుచుఁ బెంపఁ,
బెరుఁగుచుండిరి పాండవుల్ పేరడవిని॥ ౭౮

సీ॥ మునుల సేవలను సల్పుచు నభ్యసించు స
త్యముఖసద్గుణములు ధర్మరాజు ;
పరిమార్చు భీముండు కరిసింహశార్దూల
ముఖజంతువుల నిజభుజబలమున ;
గుఱి తప్పకుండఁగాఁ గొట్టు నమ్ములతో వి
హంగంబులెగురంగ నర్జునుండు ;
వన్యంబులైన యశ్వముల మచ్చిక చేసి
నకులుండు స్వారి యొనర్చుచుండుఁ ;
దపసిజనముల యాశ్రమాంతరములఁ గల
పశువులకు సహదేవుండు పాలు పితుకు ;

పాండునందనుల్ శతశృంగపర్వతమున
మెలఁగిరిట్టులు మునికుమారులను గూడి॥ ౭౯

తే॥ గీ॥ సంయమివతంసములుపదేశమ్ము తమకొ
నర్ప, ధర్మజభీమార్జుననకులసహ
దేవులతిభయభక్తులం దెలిసికొనిరి
వేదవేదాంగశాస్త్రాదివిద్యలెల్ల॥ ౮౦

వ॥ అంత నొక్కనాఁడు కుంతీపాండవులు పర్ణశాలయందు లేని సమయంబున॥ ౮౧

ఉ॥ మాద్రి మనోజరాజ్యరమ మాద్రిగఁ దోఁపఁగఁ, బాండురాజు హే
మాద్రిసమానధైర్యమతి యయ్యును దియ్యనివింటివాని ని
ర్ణిద్రపరాక్రమంబునకు నిర్జితుఁడై యల నాతిఁ గూడి, యే
తద్రతిచే మృతిం గనియెఁ: దాపసిశాపము రిత్తవోవునే?॥ ౮౨

చ॥ సహగమనంబు చేసె నల జవ్వని; యవ్వని నున్న సత్కృపా
వహులయినట్టి తాపసులు వంతను గ్రుంగిన యట్టి కుంతితో
బహుతరశోకవంతులగు పాండవులం గొనిపోయి, తత్పితా
మహుఁడగు భీష్ము చెంతకుఁ గ్రమంబుగఁ జేరిచిరంత నాప్తులై॥

ఉ॥ ధర్మజుఁడాదిగాఁ గల పృథాతనుజాతుల, మాద్రిపుత్రులం,
గూర్మిని బెంచె భీష్ముఁ; డల కుంతియు నిల్చెను మామ యింటనే;
దుర్మతులైన కౌరవులు తొల్తటినుండియుఁ బాండుపుత్రులం
దోర్మి వహింపకుండిరి తదున్నతికిం గనుకుట్టినందునన్॥ ౮౪

క॥ తన పుట్టిన దినముననే
జనియించిన భీముతోడ సహజన్ములుఁ దా
నును జాల లేక దుర్యో
ధనుఁడు పగను బూని చంపఁ దలఁచును వానిన్॥ ౮౫

ఉ॥ ఇర్వురు, మువ్వురున్, నలువు, రేవురు, మాత్రమె కాక కౌరవుల్
న్నూర్వురు నొక్కమాఱుగఁ దనుం గవియంగను భీముఁడందఱుం

బర్విడునట్లు వారిఁ బెడబాఁదును మోఁదును రెండుచేతులన్:
ఓర్వమి వారి డెందముల నుద్భవమొందె ననంగ వింతయే?॥ ౮౬

తే॥ గీ॥ అగ్రజుని యట్లె భీము వీర్యమును గాంచి
సైఁపఁగా లేక యుండె దుశ్శాసనుండు;
అల్లురకుఁ జాటుగా నుపాయములు దెల్పు
చుండె గాంధారి యనుఁగుఁ దమ్ముండు, శకుని॥ ౮౭

క॥ పాములచేఁ గఱపించిరి;
యేమఱి నిద్రింపఁ, గట్టి యేఁట వయిచి; రిం
కేమేమొ వారు చేసిరి:
భీముఁడు కసుగందకుండఁ బెరుఁగుచు నుండెన్॥ ౮౮

చ॥ కృపుఁడును ద్రోణుఁడున్ ద్విజవరేణ్యులు, బావమఱందు, లస్త్రశ
స్త్రపరులు: వారిచెంత ధృతరాష్ట్రతనూజులఁ, బాండుపుత్రులన్,
"నిపుణులుగాఁగ వీరలకు నేర్పుఁడు విద్య"నటంచు భీష్ముఁడుం
చి, పెరిమతోడ రక్షణము సేయుచునుండెను దాను బౌత్రులన్॥

ఉ॥ ద్రోణుఁడనంగ భార్గవునితోఁ దులదూఁగెడి యస్త్రశస్త్రపా
రీణుఁ: డతండు విద్య నొక రీతినె వారికిఁ జెప్ప, విద్యపైఁ
బ్రాణము పెట్టి నేర్చుకొని, పాండవమధ్యముఁడర్జునుండు తా
బాణములేయఁ జొచ్చె నిరుపాణులతోడను సవ్యసాచియై॥ ౯౦

శా॥ విశ్వాసంబు గలట్టి శిష్యుఁడగుటన్ వీక్షించుచుం, బుత్రుఁడౌ
నశ్వత్థామను మించఁగా గురుఁడు విద్యన్ నేర్పి యప్పార్థునిన్
విశ్వంబందసమానధన్విగను గావించెన్: రణక్షోణి ను
ఛాశ్వుండైన నెదిర్చినన్ నిలుచువాఁడయ్యెన్ నరుండయ్యెడన్॥

చ॥ నరుఁడన నర్జునుండె: నరనామకమౌని ప్రభాసుఁ జంపఁగా
ధర నుదయింప నెంచెను గదా? వసువాతఁడు భీష్ముఁడై వసుం
ధరను జనింప, నమ్ముని పృథాతనయుండయి జన్మమై, ధను
ర్ధరులకు మేటియై వెలసెఁ బ్రాక్తనజన్మతపంబు పెంపునన్॥ ౯౨

క॥ నారాయణముని శ్రీమ
న్నారాయణుఁడొదవెఁ గృష్ణనామముతో భూ
భారముడుప వసుదేవకు
మారుండై దేవకీరమణి గర్భమునన్॥ ౯౩

క॥ బలరాముఁడు పుట్టువు గనె
నల కృష్ణుని యన్న శేషునంశంబున ని
య్యల వసుదేవుని రెండవ
కులసతి యగు రోహిణికిని గొమరుండగుచున్॥ ౯౪

చ॥ హలముసలంబులాయుధములౌచు గదాసమరంబునందుఁ గౌ
శలమును గల్గు సత్యధికసత్త్వయుతుల్ బలరాముఁ గొల్చి, దో
ర్బలయుతులైన యట్టి ధృతరాష్ట్రుని యగ్రసుతుండు, భీముఁడుం,
దెలిసికొనంగఁ జాలిరి తదీయరణంబున నేర్పిటీవలన్॥ ౯౫

క॥ ఈధర నర్జునుఁ బోలిన
యోధుండని యంగరాజ్యమొసఁగి సఖుఁగ దు
ర్యోధనుఁడు నిల్పుకొనియెను
రాధేయుం, గర్ణుఁ, బరశురాముని శిష్యున్॥ ౯౬

తే॥ గీ॥ దుష్టులని పేరులం బట్టి దోఁచునట్టి
సఖుల దుర్యోధనుఁడని దుశ్శాసనుఁడని
చెప్పక సుయోధనుఁడు, దుస్సేనుఁడు, నని
చెప్పుచుండును గర్ణుండు స్నేహబుద్ధి॥ ౯౭

తే॥ గీ॥ సహజవితరణముఖగుణసహితుఁడతఁడు
దుష్టుఁడయ్యెను సహవాసదోషమునను;
శకుని, దుర్యోధనుఁడును, దుశ్శాసనుండు,
నతఁడు, దుష్టచతుష్టయమనిరి జనులు॥ ౯౮

ఉ॥ నిర్జరులైన గెల్వఁగను నేరని వీరుఁడటంచు నెల్ల వా
ర్జును మెచ్చఁ, గర్ణుఁడెదయందు నసూయ వహించి, యాజిలో

నిర్జితుఁ జేయ లేక, యతనిన్ సహజన్ములతోడఁ గూల్పఁగా
దుర్జనులైన కౌరవులతోఁ దలపోయు సదా కుతంత్రముల్॥ ౯౯

క॥ పాండవకౌరవులందా
తండ్రగజుఁడంచుఁ దలఁచి ధర్మాత్మజు భీ
ష్ముండు యువరాజుఁ జేసెను:
మండె సుయోధనుని మనసు మాత్సర్యాగ్నిన్॥ ౧౦౦

చ॥ సతతమజాతశత్రుఁడని సన్నుతి గాంచిన ధర్మపుత్రు ను
న్నతిని గనంగఁ జాలక మనంబుల దుష్టచతుష్టయంబు కీ
డు తలఁప, భీష్ముఁడున్ విదురుఁడుం దదసూయ యెఱింగి, వారణా
వతమున నుండఁగా ననుజవర్గయుతంబుగఁ బంపిరాతనిన్॥ ౧౦౧

క॥ హాస్తిపురంబందుండియె
దుస్తంత్రంబులను నడిపె దుర్యోధనుఁడా
ర్యస్తోమముచే నధిక
ప్రస్తుతులం బడయుచున్న పాండుసుతులపై॥ ౧౦౨

క॥ లక్కయిలు వారలుంటకుఁ
జక్కఁగఁ గట్టించి యిచ్చి, జ్వాలదనలముచే
నక్కౌరవాగ్రజుండది
యొక్క నిశం గాలిపించె నుక్కివుఁడగుచున్॥ ౧౦౩

క॥ అందుఁ బడి పాండునరపతి
నందనులు గతించిరని మనంబులఁ గనిరా
నందంబును దుర్యోధను
డుం, దమ్ములు, శకుని, కర్ణుఁడు, నమందముగాన్॥ ౧౦౪

ఉ॥ అన్యాయముద్ధరింపఁగ సమర్థులు పాండుసుతుల్ గతించిరం
చున్వగచెన్ నదీసుతుఁడు; క్షోణిని బార్థునితో సమానుఁడౌ
ధన్వి జనింపఁ బోవఁడు గదా యను చింతను ద్రోణుఁడుం గృపుం
డున్విలపించి; రంధనృపుఁడుం బరితాపము గాంచె భార్యతో॥

చ॥ విదురుఁడు నేర్చుచున్నటులె విన్కిడి చేసెను గాని, పాండవుల్
బ్రదుకుటకాతఁడే యొక యుపాయము పన్నెను ; వారు తల్లితో
డఁ దడయ, కాగృహంబెడలి దగ్గఱ నున్న వనంబులోనికా
పదఁ బడకుండ మున్నగనె పాఱిరొరుల్ గనకుండ నన్నిశన్॥

ఉ॥ అవ్వనిలో హిడింబుఁడను నట్టి భయంకరదైత్యుఁ డొక్కఁడా
యవ్వను బుత్రులం దినెడు నాశను రాఁగను భీముఁడాఖలుం
గ్రొవ్వడఁగించి చంపి, యల క్రూరుని చెల్లెలినిన్ హిడింబ యన్
జవ్వని, నన్నయున్ జనని సమ్మతిలన్, సతిగాఁగఁ జేకొనెన్॥౧౦౭

క॥ ఉత్కంఠను దనుఁ గోరిన
తత్కామినితోడఁ బవనతనయుఁడు గూడం,
గుత్కీలకసమతనుఁడు ఘ
టోత్కచుఁడను నొక్క తనయుఁడు జననమయ్యెన్॥ ౧౦౮

ఉ॥ ఆపయి నేకచక్రపురమన్న స్థలంబును జేరి, యంబతోఁ
బాఁపల యింట నుండిరటఁ బాండవు ; లచ్చటివారికంతకుం
డై పొలియించుచున్న బకుఁడన్న భయంకరమానవాశనున్
రూపడఁగించె భీముఁ, డసురుల్ తన పేర్విని బెగ్గడిల్లఁగన్॥ ౧౦౯

సీ॥ పాంచాలమేలు ద్రుపదునకు యజ్ఞసం
భవ యైన కృష్ణ కోమార్త యనియు,
నా ద్రౌపదీకన్య యందంబునన్ రతి
దేవి సద్గుణముల దీవి యనియు,
నెలప్రాయమున నున్న యల కన్నియకు స్వయం
వరమును ద్రుపదుండు జరుపు ననియు,
మింటను గల యంత్రమీనమమ్ముఁలఁ గూల్చు
ఘనునికాతఁడొసంగుఁ గన్య ననియుఁ,
బలువురెఱుఁగఁ జెప్పఁ బాండవేయులు విని,
యా స్వయంవరంబు నరయునట్టి

.కోర్కె మొదలఁ బుట్టి కుంతితో నరిగిరి
గిరుల, ఝరుల, దరులఁ, బురుల, దాఁటి॥ ౧౧౦

శా॥ గంగాప్రాంతము చేరి వారరుగుచోఁ గాంతారమందొక్కసం
ధ్యం గాంతారతచిత్తుఁడై తిరుగు వాఁ, డంగారపర్ణుండనం
గం గంధర్వుఁడొకండు వారలను వీఁకం దాఁకి తాఁ బార్థుచే
భంగంబుం గని, మైత్రి చేసికొని, సంభావించె నవ్వారలన్॥౧౧౧

ఉ॥ "గ్రామ్యజనంబుగాఁగ మముఁగాంచి, యితండిటుగాఁబఱుంబడెన్;
సౌమ్యులమంచుఁ దెల్పుకొను చందమిదే," యనుచున్ వసిష్ఠుతో
సామ్యము గల్గినట్టి శ్రుతిశాస్త్రవిశారదు, బ్రాహ్మణోత్తమున్,
ధౌమ్యుని గోరి చేకొనిరి తాము పురోహితుఁగాఁగఁ బాండవుల్॥

ఉ॥ మార్గమునన్ స్వయంవరపు మాటలె మాటికిఁ జెప్పుకొంచు రా
డ్వర్గము తేరులెక్కి, పెఱవారలనేకులు పాదచారులై,
దుర్గమమౌ నరణ్యములఁ దూఱుచుఁ బోవఁగ, వారి వెంట న
య్యార్గురు ధౌమ్యతోఁ గలిసి యాఁగక యేగిరి వేగిరంబుగన్॥

చ॥ ద్రుపదుని ప్రోల్ వితానములతోడఁ, బతాకలతోఁ, దురంగమ
ద్విపములతో, నృపాలకుల తేరులతో, సమలంకృతంబులౌ
విపణులతోఁ, గళల్గులుకు వీథులతో, శుభవాద్యఘోషతో,
నపుడతిరమ్యమయ్యెను స్వయంవరకల్పితనూత్నశోభతో॥ ౧౧౪

శా॥ "దృష్టిన్ దర్పణరూపమందిడి వియద్వీథిన్ మినుక్కంచు న
స్పష్టంబై తగు యంత్రమత్స్యమొక యేన్బాణంబులం గూల్చు వాఁ
డిష్టుండౌను మదీయసోదరికి," నంచేర్పాటుగా నయ్యెడన్
ధృష్టద్యుమ్నుఁడు తెల్ప, నట్లొనరుపన్ నేరండు రాజొక్కఁడున్॥

శా॥ విప్రాకారత విప్రకోటి నడుమన్ వెల్గొందు శౌర్యేందిరా
వప్రాంచద్భుజుఁడైన యర్జునుఁడు సర్వక్షోణిపుల్ చూడఁగా
క్షిప్రంబేయుల యంత్రమత్స్యమును గూల్చెన్; గెల్చెఁ జెల్చెన్ విశే
షప్రఖ్యాతులఁ గర్ణముఖ్యులను మాత్సర్యంబునం దాఁకినన్॥౧౧౬

ఉ॥ ద్రౌపది వెంట రాఁగఁ దనతల్లి సమీపము చేరి పార్థుఁ, "డ
మ్మా, పరమప్రియంబగు పదార్థము తెచ్చితి," నన్నఁ, "బంచుకొం
డీ పరిశుద్ధచిత్తముల నేవురు," నంచును గుంతి పల్కెఁ: గా
రాపె యమోఘవాక్యమున నైదుగురుం బతులైరి కృష్ణకున్॥

క॥ పంచశరుఁ డపుడు పాండవ
పంచకము పయిన్ నిజశరపంచకమును విల్
వంచి పరఁగించి, మదిగరఁ
గించెను వారైదుగురికిఁ గృష్ణను గనుచో॥ ౧౧౮

చ॥ తొలుతటిదైన జన్మమున ద్రోవది తాపసికన్యయై, హరుం
దలఁచి తపంబొనర్చి, పతిదానమొసంగుమటంచు నైదు సా
రులు వచియించినందున వరుల్ సతికైదుగురిప్పుడౌదురం
చల ద్రుపదావనీధవుఁడు వ్యాసుని వల్ల నెఱింగి సమ్మతిన్॥ ౧౧౯

ఆ॥ వె॥ పంచపాండవులకు భార్యయుఁ దానను
గాల్లు కడిగి తనదు కన్య నొసఁగె,
నన్నదమ్ములైన యవ్వారి యనుబంధ
మేకపత్ని కతన హెచ్చుగాఁగ॥ ౧౨౦

తే॥ గీ॥ తమదు మేనత్తకొడుకులు ధర్మజాదు
లనుచు బలరామకృష్ణులు వినుచుఁ, బొత్తు
కలిపి గౌరవించిరి పాండవులను: గలిగె
నరమరలు లేని మైత్రి కృష్ణార్జునులకు॥ ౧౨౧

క॥ వియ్యము పాంచాలురతో
నెయ్యము యాదవులతోడ నెగడుటచే, సా
హాయ్యము గల పార్థులఁ గని
ప్రయ్యంగఁ దొడంగె ధార్తరాష్ట్రుల మనముల్॥ ౧౨౨

చ॥ బ్రదికిరె యున్నవారవనిఁ బాండవులంచును విన్న యంతనే
హృదయమునందు శాంతనవుఁ డెంతయు సంతసమంది యంతటన్

విదురుని బంపఁగా, ద్రుపదు వీటికిఁ బోయి యతండు గొంతిద్రో
వదులను వెంటఁబెట్టుకొని వచ్చెను బాండవపంచకంబుతో॥ ౧౨౩

మ॥ సగపాల్ రాజ్యము పంచి భీష్ముఁడొసఁగన్, సర్వప్రజల్ సౌఖ్యమొం
దఁగఁ బాలించెను ధర్మరాజు దనకింద్రప్రస్థముల్ రాజధా
నిగఁ గైకొంచు, సహోదరుల్ నలువురున్ నిండారుభక్తిన్ భజిం
పఁగఁ, గృష్ణప్రముఖాప్తబంధుజనులాత్మన్ మోదముం బొందఁగన్॥

తే॥ గీ॥ కృష్ణునకుఁ గూరిమి సహోదరీమణి యగు
రమ్యగుణసముద్రను సుభద్రను వివాహ
మయ్యె నర్జునుం: డయ్యుభయానకుఁ బ్రభ
వించె నభిమన్యుఁ, డంబుజవిభునిభుండు॥ ౧౨౪

ఉ॥ ఖాండవమన్వనంబునను గల్గిన మూలికలెల్ల నగ్నిదే
వుండు విదాహఘోరరుజ వోవుటకై దహియింపఁ గోర, నా
ఖండలుఁడడ్డకుండఁగను గాపయి నిల్చిరి కేశవార్జునుల్:
మండెను ఖాండవంబు తరుమండలగుల్మలతాయుతంబుగన్॥ ౧౨౫

మధ్యాక్కర॥ గాండీవమను విల్లు, నక్షయశరముల్ గలుగు తూణములు
రెండును, గంధర్వహయసహితమై చరించు రథంబుఁ,
బాండవమధ్యమునకును జక్రంబు, బలుగదన్, హరికి
భండనాదిని యొసఁగించె వరుణుచేఁ బావకుండడిగి॥

తే॥ గీ॥ ఖాండవమహాగ్నిఁ బడకుండఁ గాచె నరుఁడు
మయుని: దానవవిశ్వకర్మ యగు నతఁడ
నల్పశిల్పనైపుణి మెఱయఁగ నొక సభ
కల్పితము చేసి పాండవాగ్రజునికొసఁగె॥ ౧౨౬

తే॥ గీ॥ గుండెలదర వైరులఁ గలగుండు పఱుచు
పెనుగదాదండమొక్కటి భీమునకును,
దేవదత్తనామకమైన దివ్యశంఖ
మర్జునునకుఁ, గానుకలు పెట్టె నమ్మయుండు॥ ౧౨౭

స్రగ్ధర॥

సాంద్రానందంబుతో నిర్జరులు గొలువఁగా స్వర్గలోకంబునన్ దే
వేంద్రుండొడ్డోలగంబై యెటు వెలయునో యట్లే యనేకుల్ మహీభృ
చ్చంద్రుల్ తన్గొల్వ, ధర్మాత్మజుఁడుమయసభాస్థానమందొక్కనాఁడ
య్యింద్రప్రస్థంబునన్ భ్రాతృవరులును దిశాధీశులట్లుండ నుండన్॥

చ॥ కొలువయి యుండు వేళ నటకుం గలహాశనమౌని వచ్చి, పూ
జలు గొని, "రాజసూయమును సల్పుము: మీకును మీదు తండ్రికిం
గలుగును స్వర్గ," మంచుఁ బలుకన్ విని, ధర్మజుఁడట్టి యజ్ఞమున్
సలుపఁగ నెంచి, యోచనకు సత్వరమే పిలిపించెఁ గృష్ణునిన్॥

క॥ యోచన కేమున్నది? ధా
త్రీచక్రములోని దుష్టనృపవర్గము నె
ట్లో చంపించుటకై కా
దే చక్రి మనుష్యుఁడగుచు నిల జనియించెన్?॥ ౧౩౨

ఉ॥ బంధుఁడు, మేనమామ, యని భావమునం గరుణింపకుండ గ
ర్వాంధుని కంసుఁ దానె తెగటార్చెను; వానికి మామయౌ జరా
సంధుని భీముఁడొక్కరుఁడె చంపఁ గలం: డతఁడట్లు చచ్చినన్,
సింధుపరీతభూస్థలి నశేషనృపుల్ వశులౌదురే కదా? ౧౩౩

మ॥ శిశుపాలాఖ్యుఁడు, మేనయత్త కొడు, కాచేదిక్షమాభర్త, క
ర్కశుఁడౌచున్ మెలఁగున్; హిరణ్యకశిపుక్రవ్యాదుఁడై యాపయిన్
దశవక్త్రుండయి నాఁడు వాఁడె: క్రతువంతంబౌటకున్ మున్ను వా
ని శిరంబుం దెగఁగొట్టుటొప్పు నెటులేనిరి దానె చక్రంబునన్॥

ఉ॥ రాజులు కర్ణుచేతను బరాజితులై తనుఁ గొల్చుచుండ, రా
రాజను పేరుదాల్చి ధృతరాష్ట్రుని యగ్రతనూజుఁడుద్ధతుం
డై జగజెట్టియై తనరె; యజ్ఞము చూడఁగ వాఁడు వచ్చు; నే
వ్యాజముచే నణంగుదురొ వాఁడును, దుష్టులు వాని తమ్ములున్?॥

మత్తకోకిల॥ రాజసూయము ధర్మసూనుఁడు ప్రాభవంబున సల్ప, రా
రాజసూయను బాండవేయుల రాజ్యభాగము నెల్ల నే
యోజనో హరియించు; దానను యుద్ధమాటయుఁ దప్పఁ ద
య్యాజిఁ జత్తురు కౌరవుల్ విజయాన్వితుండగు భీముచే॥

తే॥ గీ॥ రాజసూయంబొనర్ప నారదుఁడు పంచు
టిట్టులూహించియె యటంచుఁ గృష్ణుఁడెంచి,
భీముచే జరాసంధుఁ జంపించి, ధర్మ
సుతునిచేతఁ జేయించెను గ్రతువు నపుడు॥ ౧౩౭

ఉ॥ ఆజ్ఞను సోదరుల్ నలువురాదలలన్ ధరియించి సల్ప, స
ర్వజ్ఞుఁడు కృష్ణుఁడెప్పుడును బ్రాపయి నిల్వఁగ, ద్రౌపదీమహా
రాజ్ఞిని సోమిదమ్మగను బ్రక్కను జేరుచుకొంచు నమ్మహా
యజ్ఞము చేసె ధర్మజుఁడు, వ్యాసముఖుల్ నడిపించినట్లుగన్॥

చ॥ ఎవరికి నర్ఘ్యమయ్యెడల నిచ్చుటొ యంచును బ్రశ్న పుట్ట, య
జ్ఞవిభుఁడు, యజ్ఞభోక్తయును, సర్వము దానయి యున్న యాదివి
ష్ణువయిన యట్టి కృష్ణు డెసఁ జూపిన భీష్ముని ధిఃకరించి, కో
పవివశచిత్తుఁడైన శిశుపాలుఁడు ప్రేలుడు మానకుండుటన్॥ ౧౩౯

ఉ॥ చక్రము కృష్ణుఁడేయ, నది సజ్జుమనం జని వాని యజ్జుద
గ్రక్రకచంబు భంగిని దెగంగను జీల్చెఁ: దదీయవిక్రమ
ప్రక్రియ రాజచక్రమును భ్రాంతిని మున్గఁగఁ జేసె; రాజసూ
యక్రతువాపయిన్ జరిగె నడ్డొక యింతయు లేని యట్టిదై॥ ౧౪౦

మ॥ ద్విజులెల్లన్ బహుభూరిదక్షిణలఁ దృప్తిం బొందఁగా, సర్వబం
ధుజనంబుల్ పరమాదరంబునకు సంతోషింపఁగా, యాచక
ప్రజలెల్లన్ నిరతాన్నదానముకు నాప్యాయంబు గాంచంగ, ధ
ర్మజుఁడయ్యజ్ఞమువల్లఁ గీర్తి గనియెన్ రాజాగ్రగణ్యుండనన్॥

మ॥ మయదత్తంబయినట్టి యద్భుతసభన్ ధర్మపాలురీక్షించి, వి
స్మయముం గాంచిరి; దాని సొంపు పరికింపం గోరి యాగాంతమం

దు యథేచ్ఛంబుగ నొక్కరుండె ఖలుఁడౌ దుర్యోధనుండా సభా
లయమందున్ విహరింప సాగెను మహోల్లాసరంబుతో, నీసుతో॥

సీ॥ గోడను నొసట డీకొట్టె నొక్కెడ, నటఁ
గుడ్యమున్నదని కన్గొనఁగ లేక ;
కంబంబు నొక మూలఁ గౌఁగిలించుకొనియె,
నచట నయ్యది యుంట యరయ లేక ;
దిగె దొర్లుపుచ్ఛకాయగ నొక ప్రక్క, న
చ్చోట మెట్లులుండుట చూడ లేక ;
బుడుక వేసెను నీటఁ బడి యొక్కచో, నందుఁ
గృతకసరస్సుంట యెఱుఁగ లేక :
మాయలం బొల్చు నాసభామందిరంబు
నందిటు పరాభవములొంది, డెందమందు
నుడుకుకొని, మానధనుఁడు సుయోధనుండు
మరలి, తన వారితో హస్తిపురము చేరి॥ ౧౪౩

శా॥ "మామా! యెవ్వరితోడఁ జెప్పుదును విన్మా, నాదుదుఃఖంబు: నే
నామాయాసభలోన భంగముల పాలై కుందుచుండంగ, నె
త్తౌ మేడన్ నిలుచుండి, యైదుగురికిల్లాలైన యత్తొత్తు నా
బాముల్ గాంచి పదాఱు పండ్లుఁ గనిపింపన్ నవ్వెఁ దాఁ గెవ్వునన్॥

సుగంధి॥ గొప్పదాన నేనటంచుఁ గుల్కుచున్న ద్రౌపదిం
గొప్పు పట్టి యీడిపించి, కోకలూడిపించి, నే
నప్పుడంతి నేడిపించు నట్టి చొప్పు నాకిఁకం
జెప్పుమయ్య! నిన్ను మించు చేయి లేదు మాయలో"॥ ౧౪౪

చ॥ అనుచు వచించినన్ శకుని యల్లుని మెల్లన నూరడించి, "నా
యన, యిది యేమి దొడ్డపని యంచుఁ దలంకెదు? దీనికొక్క యో
చన గల," దంచుఁ దా గుసగుసల్ చెవిలోపల నొక్కకొన్ని యా
డిన వినుచున్ సుయోధనుఁడు డెందమునం బరితృప్తి నొందుచున్॥

మ॥ మణిసౌధమ్మొకదాని నూత్నముగ నిర్మాణమ్ము చేయించి, "తత్
క్షణమే రండు : గృహప్రవేశ," మని లేఖఁ వ్రాసి యద్దాని బ్రా
హ్మణుచేఁ బంపిన, భ్రాతృమాతృసుతభార్యాయుక్తుఁడై పాండవా
గ్రణి యేతెంచెను హస్తినాపురికి శీఘ్రంబౌ ప్రయాణంబులన్॥

మ॥ గృహసౌభాగ్యము నెల్ల ధర్మతనయుండీక్షించి యందొక్కచో,
"బహురమ్యంబుగ నున్నదియ్య," దని సంభావింప, దుర్యోధనుం
డు హసద్వక్త్రముతోడఁ; "బాచికలనిందుఁ మామయుఁ నేనుఁ బ్ర
త్యహమాడంగఁదలంతు," నాఁ, శకునియుఁ హాసంబుగావించుచున్॥

ఉ॥ "తోఁచక యీసుయోధనునితో నెదో యాడుటె కాని తిన్నగాఁ
బాచికలేని బట్టుకొను పద్ధతి యీతఁడెఱుంగఁ; డిక్కశఁ
నీ చతురత్వమెక్కుడని నే వినుచుందును; నన్ను గెల్వుమా
చూచెద నీదు నే!" ర్పనుచు జూదము నాడఁగఁ బిల్చె ధర్మజున్॥

ఉ॥ "పందెము మామ యోడఁ, దన పక్షమునం బణమిత్తు నే," నటం
చుం దెలిపెఁ సుయోధనుఁడు; "జూదమునఁ శకునిఁ జయించు వా
డెందును లేఁ," డటంచు హసియించెను గర్ణుఁడు; దుస్ససేనుఁడ
న్నం దిలకించి, యంత యమనందను చేతికొసంగెఁ బాచికల్॥

తే॥ గీ॥ మాయపాచికలవి యన్న మాట యెఱుఁగ,
కకట! మాయకాఁడైనట్టి శకునితోడ
మాయమర్మముల్ లేని ధర్మజుఁడు కర్మ
మట్లు తన్నీడువఁగ, జూదమాడఁ దొడఁగి॥ ౧౫౧

ఉ॥ ఓడె ధనంబు; నోడె నగ; లోడె రథాశ్వగజాళి; మేడలఁ
వాడల నోడె; నూళ్లుఁ, బురవారము, దేశము, రాజ్యమెల్లఁ, దా
నోడెను; భీముఁడాదిగసహోదరవర్గము నోడెఁ; దన్నుఁ దా
నోడెను; ద్రౌపదీరమణి నోడెను జూదపుఁ దీవరంబునన్॥ ౧౫౨

శా॥ "అన్యాయంబిది : బంధురీతి నొక యాహ్వానంబు పంపించి, దా
ర్జన్యంబిట్లొనరింతురే?" యనుచు రోషంబార భీష్ముండు, లే

వ, "న్యాక్తంబునయుక్తముం దెలుప నీ కివాంఛింపలే," దంచు నెం
తో న్యక్కార మొనర్చె దుష్టమతియౌ దుర్యోధనుండాతనిన్॥

తే॥ గీ॥ పుణ్యపాపంబులని తలపోయక, ధృత
రాష్ట్రనృపతియు నతని పుత్రకులు చెప్పు
పనులు చేయంగ మున్నొప్పుకొనియెం గాన,
మారు మాట చెప్పక భీష్ముఁడూరకుండె॥ ౧౫౪

తే॥ గీ॥ అంత వాఁడగు భీష్మునికైన యా ప
రాభవము గాంచి, తమదు గౌరవము వీఁడు
దక్క నిచ్చునా యంచును గ్రుక్కుమిక్కు
మనక తల వంచుకొనిరి ద్రోణాదులపుడు॥ ౧౫౫

ఉ॥ "దాసిని ద్రౌపదిన్ వడిగఁ దమ్ముఁడ, నాకు సురంటి వీవఁగా
నీ సభలోనికిం బిలువు; మిష్టముతోడను రాక యున్న, నీ
వే సిగఁ బట్టి యీడుచుచు నెట్లయినం గొని తె," మ్మటంచు దు
శ్శాసనుతో సుయోధనుఁడు జంకును గొంకును లేక పల్కెనన్॥

క॥ "పాపము పండుచు నున్నది!
చూపులతో నీకు మతియు శ్రుతియుఁ జెడెనె? య
న్నా, పాండునృపాగ్రజ," యని
కోపముతో విదురుఁడపుడు కురుపతి ననియెన్॥ ౧౫౭

ఉ॥ "పండె, నిజంబె, పాండవుల పాపము: చిన్నతనంబునుండి భీ
ముండు మహామదమ్మున మమున్ మును పెట్టిన బాధలెల్ల మా
గుండెల నాటియున్న యవి; క్రోధము తీఱుచుకొంట మాని మే
ముండఁగ నేర్తుమే?" యని సుయోధనుఁడా సభ పల్కె నీసునన్॥

శా॥ "ఆహా! ఘోరము! ఘోర! మెవ్వరును లేరా తీర్చువారీమహా
ద్రోహం?" బంచును ద్రౌపదీరమణి యాక్రోశింపఁ, దద్కేశసం
దోహంబుం దన చేతఁ బట్టి ఖలుఁడౌ దుశ్శాసనుండష్ట సం
దేహంబొందక యామె నీడ్చుచు వడిం దెచ్చెన్ సభాసీమకున్॥

ఉ॥ "పట్టు దుకూలమేమిటికి బానిసతొత్తున? కిద్ది కట్టుకొ
న్నట్టి పటంబు విప్పుమనుజా," యని యన్న వచింప, నామె మై
పుట్టము పట్టి విప్పటకుఁ బూనె దురాత్ముఁడు దుస్ససేనుఁ, డి
ట్టట్టును బాఱుచున్న కుసుమాంగిని వీడక వెంటఁ బెట్టుచున్॥

ఉ॥ కన్నులఁ జూడఁగా వలయుఁ గాని, వచింపఁగ రాదు భీమున
ల్కన్నయనంబులా? కొలుములా? ముఖమా, ప్రళయార్కబింబమా?
యున్నటులుండి యా పొడవు, నున్నతి, యాతని మేని కెట్టులు
త్పన్నములయ్యెనో? యతఁడు పావనియా, లయకాలరుద్రుఁడా?॥

సుగంధి॥ బుస్సుమంచుఁ ద్రాఁచుపాము పొల్కి లేచి, యాత్మవ
క్షుస్సు భస్త్రి భంగిఁ బొంగు గాంచ భీమసేనుఁడా
దుస్ససేను వంకఁ గిన్కతోడఁ జూడ, వానికా
యుస్సుమూడె నంచు నెంచిరుల్లమందు నెల్లరున్॥ ౧౬౨

మ॥ "ఎచటన్ నీవిపుడున్నవాఁడవు? హరీ! కృష్ణా! యుపేక్షింప నీ
కుచితంబే యిటు మానభంగమును నేనొందంగ?" నంచార్తి నే
డుచు పాంచాలికి నక్షయంబయినయట్టుల్ పుట్టముల్ మేనఁ బు
ట్టుచు వచ్చెన్, ఖలదుస్ససేనుఁడవి విఘ్నూరంబునన్ విప్పఁగన్॥

చ॥ "కడుసుఁదనంబుగా నొడల గంపెఁడు చీరలఁ గట్టుకొంటివే?
బడలిక గల్గెనేమొ పెనుభారము నిట్టులు మోయుచుంట? నా
తొడల వసింప ర," మ్మనుచు ద్రోవదితోడ సుయోధనుండు కే
రడముల నాడె, మేలనుచుఁ బ్రక్కను గర్ణుఁడు పక్కునన్ నగన్॥

శా॥ "పాండుక్ష్మాధవు కోడలిన్, ద్రుపదభూపాలాత్మజన్, దుష్టచి
త్తుండై కొప్పునఁ బట్టి కోకలొలిచెన్ దుశ్శాసనుం: డాఖలున్
గుండెం జీలిచి, గబ్బిబెబ్బులి బలెం గ్రొన్నెత్తురున్ దోసిళుల్
నిండం బట్టుచుఁ గ్రోలకున్న యెడలన్ నే భీమసేనుండనే?॥ ౧౬౫

శా॥ ఉండన్ రమ్మని ద్రౌపదీసతికి నాత్మోరుద్వయిన్ రాజ్యమ
త్తుండై చూపినయట్టి నీతిరహితున్ దుర్యోధనున్ మద్గదా.

దండాగ్రంబున నూరువుల్ విఱుగఁ గ్రిందం గూల్చి, తన్మస్తముం
జెండుం బోలెను దన్నకున్నయెడ నిస్సీ! భీమసేనుండనే?॥ ౧౬౬

ఉ॥ మెండు బలంగముం గలుగు మేటిని దానసుచున్ సుయోధనుం
డుండుట పుట్టకొక్కులటు సోదరులుండుటచేతఁ గావునన్,
దుండగులైన కౌరవుల నూర్వుర భండనమందు మద్గదం
బిండి యొనర్పకున్నయెడ భీముఁడనే? గద యేల కాల్పనే?"॥

వ॥ అని యివ్విధంబున నుద్దండగదాదండమండితదోర్దండద్వయి యా భీముం
డగు భీముండు ప్రచండంబులయిన ప్రతిజ్ఞలు సలిపినం, బాండవ
మధ్యముండు కర్ణుని దుర్ణయంబుఁ దలంచి కోపఘూర్ణితమన
స్కుండై యిట్లనియె॥ ౧౬౭

శా॥ "రామారత్నము, ద్రౌపదిం, దొడలఁ జేరం బిల్చు దుర్యోధనుం
దా మేలంచును మెచ్చుకొన్న ఖలు, సూతప్రోద్భవుం, గర్ణు, సం
గ్రామంబందు సుయోధనాదులు గనంగాఁ ద్రుంప లేకున్న, మ
న్నామం బర్జునుఁడే? మదీయకరకోదండంబు గాండీవమే?"॥

క॥ ఈపగిదిని దన భర్తల
కోపము హృదయముల రవులుకొనుచుఁ బ్రతిజ్ఞా
రూపమ్ముగఁ బ్రజ్వలింపఁగ,
ద్రౌపదియును మదిని గోపతాపములడరన్॥ ౧౭౦

ఉ॥ "నే ధవులందు భక్తి రవణిల్లు పతివ్రత నేని, నన్నిటుల్
బాధలఁ బెట్టి, మానమును భంగము పెట్టఁ దలంచినట్టి దు
ర్యోధనదుస్ససేనులు సహోదరవర్గముతోడఁ జావఁగా,
నీ ధృతరాష్ట్రభూపు స్నుషలేడ్తురు గావుత గోలు గోలునన్!"॥

వ॥ అని శపియించినన్ ధృతరాష్ట్రుండదరిపడి॥ ౧౭౧

ఉ॥ "హా! శకునీ, గృహంబునను శ్యాలకుఁ జేరుచుకొంట యింటికిన్
నాశనమంట నిశ్చయమె! నా మతి మాలిన పట్టికీవు రా

జ్యాశను గొల్చి, మాయ గల యక్షములం గొని జూదమాడుటన్,
నా శతసంఖ్యపుత్రకుల నాశము నిశ్చయమయ్యె భీముచే॥ ౧౭౩

క॥ నా మదిలో భీముని దో
స్సామర్థ్యము దలఁచి సాధ్వసంపడుదును ; సా
ధ్వీమణి శాపము గలియుట
చే మామకసుతుల చావు సిద్ధంబె యిఁకన్" ॥ ౧౭౪

వ॥ అని సిష్ఠురంబులాడఁ జొచ్చిన ధృతరాష్ట్రుని దదీయజ్యేష్ఠసుతుం
డగు దుర్యోధనుండు సమీపించి॥ ౧౭౫

క॥ "అయ్యో! యిది యేమి, మా మా
మయ్యను దిట్టెదరు ? మాయ యక్షంబులతో
నియ్యెడల గెలిచినారమఁ
టయ్యా ? తెప్పింపుఁడెట్టి యక్షములైనన్॥ ౧౭౬

తే॥ గీ॥ మామ గెలిచినవెల్లఁ గ్రమ్మఱగ నిత్తు
ధర్మజుఁడు గెల్చునెడల ; నాతండె యోడ,
భార్యతోడఁ బండ్రెండేండ్లు పాండవేయు
లొంకు పలుకక యడవులందుండ వలయు॥ ౧౭౭

తే॥ గీ॥ అటు పిదపఁ బదుమూడవ యబ్దమందు
నొరులు తమ్మించుకయుఁ బోల్చకుండునట్టి
సరణి గూఢంబులైన వేషములు దాల్చి
సలుప వలయు నజ్ఞాతవాసంబు వారు॥ ౧౭౮

తే॥ గీ॥ అట్టి యజ్ఞాతవాసంబునందు వార
లున్న తావేము పోలుచుకొన్న యెడల,
మరల వారు పండ్రెండు వత్సరములడవు
లందు వసియింప వలయు," నటంచుఁ బలుక॥ ౧౭౯

ఆ॥ వె॥ సమ్మతించి తాను గ్రమ్మఱ జూదంబు
నాడి యోడెఁ బాండవాగ్రజుండు;
భార్యతోడఁ గూడి పాండునందనులు పం
డ్రెండు వత్సరంబులుండిరి వని॥ ౧౮౦

సీ॥ విదురుండు ప్రార్థించి వదినె గారైన కుం
తిని దన గృహమునన్ నిలుపుకొనియె;
నభిమానమున సుభద్రాభిమన్యుల ద్వార
వతికిఁ గొంపోయెను వాసుదేవుఁ;
డేగిరి తల్లి పుట్టింటికి ద్రుపదకు
మారీసుతులు మేనమామ వెంటఁ;
బ్రజలతోడ సమస్తరాజ్యంబు ధర్మపు
త్రుండప్పగించె దుర్యోధనునకు;
ధర్మమొకటియె తమ వెంటఁ దరలి రాఁగ,
ధర్మజాదులౌ పాండవుల్ ద్రౌపదియును
ధర్మబద్ధులై యడవుల దారిఁ జనిరి:
కర్మమెవ్వరికైన శక్యమె తరింప?॥ ౧౮౧

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబువా:
రనఘులు వారి పాదముల నౌదలఁ దాలిచి, దానిలోని భీ
ష్ముని చరితంబు గ్రొత్తఁదనముం గన వ్రాసినవాఁడ నేను నే
ర్చిన గతి సెట్టిలక్ష్మినరసింహసమాఖ్యుఁడ, ధీరసఖ్యుఁడన్॥
సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, సదంతరంగ
కార్యదర్శిని, దన్మహౌదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలక్షణుండ॥

శ్రీ

# ప్ర భా స శా ప వి మో చ న ము.

ష్ణకరుండుఁ బోలె వెలుఁగొందెడి తేజము వాఁడు, శ్రీమహా
విష్ణుని యంశమూని ప్రభవించిన వాఁడు, మహేశ్వరాత్మభూ
జిష్ణుముఖామరాధిపులచే నుతి గాంచెడి వాఁడు, నైన శ్రీ
కృష్ణునిపై సభాసదుల దృష్టులు నిల్చెను నిశ్చలంబులై॥

సీ॥ సజలమేఘంబుపై సంధ్యాతపంబు కై
వడి మేనఁ బసిఁడి దువ్వలువ వెలయఁ,
దోరణాలంకృతచారుకవాటంబు
గతి హారములను వక్షుస్సు మెఱయ,
నురువజ్రమణికాంతి కురువిందమునఁ బర్వు
పగిది వాతెఱను లేనగవు ప్రాఁక,
సితకుశేశయవినిర్గతభృంగముల భంగిఁ
గన్నుంగవను జూడ్కిగములు వెడలఁ,
కేకిపింఛంబు తోడి టోపీ కళకళ
లాడు నెమ్మోమునకుఁ గ్రొత్త యందమొసఁగ,
నంగసంగతానంగుఁడనంగఁ దనరు
చున్న కృష్ణుండు దర్శనీయుండు గాఁడె?॥ ౨

క॥ మంజులతరమ్ములు, సభా
రంజకములు, సముచితములు, రసవంతములౌ
చుం జెవికింపగు నుడువులు
కంజదళాక్షుండిటు పలుకంగఁ దొడంగెన్॥ 3

శా॥ "మామా, యోధృతరాష్ట్రభూరమణ, భీష్మద్రోణముఖ్యుల్ వినం
గా మాటల్ వచియింతుఁ గొన్ని వినుమా: కష్టంబులన్ దాఁటి, యీ

త్వన్మ మీఁదన్ మని యున్న పాండవులు నీ కాళ్లం దలల్ మోపి, నీ
క్షేమంబుం గనుఁగొంటకంపిరి నన్నున్; శ్రీతో సుఖంబుంటివే?॥ ౪

శా॥ పంద్రెండేండ్లు వనంబులం దిరిగి, యాపై నొక్కయేఁడన్యులె
వ్వాంద్రుం బోల్చుకొనంగ నేరని యెడన్ వాసంబు గావించి, పె
త్తండ్రిన్ నిన్ను, భవత్తనూజులను, దాతం, బెద్దలం, జూడఁగాఁ
దీండ్రం బొందుచునున్నవారు, భవదాదేశంబునే కోరుచున్॥ ౫

కం॥ ఈ పదుమూడేండ్లను వా
రేపగిదిని గడిపినారొ యీవు వినఁగ సం
క్షేపించి చెప్పెదను విను
మా, పాండవులనిన నీకు నాదరమ కదా?॥ ౬

కం॥ కామ్యకమను పేరు గల య
గమ్యవనంబొకటి ముందుగాఁ బాండుసుతుల్
ధౌమ్యసహితముగఁ జొచ్చిరి;
భూమ్యాకాశములఁ బోలు భూతమొ యనఁగన్॥ ౭

శా॥ కిమ్మీరుండు, బకానుజుం, డసుర, పైకిన్ గ్రమ్మింగ రాఁగా, మహీ
ధ్రమ్మ్ముం గూల్చెడి వజ్రమట్టులుగ నాదైత్యాధమున్ భీముఁడు
గ్రమ్మా భంగిని గూలిచెన్ : నొసటిపైఁ గన్నున్న యా భీముఁడే
సుమ్మా భీముఁడు, కోపఘూర్ణితమనస్కుండై విజృంభించినన్॥ ౮

చ॥ అతని సహోదరుండయిన యర్జునుఁడాపయి నింద్రకీలప
ర్వతమున కేగి, వైరినికరంబును గెల్వఁగఁ గోరి పార్వతీ
పతిని గుఱించి నిష్ఠను దపంబొనరించెను ; ఘోణివెంబడిం
గృతకకిరాతరూపమునఁ గేర్చుచుఁ, గెవ్వుమటంచు నార్చుచున్॥ ౯

ఉ॥ ఈశుఁడు పార్థుధైర్యముఁ బరీక్ష యొనర్పఁగ వచ్చి, యుద్ధతుం
డై శరయుద్ధమున్ సలిపి, యంతతనిన్ జితుఁ జేయ లేక, త
త్కౌశలమాత్మకింపగుడు గాండివికిచ్చె ననన్యసాధ్యమా
పాశుపతాస్త్ర : మూర్విఁ గల బల్లిదులర్జును నోర్వ నేర్తురే॥ ౧౦

శ్రీ

# ప్రభాసశాపవిమోచనము.

ఉష్ణకరుండుఁ బోలె వెలుఁగొందెడి తేజము వాఁడు, శ్రీమహా
విష్ణుని యంశమూని ప్రభవించిన వాఁడు, మహేశ్వరాత్మభూ
జిష్ణుముఖామరాధిపులచే నుతి గాంచెడి వాఁడు, నైన
కృష్ణునిపై సభాసదుల దృష్టులు నిల్చెను నిశ్చలంబులై॥

సీ॥ సజలమేఘంబుపై సంధ్యాతపంబు కై
వడి మేనఁ బసిఁడి దువ్వలువ వెలయఁ,
దోరణాలంకృతచారుకవాటంబు
గతి హారములను వక్షస్సు మెఱయ,
నురువజ్రమణికాంతి కురువిందమునఁ బర్వు
పగిది వాతెఱను లేనగవు ప్రాఁక,
సితకుశేశయవినిర్గతభృంగముల భంగిఁ
గన్నుంగవను జూడ్కిగములు వెడలఁ,
గేకిపింఛంబు తోడి టోపీ కళకళ
లాడు నెమ్మోమునకుఁ గ్రొత్త యందమొసఁగ,
నంగసంగతానంగుఁడనంగఁ దనరు
చున్న కృష్ణుండు దర్శనీయుండు గాఁడె?॥ ౨

క॥ మంజులతరమ్ములు, సభా
రంజకములు, సముచితములు, రసవంతములౌ
చుం జెవికింపగు నుడువులు
కంజదళాక్షుండిటు పలుకంగఁ దొడంగెన్॥ 3

శా॥ "మామా, యోధృతరాష్ట్రభూరమణ, భీష్మద్రోణముఖ్యుల్ వినం
గా మాటల్ వచియింతుఁ గొన్ని వినుమా: కష్టంబులన్ దాఁటి, యూ

తన్మే మీఁదఁ గమని యున్న పాండవులు నీ కాళ్లం దలల్ మోపి, నీ
క్షేమంబుం గనుఁగొంటకంపిరి నన్నుఁ; శ్రీతో సుఖంబుంటివే!॥ ౪

శా॥ పండ్రెండేండ్లు వనంబులం దిరిగి, యాపై నొక్కయేఁడన్యులె
వ్వాండ్రుం బోల్పుకొనంగ నేరని యెడన్ వాసంబు గావించి, పై
త్రిండ్రిన్ నిన్ను, భవత్తనూజులను, దాతం, బెద్దలం, జూడఁగాఁ
దీండ్రం బొందుచునున్నవారు, భవదాదేశంబునే కోరుచున్॥ ౫

క॥ ఈ పదుమూడేండ్లును వా
రేపగిదిని గడిపినారొ యీవు వినఁగ సం
క్షేపించి చెప్పెదను విను
మా, పాండవులనిన నీకు నాదరమ కదా ?॥ ౬

క॥ కామ్యకమను పేరు గల య
గమ్యవనంబొకటి ముందుగాఁ బాండుసుతుల్
ధౌమ్యసహితముగఁ జొచ్చిరి;
భూమ్యాకాశములఁ బోలు భూతమొ యనఁగన్॥ ౭

శా॥ కిమ్మీరుండు, బకానుజుం,' డసుర, పైకిన్ క్రమ్మంగ రాఁగా, మహో
గ్రమ్మం గూల్చెడి వజ్రముష్టులుగ నాదైత్యాధమున్ భీముఁడు
గ్రమ్మ భంగిని గూలిచెన్ : నొకటిపైఁ గన్నున్న యా భీముఁడే
సుమ్మా భీముఁడు, కోపఘూర్ణితమనస్కుండై విజృంభించినన్॥ ౮

చ॥ అతని సహోదరుండయిన యర్జునుఁడాపయి నింద్రకీలప
ర్వతమునకేగి, వైరినికరంబును గెల్వఁగఁ గోరి పార్వతీ
పతిని గుఱించి నిష్ఠను దపంబొనరించెను ; ఘోణివెంబడిం
గృతకకిరాతరూపమునఁ గేర్చుచుఁ, గెవ్వమటంచు నార్చుచున్॥ ౯

ఉ॥ ఈశుఁడు పార్థుధైర్యముఁ బరీక్ష యొనర్పఁగ వచ్చి, యుద్ధతుం
డై శరయుద్ధమున్ సలిపి, యందతనిన్ జితుఁ జేయ లేక, త
త్కౌశలమాత్మకింపగుడు గాండివికిచ్చె ననన్యసాధ్యమౌ
పాశుపతాస్త్ర : మున్విఁ గల బల్లిదులర్జును నోర్వ నేర్తురే!॥ ౧౦

ఉ॥ దేవవిభుండు మున్నయిన దేవతలంతట నేగుదెంచి, గాం
డీవికొసంగిరన్యులు గడింపని, దివ్యములౌ నిజాస్త్రముల్ ;
కేవలవత్సలత్వమున ఖేచరనాయకుఁడాత్మనందనుం
డౌ విజయున్ దివంబునకు నా పిదపం గొనిపోయె విందుగన్॥ ౧౧

ఉ॥ విందుగ వచ్చినట్టి యల వీరుని యందము చందమెల్లఁ గ
న్విందుగఁ జూచి, దేవవిభు వేశ్యగఁ బేర్వడినట్టి యూర్వశీ
సుందరి కోరి వచ్చి, మనసుం గరఁగింపఁగ లేక ఖిన్నతం
బొంది, శపించె నప్పురుషపుంగవుఁ బుంస్త్వము పోవునట్లుగన్॥ ౧౨

ఆ॥ వె॥ ఆ నపుంసకత్వమజ్ఞాతవాసంబు
నందుఁ బనికి వచ్చె నర్జునునకు;
శాపఫలితమొక్క సంవత్సరమె యుండు
నటులనుగ్రహించె నమరవరుఁడు॥ ౧౩

తే॥ గీ॥ కొంత కాలమేని నపుంసకుండయిన పృ
థాతనూజుని మోమును దాతగారు
చూడరేమొ ? యట్లయిన, నర్జునునకు నని
నడ్డు లే,''దన్న భీష్ముండు హరిని గాంచి॥ ౧౪

క॥ ''ఆ పార్థు మోమె కాదు క
దా, పాండవులందు నొకని యాస్యమయిన నే
నేపగిదిఁ జూతు, ద్రౌపది
యాపదలం బాప లేని వ్యర్థుఁడ నగుచున్?॥ ౧౫

చ॥ అనిరొ నిజంబుగా జరిగి, యందుఁ ద్రినేత్రసమానుఁడైన య
ర్జునునకు నీవు తోడుపడుచున్ రణకార్యము నిర్వహింపఁ, ద
ద్ఘనతరగాండివప్రభవకాండములన్ నిహతుండ నౌట త
ప్పని సరి కృష్ణ! నేనతని యాస్యముఁ జూచినఁ, జూడకుండినన్''॥

తే॥ గీ॥ అనినఁ గర్ణుండు నవ్వి, ''వృద్ధయ్యోఁ గాక !
పరశురామశిష్యుఁడు నోటఁ బలుకఁ దగిన

నుడువులా యివి ? నాకు నీతఁడు సతీర్థ్యుఁ
డనుటె సి !'' గ్గని పలుక ద్రోణాత్మజుండు॥ ౧౭

ఉ॥ "సూతకులంబువాఁడ వని సూనృతమాడక, క్షత్రవంశసం
జాతుఁడ నంచు విద్యఁ గొని, శాపము గంటివి జామదగ్నిచేఁ;
దాతను నీ సతీర్థ్యుఁడనఁ, దప్పక సిగ్గులచేటు; యంగభూ
పా ! తన చేతి క్రింద నొక బంటుగ నుంటయు నీకు ఖ్యాతియే"॥ ౧౮

వ॥ అని యిట్లు॥ ౧౯

ఉ॥ కర్ణములందు శూలములు గాఁడఁగ నాడిన ద్రౌణివాక్యముల్
కర్ణుఁడు విన్నయంతనె మొగంబునఁ గావి జనింప, నేండ్లచే
జీర్ణతఁ గన్న భీష్ముఁడని చేసినఁ దానని చేయ కుండుటే
నిర్ణయమంచు నా సభను నిల్చి ప్రతిజ్ఞ యొనర్చె గట్టిగన్॥ ౨౦

తే॥ గీ॥ "అక్కటకట ! యంతఃకలహములు గలుగు
చున్న," వని ధృతరాష్ట్రుండు ఖిన్నుఁడగుచుఁ,
"కృష్ణ ! యర్జునుండటుమీఁద నేమొనర్చె ?"
ననుచుఁ బ్రశ్నింపఁ, గ్రమ్మఱ యదువిభుండు॥ ౨౧

తరువోజ॥ "అవనీశ, వినవయ్య యబ్ధిగర్భమున
నమరులకు నజేయులవుచు నివాత
కవచులన్నట్టి రక్కసులు ముక్కోట్లు
గల ; రింకఁ బౌలోమకాలకేయులన
నవసథంబుగ హిరణ్యపురంబు గల్గి
యఱువదివేలైన యసురులుం గలరు
బవరంబుఁ గావించి, వారిని వీరిఁ
బరిమార్చె దేవేంద్రు పన్పున నరుఁడు॥ ౨౨

క॥ వడి కేలుగవను గల క
వ్వడి కవ్వడువున నొనర్ప వశమయ్యెను; లె

క్కడ రాని రక్కసుల నొ
క్కఁడె కూల్పఁ గలండె యొండొకండు జగములన్ ‖ ౨౩

క‖ హెచ్చుగ బీభత్సరసం
బచ్చుపడఁగ రణమొనర్చినట్టి విజయునిన్
మెచ్చుచు బీభత్సుఁడు, వి
వ్వచ్చుఁడు, నని పేర్కొనిరి దివంబున విబుధుల్ ‖ ౨౪

తే‖ గీ‖ అమరపతి యిచ్చిన కిరీటమర్జునుఁడు ధ
రించి పేరొందెను గిరీటి, క్రీడి, యనఁగ;
సరిగ నుచ్చైశ్శ్రవముఁ బోలు తురగచయముఁ
గాన్క గని శ్వేతవాహనాఖ్యను వహించె" ‖ ౨౫

మ‖ అన దుర్యోధనుఁడొక్క నవ్వు నగి, "బావా, వందివాచులన్ మఱిం
దిని గీర్తించుచునున్న వాఁడవహహా! నీ సోదరీభర్తకిం
కను బేరుల్ గలవా!" యటంచడుగఁగాఁ గంసారి, "బావా, సుయో
ధన, విన్మా: పిడుగుల్ భయంపడను దన్నామంబులన్ విన్నచో ‖

తే‖ గీ‖ తన్నుఁ బోలుటచే జిష్ణుఁడన్న పేరొ
సంగె నింద్రుండు; తన ధనంజయసమాఖ్య
యొసఁగె నగ్ని తేజస్సు నారసి కిరీటి,"
కనినఁ గర్ణుండు పకపకమనుచు నవ్వి ‖ ౨౬

ఉ‖ "నల్లురు నవ్వుటారయవు! నల్లనివాఁడవు గాన నీకిలం
గల్గెను గృష్ణనామ; మటుగాఁగనె ఫల్గుననామముత్తరా
ఫల్గునిఁ బుట్టుటం గలిగెఁ బార్థున: కిద్దియుఁ జెప్పవేల! పే
రుల్గలవా మనుష్యునకు, రూఢిగ నొక్కటి, నూఱు పైవియున్!" ‖

తే‖ గీ‖ అనిన హరి, "సత్యమే, కర్ణ! యంగరాజ!
సూతపుత్ర! రాధేయ!" యంచును హసించె;
"నాపిదపఁ బాండుపుత్రులేమైరో తెలుపు,"
మనుచు ధృతరాష్ట్రుఁడడుగ, నిట్లనియె శౌరి ‖ ౨౭

చ॥ "విజయుఁడు చెంత లేనివెత విస్మృతిఁ గాంచు నుపాయమెంచి, ధ
ర్మజముఖులైన పాండవులు ద్రౌపదితోడను, ధౌమ్యుతోడ, మా
నిజనులతోడఁ, దీర్థములనేకములం గనుఁగొంచు నేగి, య
క్కజమగు గంధమాదననగంబయిదేండ్లకుఁ జేరిరల్లనన్॥ ౩౦

క॥ అచట జటాసురుఁడను రా
త్రిచరున్ భీముఁడు వధించె, ద్విజవేషముఁ దా
లిచి తన వారలకుం గీ
డు చేయుటకుఁ బూనిన టకుటాంకతఁడగుటన్॥ ౩౧

క॥ ఆ గంధమాదనమునకు
సౌగంధికమను కుబేరుసరసి వెడలి, వే
వే గంధవహుఁడు వీవ, మ
హాగంధిలమొక్క పసిఁడి యబ్జము వచ్చెన్॥ ౩౨

మానిని॥

దానిని గన్గొని యట్టివి తెమ్మని ద్రౌపది కోరినయంత మరు
త్సూనుఁడు వెల్వడియేగుచు, దారినిజూచె ఘనున్ హనుమంతుని; స్వీ
యానుజు నక్కపివర్యుఁడు కన్గొని యర్జును కేతనమందు సదా
తాను వసించుటకొప్పుకొనెం, దన తమ్మునిపైఁ గల కూరిమిచే॥

ఉ॥ యక్షులు, రాక్షసుల్, పలువురల్లకుబేరసరస్సు నెప్పుడున్
రక్షణమాచరింతురు; పరాక్రమశాలుల వారి నెల్ల హ
ర్యక్షము మత్తకుంభినికరంబును బోలె వధించి, భీముఁడ
బ్జాక్షికిఁ దెచ్చియిచ్చెను సహస్రదళాన్విత హేమపద్మముల్॥ ౩౪

క॥ దుర్యోధన, వినుచుంటివె ?
భార్యాభిమతంబు దీర్పఁ బంతముమైన
కార్యమతఁడొనర్చెను ; ద
ద్వీర్యము నీవెఱిఁగినట్టిదే బాల్యమునన్॥ ౩౫

పంచచామరము॥

కుబేరుఁడేగుదెంచి యా వృకోదరున్, "బళా! బళీ!
సెబా!" సటంచుఁ దాఁ బ్రశంస చేసెఁ; గ్రీడి నంత వెం
టఁబెట్టుకొంచు వచ్చె దేవనాథుఁ: డగ్రజానుజుల్
సబాష్పనేత్రులైరి; కృష్ణ సంతసించె వారితో॥ ౩౬

ఉ॥ అంతటి సత్త్వశాలి యయినట్టి బకాంతకునిన్ హిమాలయ
ప్రాంతమునందుఁ బాముకటి పట్టుకొనెన్: నహుషుండటన్న భూ
కాంతుఁడు శాపమొంది, భుజగంబయి, యట్టులొనర్చె; ధర్మజుం
డంతట భీమునిన్ విడుచునట్టులొనర్చెను దన్మహాఫణిన్॥ ౩౭

క॥ ఉరుమహిమాన్వితునికతని
కరుదే యటు చేయ? యుద్ధమందైన, నతి
స్థిరుఁడతఁడని యతని యుధి
ష్ఠిరనామమ్మొకటియె ప్రకటింపఁగఁ జాలున్॥ ౩౮

ఉ॥ భీముఁడె కాదతండు విడిపించిన యాతఁడు; వేఱె యిర్వురో
మామ, విముక్తి గాంచిరి సుమా యమనందనుచేత; వారి మా
టేమని నేను నీకు వచియింతు? గతించిన యట్టివౌట వి
న్మా: మును విన్న ఘోరములకన్నను ఘోరములివ్వి కావులే॥ ౩౯

ఉ॥ ద్వైతవనంబులోని పశువర్గము చూడఁగ ఘోషయాత్రకై
నీ తనయుల్ బలంబుల ననేకములం గొని యేగినారు మా
మా, తలపోసికొమ్ము; చతురబ్ధములైనవి: పాండురాట్తనూ
జాతులు కూడ ద్వైతవని చక్కియ నుండిరి సుమ్మి యయ్యెడన్॥

తరువోజ॥ అంగారపర్ణుఁడన్నట్టి గంధర్వ
నటు మున్నె గెలిచెఁ గదా యర్జునుండు?
శృంగభంగము చెంది చిత్రరథాఖ్యుఁ
డేకొని ద్వైతంబు చేరువ నాతఁ

డంగనాసహితుఁడై యవ్వేళఁ గ్రీడ
లాడుచుఁ, దనదు విహారంబునకును
భంగంబు గలుగఁగాఁ బటురోష మొంది,
భటులతోఁ గౌరవబలమును దాఁకె॥ ౪౧

చ॥ శకునికిఁ బిక్కసత్తువయె సాయమొనర్పఁగఁ గర్ణుఁ; డోఁక ద్రెం
చికొనుచుఁ బాఱెఁ గర్ణుఁడును; జెట్టొక పిట్టగ సైనికుల్ కకా
వికలయిపోయి; రగ్రజుని వెన్కను విల్చుచుఁ బోరి, నీదు పు
త్రకులు భయార్తులై, తలొక దారిని బట్టిరి చెప్పకుండఁగన్॥ ౪౨

ఉ॥ చిత్రరథుండు చెంగుమని సింగము భంగిని బైకి దూఁకి నీ
పుత్రు సుయోధనుం జెనకి, "మూఢుఁడ! పాండుకుమారులన్న, నా
మిత్రము; లామహామహుల మీఁదికి వచ్చితివా?" యటంచుఁ, ద
ద్గాత్రము రజ్జుబంధితముగా నొనరించి, ధరిత్రిఁ ద్రోయుచున్॥ ౪౩

ఉ॥ కుత్తుక నత్తఱిం గటిక కోఁతను గోయఁగఁ గత్తి నెత్తఁ, ద
ద్వృత్తము నెట్లుగా వినెనొ, వెంటనె తాఁ బఱతెంచి సత్కృపా
చిత్తుఁడు ధర్మనందనుఁడు, చెచ్చెర నచ్చటఁ బాపె సుమ్ము రా
ట్సత్తమ! నీతనూజున, కెడందను బాంధవమే తలంచుచున్॥ ౪౪

ఉ॥ దుస్సల భర్త, సైంధవుఁడు, ద్రోవదికన్న గదా! పిశాచర
క్షస్సుల కంటె ధూర్తుఁడయి సాధ్విని గామముతోడఁ జూచెఁ, జ
క్షుస్సులు ప్రేలిపోవు ననుచున్ భయమొందక యాఖలుండు, తే
జస్సును గాంచి దివ్వెఁ బడి చావఁ దలంచెడి కీటకంబనన్॥ ౪౫

ఉ॥ భర్తలు చెంత లేని తఱిఁ బాండవపత్నిని బల్మిఁ బట్టుచున్
ధూర్తుఁడు సైంధవుండడవి త్రోవను బోవు నెడన్ హిడింబసం
హర్త యెఱింగి, వెంటఁబడి, యాఖలు బంధితుఁ జేసి తెచ్చి, సం
వర్తకృశానులోచనుని మాడ్కిని జూడ్కుల మంటలొల్కఁగా॥

ఉ॥ సైంధవు భీముఁడుగ్రముగఁ జంపుటకున్కన నెక్కఁగాఁ, గృపా
సింధుఁడు ధర్మనందనుఁడు చెచ్చెర నచ్చటికేగుదెంచి, త

ద్బంధనముల్ సడల్చుచును బ్రాణముతోడను బంపివైచె, సం
బంధము నెంచి దుస్సలకు మంగళసూత్రము నిల్చునట్లుగన్॥ ౮౭

శా॥ ఆ చందంబున ధర్మనందనుఁడు ధర్మాత్ముండు వారింపఁగా,
సైఁచెన్ సైంధవు తప్పు భీముఁడు; సభాస్థానంబునందల్లనాఁ
డే చావొందెడి వారు నీసుతులు భూమీశాగ్రణీ, భీముచేఁ;
బ్రోచెన్ వారల ధర్మరాజు తన తమ్ముం బట్టి వారించుచున్॥

క॥ అప్పుడె యను మాట యేమీ ?
విపినంబులయందు నున్న వేళఁ, బలుమఱుం
గుపితుఁడగు భీము నెప్పటి
కప్పుడే వారించుచుండె నాతండోర్మిన్॥ ౮౯

క॥ అవ్వనవాసం బెల్లను
నెవ్వగ గనకుండ, మానినికరము కథలె
వెవ్వియొ చెప్పఁగ వినుచును,
జవ్వనితోఁ బాండుసుతులు జరిపిరి మామా॥ ౯౦

క॥ నిజనందనుండయిన ధ
ర్మజు బుద్ధిబలంబు యక్షు మాడ్కిఁ బరీక్షిం
చి, జముండజ్ఞాతాకృతు
లఁ జరింపఁగఁ బాండవేయులకు వరమిచ్చెన్॥ ౯౧

క॥ ఆజ్ఞను ధౌమ్యుని కడఁ గొని
ప్రజ్ఞానిధులైన యట్టి పాండవులొక యేఁ
డజ్ఞాతవాసమొనరిచి,
రీజ్ఞాతులు తమ నివాసమెఱుఁగని చోటన్॥ ౯౨

తే॥ గీ॥ మత్స్యదేశంబు సకలసంపత్సమృద్ధ ;
మందు విరటుని నగరమత్యంత సౌఖ్య
కరము ; పాండవుల్ పత్నితో విరటు కడను
గొలువునకు వేఱువేఱుగాఁ గుదురుకొనిరి॥ ౯౩

సీ॥ సన్న్యాసి వలె రాజసన్నిధిఁ బుణ్యక
థలు తెల్పఁ గంకుఁడై ధర్మరాజు;
వంటలవాఁడౌచు వలలుఁడనెడి మాఱు
పేరును దాలిచి భీముఁడుండె;
నృత్తంబు రాచకన్నెలకు బృహన్నల
యను పేడియై నేర్పె నర్జునుండు;
అశ్వశాలాధ్యక్షుఁడౌచు దామగ్రంథి
నామంబుతోడను నకులుఁడుండె;
గోపవేషము గయికొని సహదేవుండు
విరటనృపతి గోష్ఠవితతి కెల్లఁ
దానె పెద్ద యగుచుఁ దనరెఁ దంత్రీపాలుఁ
డనెడి పేరు క్రొత్తగను వహించి॥ ౫౮

శా॥ శ్యామారత్నము ద్రౌపదీసతి యటన్ సైరంధ్రియై, మాలినీ
నామంబూని, విరాటు రాజ్ఞిని సుదేష్ణాదేవినిం గొల్చుచుం,
బూమాలల్ చెలువారఁ గట్టును, మెయిన్ భూషాతతిం బెట్టు, నె
మ్మోమందుం దిలకంబుఁ దీర్చుఁ, గలపంబుల్ గూర్చు, నంతఃపురిన్॥

క॥ మాసమె వెలితిగ నచట ని
వాసము సంవత్సరంబు వారు సలుప మా
మా, సంభవించె నొక్క మ
హాసంకటమపుడు వారికానగరమునన్॥ ౫౯

ఉ॥ క్ష్మాపతిచంద్ర, యంధుఁడవు గాన నెఱుంగవు గాని, ద్రౌపదీ
రూపముఁ గంటఁ జూచిన నరుల్ మరులొందక యుండనోప:. రా
ద్వాపరమోహినీరమణి వైపున జూపులు వాఱ, మారసం
తాపమెదన్ సుదేష్ణ పెదతమ్ముఁడు, కీచకుఁడొందె నయ్యెడన్॥

క॥ అబలామానహరుఁడు, పొగ
రుబ్బోతు, ప్రాయంపు వాఁడు, రూపసి తాన

న్న బడాయి గల ఖలుఁడు : సిం
హబలుండని వాఁడు సార్థకాఖ్య వహించెన్॥ ౫౮

క॥ మా బావ సుయోధను గుణ
మా బాలిశునందుఁ గొంత నమరెఁ : నెవరికిన్
లోఁబడక యచ్చు వేసిన
యాఁబోతు గతిం జరించు నతఁడు నగరిలో॥ ౫౯

ఉ॥ పెట్టని కోట వాని భుజపీఠి విరాటుని వీటి; కాపయిం
బట్టపు రాణి తమ్ముఁడు; స్వభావముచేతను ముష్కరుండు; తాఁ
బట్టిన యట్టి కుందెలు త్రిపాది యనం గల మొండికట్టె వాఁ;
డట్టి దురాత్ము కంటఁ బడె నక్కట! కృష్ణ సుదేష్ణ చెంగటన్॥

క॥ కంటిని బడినట్టి కలువ
కంటిని వెన్నంటి బాధ గలిగించిన యా
తుంటరిని జంపె భీముం
డొంటరిగా నన్యులెఱుఁగకుండఁగ రాత్రిన్॥ ౬౧

క॥ ద్రోవదికవమానంబును
గావించిన వారి బ్రహ్మ గావఁగ లేఁ, డే
దో విధమున భీముని క్రో
ధావేశము ధర్మసూనుఁడడఁపక యున్నన్॥ ౬౨

మ॥ సమదేభాయుతసత్త్వ సింహబలునిం జంపెన్ రహస్యంబుగాఁ
గ మహావీరుఁడెవండొ యంచును వినంగానే, జరాసంధు నం
తము నొందించిన వాఁడె యట్టి పనికిన్ దక్షుండటంచున్, నిగూ
ఢముగాఁ బాండవులుందురన్విరటు వీటన్ రూఢిగా నంచునున్॥

ఆ॥ వె॥ నిశ్చయంబు చేసి నీ యగ్రసుతుఁడు సో
దరులు, సైన్యములునుఁ, దొరలుఁ, దోడ
రాఁగ విరటు నగరికేగెను, బాండవా
జ్ఞాతవాసవిధికి స్వస్తి చెప్ప॥ ౬౪

ఆ॥ వె॥ ఆ దినంబుతోనె యజ్ఞాతవాసంబు
పూర్తి యయ్యె ననెడి గుర్తు లేక,
దొంగ చను వెనుక మొఱుంగు భైరవమూర్తి
భంగిఁ జేసినారు బావగారు॥ ౬౫

వ॥ పాండవులను బయలుపఱుచు నుపాయం బాలోచించి విరటుని నగరంబునకు దక్షిణంబునఁ గల గోధనంబును హరింపఁ ద్రిగర్తదేశ భూభర్త యైన సుశర్మం బంపి, కంపితధరావలయంబగు చమూనిచయంబుతో భీష్మద్రోణకర్ణాదివీరవరులును దానును నీయగ్రసూనుండుదగ్రవృత్తి నుత్తరగోగ్రహణంబు గావించె॥ ౬౬

పంచచామరము॥ త్రిగర్తులొక్క ప్రక్క గోతతిన్ హరింపఁ, బోరొన
ర్పఁ గల్గు వారలెల్ల రా విరాటుఁడాజికేగఁగా,
మగంటిమిం గలారు గాన మాత్స్యు వెంట నేగిరా
జ్ఞ గాంచి, తేరులెక్కి, ధర్మజాతభీములుం గవల్॥

ఉ॥ బొత్తిగఁ గుఱ్ఱవాఁడనుచుఁ బుత్రునిపైఁ గల వెఱ్ఱిప్రేమచే
నుత్తరుఁడాజికేగుటకు నొప్పక నిల్పె సుదేష్ణ; "చేతిలోఁ
గత్తిని నేను బట్టినఁ, ద్రిగర్తులె కాదు, త్రిమూర్తులైననుం
జత్తురు నన్నెదిర్చి" యని జల్పములాడుచు నాతఁడుండఁగన్॥ ౬౮

క॥ "ఉత్తరమున గోతతి ను
ద్వృత్తిని గౌరవులు పట్టి యేగుచునున్నా
రిత్తఱి," నని గోపాలురు
తత్తఱమునఁ బాఱుతెంచి తనకుఁ దెలుపఁగా॥ ౬౯

శా॥ ఆటోపంబున లేచి యుత్తరుఁడు తన్నంతఃపురస్యంచర
చ్చేటీవర్గము మేటివీవని ప్రశంసింపంగఁ, "గౌరవ్యాలి
వ్రీటన్ నేఁ గల మాఱెఱుంగక యిటుల్ విచ్చేసినారేమొ? మ
ద్ధాటిం గన్గొని పర్వ పెట్టునటు యుద్ధంబేను గావించెదన్॥ ౭౦

క॥ తగ్గ రథసారథియె లే;
డెగ్గతి వారున్న చోటికేగఁగ నేర్తుఁ ?
దగ్గఱకు వారు వచ్చినఁ,
బగ్గెను గనఁబఱుతు,'' నంచుఁ బలుకఁగ సాగెన్॥ ౭౦

తే॥ గీ॥ ఉత్తరు ప్రగల్భములు వినుచున్న మన బృ
హన్నల తనదు శిష్యురా, లతని చెల్లె,
లైన యుత్తరం గాంచి, ''యమ్మాయి, యనిని
నేను రథమును గడపఁగా నేర్తు,'' ననిన॥ ౭౧

క॥ పేడి తన రథము నడుపుట
కాఁడాఁబలరాముఁడొల్ల ననఁ జేటిక, ''లె
వ్వాఁడు నడిపినను నేమీ ?
యోడవు గద నీ ?'' వటన్న నుత్తరుఁడంతన్॥ ౭౩

ఆ॥ వె॥ అరద మెక్కి యరిగి, కురుసేనఁ బొడఁగని,
గడగడఁ వడంకఁగాఁ దొడంగ,
జడుపు నుడిపి, యర్జునుఁడు తానగుట తెల్పి,
పేడితనము వీడి, క్రీడి యగుచు॥ ౭౪

ఆ॥ వె॥ త్రొక్కి యుంచినట్టి క్రోధంబు వెలువడ్డ
కరణి సవ్యసాచి కర్ణముఖ్య
వీరనికరభయదకౌరవసేనపైఁ
బడియె రథము నుత్తరుఁడు నడుపఁగ॥ ౭౫

క॥ భండనమున గాండీవికిఁ
బండువు గద ? నేను గాదు, పఱు కథ నీకుఁ గ
ర్ణుండే వర్ణింప సమ
ర్థుండు, కలనిలోన నాతఁడుండుటవలనన్''॥ ౭౬

వ॥ అని వాసుదేవుండు మందహాసభాసురవదనంబునం దన దెసఁ
జూడఁ గర్ణుండు, వివర్ణుండై నవహాసచ్ఛలంబున ముఖచ్ఛవి
మాటు పఱుచుచు॥ ౭౭

క॥ పయి కథ కేమున్నది? స్త్రీ
యయి, యప్పుడె పురుషుఁ డైన యర్జునుఁ గని వి
స్మయమున మేముండఁ బసులఁ
గయికొని నీ మఱఁది పురికి గబగబ నరిగెన్"॥ ౭౮

తే॥ గీ॥ అనినఁ గృష్ణుండు నవ్వి, "కర్ణా, సెబాసు!
క్రిందఁ బడి యదె మీఁదటంచుం దెలిపెదు!
గురువుగారిఁక నేమి పల్కెదురో?" యంచు
ద్రోణుఁ జూడ, నాతఁడు ముకుందుని గనుఁగొని॥ ౭౯

క॥ "మా యోటమి మాచే నే
లా యొప్పించెదవు? నాఁటి యర్జునుతోఁ జ
క్రాయుధ, నీకేనియు నని
సేయంగా రాదు, మమ్ముఁ జెప్పఁగ నేలా?॥ ౮౦

క॥ ప్రాణంబులతో నర్జును
బాణంబులు మమ్ము వదిలెఁ: బరమకృపాపా
రీణుండతఁ," డని పలికిన
ద్రోణుని గర్ణుండు కినుకతోఁ గనుఁగొనుచున్॥ ౮౧

క॥ "ఒజ్జవగుటచే నీవా
కొజ్జా యొక వీరుఁడనుచుఁ గొండాడుటకున్
లజ్జిలక యున్న వాఁడవు
మజ్జారే!" యన్న ద్రౌణి మదిఁ గనలొదవన్॥ ౮౨

క॥ "కొజ్జాకోడిన వాఁడవు,
లజ్జిల్లుట మాని యిటు చలంబు దలిర్పన్
రజ్జులు పలికెద వేటికి
మజ్జనకునితోడ? సిగ్గుమాలిన వాఁడా"॥ ౮౩

తే॥ గీ॥ అనఁ బ్రమాదంబు వచ్చె నటంచు బెదరి
యాంబికేయుండు, "కృష్ణ, యేమయ్యెనయ్య?

యటువయిని బాండుసుతుల వృత్తాంతము నెఱిఁ
గింపు,'' మన్న, గ్రమ్మఱఁ బల్కెఁ గృష్ణుఁడిట్లు॥ ౮౪

ఉ॥ ''పాండుతనూభవుల్ తనదు పజ్జ నిగూఢముగాఁగ వత్సరం
బుండి, తుదిన్ రణంబున మహోపకృతుల్ పొనరించిరంచు మా
త్స్యుండు చెలంగి, యా ఘనులతోడను వియ్యము చేయఁ గోరుచుం,
బెండిలి చేసె మన్మథుని మించిన పార్థునిపట్టికు త్తరన్॥ ౮౫

మ॥ శుభలగ్నంబునఁ బేరఁటాండ్రును, ద్విజుల్, చుట్టాలు, దీవింపఁగా
నభిమన్యుండు వివాహమయ్యె నృపకన్యారత్నమా నుత్తరన్;
సభలో జూదము నాఁటి పందెముల నీ చందంబునం దీర్చినా
రు భవత్సోదరుఁడైన పాండువిభుపుత్రుల్ నీకృపన్ భూవరా॥ ౮౬

శా॥ దాయాదుల్ దమకాచరించిన మహాదౌష్ట్యంబులం బట్టి యి
చ్చో యుద్ధంబె యొనర్పఁగాఁ దగినదంచుం దమ్ములున్ భార్య పో
రే యోచింపఁగ, బోరు నష్టమని పొందే కోరుచున్నాఁడు కౌం
తేయాగ్రేసరుఁడైన ధర్మజుఁడు పృథ్వీనాథ, విన్నాఁడవే?॥ ౮౭

ఉ॥ తమ్ముని రాజ్యభాగమును దమ్ముని బిడ్డలకీవు భీష్మ వా
క్యమ్మును బట్టి యిచ్చితివి; కానలకంపిరి వారి మాయ జూ
దమ్మున మోసమున్ సలిపి తావకపుత్రులు; ధర్మబద్ధులై,
కిమ్మనకయ్యరాతిగజకేసరు లేగిరలంతులట్లుగన్॥ ౮౮

క॥ ఎన్నాళ్లయియో యగపడ
కున్న సుతుల యునికి దెలియ, ''నుర్విన్ సుఖులై
యున్నారా?'' యని యొక కబు
రున్నివంపవు గదా విరోధివి పోలెన్?॥ ౮౯

ఉ॥ సంజయుఁడన్న నీ యనుఁగు సంగడికాఁడు గదా? యతండు మొ
న్నం జనుదెంచినంతఁ, బెదనాయన పంపె నటంచు నెంచుచుం,
గంజము వేగుఁజుక్కఁ బొడగాంచినచో నెటులౌనొ యట్టుల
య్యెం జుమి ధర్మనందనుని హృత్కమలంబు శుభోదయాశచే॥ ౯౦

ఉ॥ పంపితివీవటన్న నుడి పల్కకయుండుటె కాదు; రాజ్యభా
గంపుఁ బ్రశంసగా నతఁడొకానొక మాటయు నాడ లే: డిలా
సంపదలస్థిరంబులని, శాంతము భూషణమంచు, జ్ఞాతులం
జంపుట వంశహాని యని, సంజయుఁ డాడెను మాటిమాటికిన్॥ ౯౧

క॥ అమాత్యులయందలి భా
వమ్మారయఁ, బాండవులకు వారల భూభా
గమ్మొసఁగుట నీదు మదికి
సమ్మతి లేదనుటె కాదె స్పష్టముగాఁగన్ ?॥ ౯౨

ఉ॥ ద్యూతమునందు ధర్మసుతుఁడోడిన రాజ్యము నెట్టి రీతిగా
నాతఁడు క్రమ్మఱం బడయ నర్హుఁడటంచుఁ దలంచితేమొ ? తా
నాతఱి నోడె జూదమున ; నాహవమందది గెల్చు నిప్పు ; డే
దో తెగతెంపుగాఁ దెలుపు : యుద్ధమొ ? సంధియొ ? కౌరవేశ్వరా॥

క॥ రణకేళిని బ్రాణంబులు
పణములు, బాణంబులు సుమి పాచికలు ; రణాం
గణమున నగు జూదమ్మున
గణుతిం గనఁగ లేదు శకుని గాంధారీశా॥ ౯౪

క॥ భయపడుచున్నాఁడు రణం
బయిన యెడలఁ గౌరవాన్వయక్షయమగు నం
చు యమాత్మజుండు ; తమకప
జయము గలుగు నంచు మదిని జంకఁడు సుమ్మా॥ ౯౫

క॥ ఎట్టి గతిని నీ ముద్దుల
పట్టికిఁ జెవి నులిపి బోధ పఱిచెదవో ? తా
మట్టగిడుసు వడువునఁ గడు
మిట్టిపడుచునున్నవాఁడు, మీఁదెఱుఁగక యో !॥ ౯౬

క॥ రాజన్యుల చేకులు రా
ర్రాజగు తనకిపుడు తోడు రాఁగ సరాగం

డై, జయకాంక్షను దానొక
వాజిగఁ గాల్ ద్రవ్వుచున్న వాఁడాజి యనన్॥ ౯౮

శా॥ ద్రోణాదుల్ గలరంచు, సంగరసమర్థుండైన భీష్ముండని
ద్రాణుండై తన సేనలన్ నడుపుచున్ రక్షించు నంచున్, రణ
క్షోణిన్ వైరుల గెల్తునంచును, భవత్సూనుండు యోచించె; నా
స్థాణుండైనను గెల్వ లేని నరు నే చందంబునన్ గెల్చునో?॥ ౯౯

మ॥ అని సేయంగఁ గడంగఁ బాండవుల కేడక్షౌహిణీసంఖ్యవా
హినులే యున్నవి గాని, లెక్క నిడఁగా నే కాదశాక్షౌహిణుల్
తన పక్షంబున సేనలున్నవని యాతండెంచుచున్నాఁడో? య
ర్జునుచేఁ జచ్చిరి మూడు కోటులమరారుల్ : దాని కేమెంచెనో?॥

శా॥ ఏ సాహాయ్యము లేని యట్టి విజయుండే దుర్నివారుండనం
గా, సామీరియుఁ గోదుచూపు నెడ నింకం జెప్ప నేమున్న? దే
మో సామాన్యులటంచు వారలను మీరూహించుచున్నారలో?
నీ సూనుల్ తెగుటింకఁ దప్పదు క్రుధానిర్నిద్రుఁడౌ భీముచే॥ ౧౦౦

క॥ "ఉద్దండగదాదండం
బుద్దవడిని ద్రిప్పి భీముఁడూరుద్వయమున్
బ్రద్దలుగఁ గొట్టినప్పుడు
బుద్ధి గలుగు నేమొ నీదు పుత్రునికనిలో?"॥ ౧౦౧

మ॥ అన దుర్యోధనుఁడెఱ్ఱవాఱిన మొగంబై, "యోయి గోపాలనం
దన, నీవెంతటి రాయబారివయినన్ మర్యాద లేకుండ నో
టను బల్కంగను రాని యట్టి నుడులాడన్ వచ్చునే? నన్నుఁ గు
క్కని, యూఁబోతని; యింక నేమొయని, నీవన్నాఁడవే న్నెన్ని యో॥

క॥ ఆ పాటితోడ విడువక,
శాపాలాపముల నాడ సాగితవిపు; డిం
కీపగిదిఁ బలికి నాకుం
గోపము తెప్పింప నాల్కఁ గోయుఁదుఁ జుమీ"॥ ౧౦౩

వ॥ అని యీసును రోసంబును గదురఁ బలికిన॥ ౧౦౪

క॥ నాల్కను గోయింతు ననెడి
పల్కు సుయోధనుఁడు నోటఁ బల్కఁగ, భీష్ముం
డుల్కిపడి, మెఱుములత్తుల
నొల్కఁగ, ఘనరవముతోడ నుఱుముచుఁ బల్కెన్॥ ౧౦౫

మ॥ "అపచారంబులకంతమన్నయది లేదా? పెద్దయుం బిన్నయ
న్న పరిజ్ఞానము లేక నాఁడు సభలోనన్ నన్ను నోర్మ్రాయుమ
న్నపు, డెట్లో సహియించితిన్; ద్రుపదకన్యావస్థ నీక్షించి, యో
రుపు నెట్లెట్లొ వహించినాఁడ: నెటులోర్తున్ దైవధిక్కారమున్?॥

ఉ॥ నాల్కలు రెండువేల్కల యనంతుఁడు, నాల్కలమీఁదఁ బల్కుటి
ల్లాల్కల బ్రహ్మ, యేవిభుమహత్త్వము నెన్నఁగ లేరొ, నాల్కతోఁ
బల్కిన మాత్ర నే విభుని పన్నును ఫాలములందుఁ గేల్గవల్
గీల్కొన గోత్రభిన్ముఖనిలింపవరుల్ శిరసావహింతురో॥ ౧౦౭

క॥ ఆ యాదిదేవు నాల్కను
గోయించెద నన్న యట్టి కూళకు నాల్కం
గోయుదు," నని లేవఁగ రా
ధేయుఁడడ్డుపడి, భీష్మ దెసకు మొగంబై॥ ౧౦౮

మత్తకోకిల॥ "ఆదిదేవుఁడటంచు నారదుఁ డచ్చటచ్చట నాడ, ని
య్యాదవుండొక దేవుఁడంచని యజ్ఞులందురు వెఱ్ఱిగా;
యేది, చూపుమ, దైవలక్షణమేమి యున్నదొ కృష్ణులో?
సోదెమియ్యది: మీదు దేవుఁడు చోరుఁడున్, బహుజారుఁడున్॥

సీ॥ వ్రేపల్లె యిండ్లలో వెన్నమీఁగడలు దొం
గిలి తినె గొల్లపిల్లలను గూడి;
యపహరించెను నదియందు స్నానంబాడ
గోపికల్ విడిచిన కోకలెల్ల;

శిశుపాలు పెండ్లికి సిద్ధమై యున్న రు
క్మిణిని దస్కరుని మాడ్కిఁ గొనిపోయెఁ;
బారిజాతముఁ జోరు భంగిఁ దెచ్చెను ముద్దు
భార్య యయిన సత్యభామకొఱకు;

చిన్నతనమునుండియు నెన్ని యేని
దొంగతనములు చేసి, యా భంగి నాఁడె
వెన్నదొంగ యటంచును విశ్రుతి గని
నట్టి గజదొంగ కాఁడె యమ్మాదవుండు?॥ ౧౧౦

తే॥ గీ॥ అష్టమహిషులు గాక, పదాఱువేల
భార్యలును గాక, యల్ల వ్రేపల్లెలోని
గొల్ల భామలఁ గూడెను; గుబ్జఁ గూడె,
మేనయత్తను గూడె నిమ్మిండకాఁడు॥ ౧౧౧

ఉ॥ ఈదృశుఁడాదిదేవుఁడగునే?, "యనుచున్ హసియింప భీష్ముఁ," డో
యీ, దయితాసహస్రముల నేలుకొనంగను జాలు మానవున్
మేదిని గంటివే? యితని మిండతనంబును గూర్చి యన్న నీ
వాదము సత్యమేని, భగవంతుఁడె యీతఁడసంశయంబుగన్॥ ౧౧౨

ఉ॥ శ్రీసతి యాత్మచంచలతచే బహురూపములన్ వహించి, పే
రాస దలిర్ప నట్లు హృదయాధిపుతో రమియించుచున్నదో?
యీ సకలప్రపంచముదయింపఁగ నెవ్వతె హేతు, వట్టి మా
యాసతి యట్లుగాఁగఁ బరమాత్మునితో రమియించుచున్నదో?॥

ఉ॥ చిన్నతనంపుఁ జేష్టలుగఁ జేసిన చేఁతలు కొన్ని, పెద్దయై
యన్నుల కోసమై సలిపినట్టి పనుల్ మఱి కొన్ని: నీకు నీ
యన్నియు నట్టి చౌర్యముల యట్టులె తోఁచెను, బచ్చకామరల్
కన్నులఁ గప్పు వానికి జగత్తఖిలమ్మును బచ్చనైనటుల్॥ ౧౧౪

తే॥ గీ॥ అట్టి రోగమెయ్యదియొ నిన్ బట్టి యుండ
నోపుఁ; గాకున్న యెడల, దామోదరుఁడొన

రించిన యమానుషంబులౌ కృత్యములను
వినియు నితని దేవునిగ భావింపవేల ?॥ ౧౧౫

ఉ॥ పూతన యాదిగాఁ బిశితభుక్కులఁ జెక్కుర నుక్కడంచె, దు
ర్నీతిఁ జరించు కాళియఫణిం దలలెక్కి యణంగఁ ద్రొక్కెఁ, దాఁ
జేతను శైలమెత్తి నిలిచెన్ బలభేది మదంబుఁ బాపఁగా,
నీతఁడు చిన్ననాఁడె : తరమే నరమాత్రునకిట్టి కార్యముల్ ?॥

చ॥ ఇతఁడొకరుండె నిన్ను, నను, నిక్కురు సైన్యములోని యెల్లరన్,
హతమొనరింపఁ జాలు ; నటులయ్యును, గౌరవులన్నఁ బాండుభూ
పతిసుతులట్టులే తనకు బంధులు గావున, రెండు దిక్కులన్
హితమును గోరి సంధి ఘటియింపఁగ వచ్చెను రాయబారియై॥

మ॥ అభిమానంబు గలాఁడు గావునని సాహాయ్యంబపేక్షించి తా
ముభయుల్ ఫల్గునుఁడున్ సుయోధనుఁడుఁ దన్నొక్కతఱింబిల్వ, యు
ద్ధభువిం గేవలపార్థసారథిగనే తాన్నుంటకై యాత్మస
న్నిభులన్ నూర్వురఁ బంపె నీసఖుని వెన్వెంటన్ మహాయోధులన్''॥

మ॥ అనఁ గర్ణుండు పకాలునన్ నగి, '' వహవ్వా ! బాంధవప్రేమఁ గృ
ష్ణునిదే పెట్టిన పేరు : మామ యగు కంసున్, మేనబావైన చై
ద్యుని, బుత్రున్ నరకున్, దివంబునకు విందుల్ గాఁగఁ బంపెం గదా,
విన లేదే?'' యన భీష్ముఁడాతని దెసన్ వీక్షించి వ్రేలూఁపుచున్॥

ఉ॥ '' దుష్టులు వారు ; దుష్టులను ద్రుంచుటకీతఁడు పుట్టె నంచు వి
స్పష్టముగాఁగ నారదుఁడు పల్కెను : దుష్టచతుష్టయంబు మీ
యిష్టసఖుండు, మీరుఁ ; బొలియించును పార్థులచేత మిమ్ము, మీ
కష్టసుఖాలు మా యవియెగాఁ గల మమ్ము, నితండు పోరిలో''॥

తే॥ గీ॥ అనుచు హరి దెసఁ దిరిగి, '' కృష్ణా, గనుఁగవ
గలుగు గ్రుడ్డివారలు వీరు ; కనులు లేని
గ్రుడ్డి మా రాజు : నీతి గన్గొనఁగ లేరు ;
తెలుప వలసినదెదొ నీవు తెలుపుమయ్య ''॥ ౧౨౧

వ॥ అని హెచ్చరించిన నచ్యుతుండు విని తనపై మచ్చరించి దూషణ
వాక్యంబులుచ్చరించిన కర్ణుని సంభాషణంబులకు రోషంబు తెచ్చు
కొనక యచ్ఛంబగు మనంబుతో యాంబికేయుని దిక్కు మొగంబై॥

శా॥ "మామా, న్యాయపథంబు దెల్పితిని; దుర్మానుండు దుర్యోధనుం
డామార్గంబున కొప్పకున్నఁ, దమకే యైదూళ్లొ యీయన్ సుతుల్,
భామల్, తల్లియుఁ, దాము, నేగతినొ కాలక్షేపముం జేయఁగా
సామీరిప్రముఖుల్ నిజాగ్రజుని యాజ్ఞాబద్ధులై రే సుమీ॥ ౧౨౩

క॥ సంబరమున నీ కొడుకు నొ
డంబడుమనీ చెప్పుమా, కడమ రాజ్యము నె
ల్లం బట్టభద్రుఁడై విభ
వంబునఁ దానొకఁడె యేల వచ్చుఁ జిరముగాన్॥ ౧౨౪

వ॥ అయిదూళ్లయిదుగురు పాండవులకిచ్చినం జాలు," నని యీ
విధంబునఁ బలికిన కృష్ణుని వాక్యంబులు విని॥ ౧౨౫

చ॥ "ఇది కడు లెస్స! ధర్మసుతుఁడెంతనుకూలుఁడు! సంధికిట్టులొ
ప్పదలను బొందు," మన్ననుడువుల్ ధృతరాష్ట్రునితోడభీష్ముఁడున్,
విదురుఁడు, ద్రోణుఁడుం, గృపుఁడు, వేమఱు చెప్పిరి; యట్టులే సభా
సదనములోపలన్ గుసగుసల్ వినిపించెను రాజమండలిన్॥ ౧౨౬

తే॥ గీ॥ ఆంబికేయుఁడయ్యెడల నిజాగ్రజన్ము
సరసకుం బిల్చి, తనదు పార్శ్వమున గద్దె
పైని గూర్చుండఁగాఁ జేసి, మేను నిమిరి,
గడ్డమును బట్టుకొని, ప్రేమ గడలుకొనఁగ॥ ౧౨౭

శా॥ "పుత్రా, వింటివి కాదె కృష్ణువచనంబుల్? మీరలున్, వారలున్
శత్రుత్వంబునఁ బోరి చంపుకొనుటిష్టంబుండ, కేరీతినో
మైత్రిన్ మీకు ఘటింపఁ గోరి యితడిమ్మార్గంబు చూపించెఁ జుఃమ్మాత్రోవం జని తేని రాజవగుదీ, వేపోరు లేకుండఁగన్॥ ౧౨౮

చ॥ సమరము గల్గినన్ గెలుపు సందియమే కద? సవ్యసాచి వి
క్రమమలికంబునందుఁ గను గల్గిన వానికె శౌర్య రాసిదం
ట! మఱి, మహాబలాత్మజుఁడొనర్చిన యట్టి ప్రతిజ్ఞలం దలం
చి, మది వడంకుచుండుః నని సేయకుమయ్య!'' యటంచు వేడినన్॥

మ॥ ''అకటా! యెంతటి వెఱ్ఱి నీకు జనకా! యాభీముఁడేమేమొ నో
టికొలందుల్ శపథోక్తు లీసుమెయి నాడెన్; వాని నీడేర్ప వా
సికి, వానిన్ సృజియించినాతనికి, నేనిన్ శక్యమే? సవ్యసా
చి కలండచ్చట నన్నుఁ, గర్ణునికి లోఁచ్చే యాతఁడాజిస్థలిన్॥ ౧౩౦

శా॥ ''నా సామర్థ్యమెఱుంగవీవుః హలి చెంతన్ శిష్యవృత్తిన్ గదా
భ్యాసంబేమొనరించుచున్న సమయంబం, దేనునున్ భీముఁడు
ల్లాసార్థంబుగఁ బోరు సల్పినపుడెల్లన్ వాని నే మించుచున్
దాసోహమ్మనిపించుచుంటిని సుమీ తండ్రీ, భయంబేటికిన్?॥

మ॥ సగమో పాతికొ; మూరెఁడో యడుగొ, రాజ్యంబందు భాగంబు నా
పగవారిం గొనుఁడంచు నేనొసఁగినన్, బాంధవ్యముం బట్టి య
ట్లుగ నేనిచ్చితి నంచు నమ్మరు జనుల్ః పోరంగ భీతిల్లి, యా
పగిదిన్ లొంగితి నంచు నిశ్చయముగా భావింతురుల్లంబులన్॥

క॥ ఐదూళ్లు కాదు, సన్నని
సూది మొనన్ మోఁపినట్టి చోటేనియు నే
నీఁ దలఁచుకొనఁగ లేను; మ
ఱేదయినం జెప్పు తండ్రి, యిది విన,''ననుచున్॥ ౧౩౩

తే॥ గీ॥ ఖండితముగ నిట్లు సుయోధనుండు పల్కి,
చనియెను జివాలుమని కర్ణశకునులి కడ;
కాంబికేయుండు కృష్ణుతో, ''నరసితివి గ
దా, ముకుంద, నీ బావ చందంబు నెల్ల?॥ ౧౩౪

ఉ॥ పంతము వచ్చినన్, జలగపట్టును బట్టి విడంగఁ బోవఁ; డా
ఘంతయు నేనదల్చినను, ప్రాణముఁ బాయఁగ సిద్ధమౌను: వా

డంతటి సాహసంబు గల యట్టిఁడ ; యే మునిరింతు నయ్య, కం
సాంతక !" యన్న "నో నృపకులాగ్రణి, దీనికిఁ జింత యేటికిన్ ?॥

క॥ లోంగని యేన్గును సంకెల
లం గట్టుదు," రన్న మాటలం గృష్ణుఁడు ప
ల్కంగ విని, శకుని ప్రక్కకు
వంగి, సుయోధనుని చెవిని వదనముఁ జేర్చెన్॥ ౧౩౬

తే॥ గీ॥ ఒక్క గెల నున్న తాటిపండ్లో యనఁ దగు
మాడ్కి దుష్టచతుష్టయమ స్తకములు
నాల్గుఁ జేరె నొక్కెడ ; కనంతరము, కదలి
కలు గలిగె నవి గాలికిఁ గదలినట్లు॥ ౧౩౭

క॥ అటు పిదప దుస్సేనుఁడు
తటాలుమని లేచి వెడలి, తడయక తెచ్చెన్
దిటమగు చిటికెన వ్రేలం
తటి దళసరి సంకెలల ననంతుని గట్టన్॥ ౧౩౮

చ॥ తన చిననాఁటఁ బెంపకపుఁ దల్లి యశోద యదల్చి రోల బ
ద్ధునిగ నొనర్చ, నద్ది తనతోడనె లాగుచు మద్దిచెట్ల దా
నను బడఁ గూల్చినట్టి యదునందను గట్ట సుయోధనుండు మూ
ర్ఖుని గతి నెంచె, వేఘనతరుల్ తనతమ్ములుఁ, దానుఁ, గూలఁగన్॥

క॥ "బంధింపఁ దలఁచితిరె భవ
బంధవిమోచను ?" నటంచుఁ బలుకుచుఁ దన చే
తం ధనువు పట్టి బాణము
సంధించిన భీష్ముఁ గరము సాఁచి నిలుపుచున్॥ ౧౪౦

ఉ॥ మంటిని దింటివా ? యనుచు మాత తనున్ మును ప్రశ్నచేయ, వె
న్వెంటనె వక్త్రముం దెఱచి విశ్వములం బదునాల్గుఁ దల్లికిం
గంటికిఁ జూపినట్టి యదుకాంతుఁడు, శ్రీభగవంతుఁ, డంత ము
క్కంటియు నల్వయున్ వెఱఁగు గాంచ ధరించెను విశ్వరూపమున్॥

లయవిభాతి॥ గగనమునకొక్క మొగి నెగసెను శరీర ; మట
మొగములొక వే యొదవె ; ద్విగుణితములై దో
ర్యుగములును లేచె : బలు వగలగు మహాయుధము
లొగి నొదవి హస్తముల ధగధగలు చూపెన్ ;
బగబగమటంచు రవులగణితములాచును వె
లిఁగినటులుగా నొడల నెగడె బహుకాంతుల్ ;
జగములు చతుర్దశములగపడియెఁ గుక్షి, వెడఁ
దగు వదనముం దెఱవ, బెగడొదవునట్టుల్॥ ౧౮౨

దండకము॥

"హరి హరి! హరి యొక్కఁడా! పెక్కురా? నూర్వురున్, వేగురున్, లక్షకోట్యర్బుదన్యర్బుదానంతకృష్ణుల్ కనన్ వచ్చుచున్నారు! శ్రీకృష్ణులే కాదు : రుద్రుల్, నవబ్రహ్మలున్, ద్వాదశాదిత్యులున్, వజ్రియున్, వహ్నియుం, గాలుఁడుం, దక్కు దిక్పాలకుల్, రాముఁడున్, భీముఁడుం, బార్థుఁడుం, గాక యింకెవ్వరో యెవ్వరో హస్తయుగ్మంబులం జాపముల్, శూలముల్, కుంతముల్ ఖడ్గముల్, ముద్గరంబుల్, గదాదండముల్, భిండివాలంబులున్, మున్నుగాఁ గల్గు శస్త్రంబులం దాల్చి కంసారికిన్ ముందఱం, బ్రక్కలందుం, బిఱుందన్, మహాభీకరాకారులై నిల్చి యున్నారు! మున్నెందు నెన్నండుఁ గన్నట్టి విన్నట్టి చందంబు గాదీస్వరూపం!" బటంచున్ సభం గూరుచున్నట్టి వారెల్ల నుల్లంబులం దల్లడంబంది నిర్విణ్ణులై చూచుచుండంగ, భీష్ముండు చిత్తంబునన్ భక్తితాత్పర్యముల్ మొల్కలెత్తంగఁ గేలెత్తి ఫాలస్థలంబందుఁ గీలించి, "విశ్వేశ, విశ్వాత్మ, నీ విశ్వరూపంబు పాపంబులుద్ధూతముల్ గాఁగ వీక్షించితిన్; నీమహత్త్వంబు లక్షించితిన్: జన్మసాఫల్యమయ్యెం; బునర్జన్మమీదుష్టలోకంబునన్ నాకు లేకుండునట్టుల్ ప్రసాదింపుమా! నీచసేవం దొలంగించి నా దుఃఖభారంబిఁకన్ దింపుమా! స్వర్గమొందింపుమా! తే నమస్తే నమస్తే నమః॥ ౧౮౩

చక్రబంధము.

శా॥ ధన్యాత్ముల్ సెవిఁ బ్రక్కఁ జేరి, "హరి, నాథా, చక్రి, రక్షింపుమా ;
యన్యం బేల ? విభాకరాభ, హతసర్వారిష్ట, సింధుస్వరాట్
కన్యామానసస క్త, దేవహరసంఘాతప్రహర్తా, క్షమా
మాన్యా, బాధలుమాయఁ జేయు, కరుణామార్గా, విరాట్సత్తమా"॥

చ॥ అని వినుతింప దుష్టనివహంబును ద్రుంపను, శిష్టకోటి మం
పను, గరుణామతిన్ ధరణిపై బహురూపములన్ ధరించుచున్
జననము నీవు పొందుదువు : సాధుజనంబులఁ బ్రోవ నీవొన
ర్చిన ఘనకార్యముల్ వినుతి సేయఁగ నాకుఁ దరంబె ? మాధవా॥

మ॥ శ్రుతులన్ దొంగిలి సోమకుండు విపులార్ణోరాశిలో డాఁగ, స
మ్మతిమై మామనివాసమద్ది యనుచున్ మత్స్యంబవై యందుఁ జొ
చ్చి, తనూజుండగు బ్రహ్మసొత్తు మరలన్ శీఘ్రంబుగాఁ దెచ్చి యి
చ్చితివారక్కసు నుక్కడించి కరుణాసింధుండవై మాధవా॥ ౧౪౬

మ॥ సుధకోసమ్మయి దేవతావ్రజము రక్షోవర్గముం గూడి యం
బుధిలో మందరముంచుచుం దరువ, నంభోరాశిలో మున్గ న
క్కుధరంబుం బయికెత్తి నిల్పుటకునై కూర్మంబవౌ నిన్నుఁ గూ
ర్మి ధవుంగా వరియించె నబ్ధిసుత, లక్ష్మీదేవి, యోమాధవా॥

మ॥ అవనిం జంకను జాపచుట్టగ హిరణ్యాక్షుండు చుట్టన్, మహా
ర్ణవమగ్నంబిల గాక యుండఁ బెను దంష్ట్రన్ లేవ నెత్తంగ నా
దివరాహాకృతిఁ బూనినట్టి నిను ధాత్రీదేవి కామించుచున్
ధవుఁగాఁ గైకొనె : నీకు సార్థకము భూదారాఖ్య యోమాధవా॥

మ॥ హరిభక్తిన్ విడకున్న పుత్రుఁడగు ప్రహ్లాదున్ వెతం బెట్టు ని
ష్కరుణున్, ముష్కరునిన్, హిరణ్యకశిపుం, జంపంగ స్తంభంబునన్
నరసింహాకృతిఁ దాల్చి వెల్వడిన నిన్ డాయంగ గంధేభయా
న, రమాసుందరి, వెక్కదీసె మదిలోనన్ జంకుచున్ మాధవా॥

మ॥ అడుగుల్ మూడు గలట్టి వామనుఁడవై, యర్థిన్ బలిన్ నీవు మూ
డడుగుల్ వేఁడి, భువిన్, దివిన్, బలిశిరస్సుం, దంఘ్రులన్ మోఁపి, యు

య్యెడ ముల్లోకములాక్రమించితివి దేవేంద్రుండు హర్షింపఁ, బు
ట్టెఁడు బుద్ధుల్ భువిఁ బొట్టివాని కనినట్లే నేర్పుమై! మాధవా॥

శా॥ ఆలంబందు సహస్రబాహుపటుశాఖాగ్రార్జునోర్వీజముల్
నేలం గూల్పఁగ, రాజవంశవనులన్ వేమాఱు ఖండించుచున్
మూలచ్ఛేదమొనర్పఁగాఁ, బరశురాముండైన నిన్, మద్గురుం,
గేలున్ ఫాలతలంబునన్ నిలుపుచుం గీర్తించెదన్ మాధవా॥ ౧౫౧

శా॥ శ్రీరామామణితోడి నైక్యమును సూచింపంగ యోచించి, యా
పేరన్ నీవును బిల్వఁగాఁ బడు మనోభీష్టంబుతో నుండ, నో
రా! యాథంబుగ దానిఁ దీర్చఁ గద శ్రీరామావతారంబు? త్వ
న్నారీచోరుఁడు, రావణుండు, చెడె నన్నన్ వింతయే? మాధవా॥

మ॥ బలరామాకృతితోఁ బ్రలంబముఖులన్ భంజించి, కంసాదిదు
ష్టులఁ గృష్ణాకృతిఁ ద్రుంచి, కౌరవముఖక్షోణీశులన్ సంగర
స్థలిఁ జంపించి ధరాభరంబుడుపఁగా జన్మంబుఁ గన్నాఁడ: వె
ట్టులిఁకన్ సంధికి సమ్మతింతురతిదుష్టుల్ కౌరవుల్? మాధవా"॥

మాలిని॥ అని పలుకఁగఁ గృష్ణుండంతటన్ విశ్వరూపం
బును విడుచుచు, "మామా, పోయి నే వత్తునా?" యం
చును సభఁ గల వారిం జూచుచున్ లేచె; దుర్యో
ధనుఁడును జనె మిత్రుల్ తమ్ములున్ వెంట రాఁగా॥ ౧౫౪

---

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబు వా:
రనఘులు వారి పాదముల నోఁదలఁ దాలిచి, దానిలోని భీ
ష్మని చరితంబు గ్రొత్తఁదనముం గన వ్రాసినవాఁడ నేను నే
ర్చిన గతి సెట్టి లక్ష్మీనరసింహసమాఖ్యుఁడ, ధీరసఖ్యుఁడన్॥

సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, దదంతరంగ
కార్యదర్శిని, దన్మహౌదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలక్షణుండ॥



శ్రీ

# ప్రభాసశాపవిమోచనము.

## VI

"వృద్ధుండంచు వయస్సుఁ బట్టి యనుకొంటే కాని విల్లెత్తెనా,
యుద్ధక్షోణిని బూర్ణయౌవనమునందున్నట్టులే భాసిలుం;
గ్రుద్ధుండై చెలరేఁగెనా, ప్రళయరుద్రుండే సుమీ భీష్ముఁ: డా
యాద్ధత్యంబునఁ గాఁక నెవ్వరికి సాధ్యమ్మౌను మానీశ్వరా?॥

సీ॥ కదురట్లు తిన్ననై కదలకుండును గాని,
నడుమును వంచు టెన్నఁడును లేదు;
గుఱి తప్పకుండఁగాఁ గొట్టునే కాని, చూ
పుల లోపమన్న దెప్పుడును లేదు;
గొనయంబు చెవికొనకుఁ లాగుఁ గాని, హ
స్తపటుత్వమేమియుం దఱుఁగ లేదు;
ఊపిరి తిరుగకయుండ బాణముల నిం
చును గాని, బడలుటించుకయు లేదు:

పండు గడ్డముఁ, మీసలుం, బలితకేశ
ములును, మాత్రమే ముదిమిని దెలియఁ జేయఁ,
దేఱి చూడఁ జెల్లని క్షాత్రతేజమునను
గ్రీష్మరవిభంగిని వెలుంగు భీష్ముఁడనిని॥ ౨

క॥ తొమ్మిది దినమ్ములై యొ
క్కమ్మడి యుద్ధమ్ము సలుపుచున్నాఁ; డితరుల్
సొమ్మసిలుచున్నవారలు:
చెమ్మటయుఁ నిటలతటిని జేరదతనికిన్॥ ౩

మ॥ "శతవృద్ధీతఁడు; యుద్ధమేమి సలుపుఁ? సైన్యాధిపత్యంబుఁ బె
ద్దతనంబుం గని యిచ్చినా; రితఁడు చిత్రవ్యూహముల్ పన్నుఁ గా

ని, తనంతన్ విలుపూనఁ,'' డంచు మదిలో నేనెంచితిన్ : మృత్యుదే
వతయే పైఁ బడి మచ్చమూతతిని జంపన్ సాగె భీష్మాకృతిన్॥ ౪

కం॥ విషమును గ్రక్కెడి యాశీ
విషముల కంటెను గరంబు వెఱపు గొలిపి, వి
ద్విషులను రుషమెయి భీష్ముని
యిషువులు ప్రధనంబున వధియించుచునుండెన్॥ ౫

శా॥ నీవుం జూచుచునున్నవాఁడవు గదా నిచ్చల్ దివిన్ నారదా ?
చావుం గోరిన వాఁడె శాంతనవుతో సంగ్రామముం జేయఁగాఁ
బోవుం ; బోయిన వారిలోన మరణంబుం గాంచ లేదంచు గాం
డీవిం జెప్పఁగ వచ్చు : వేఱొకరుఁడేఁడీ చెప్పుమా, చూచెదన్॥ ౬

ఉ॥ ఈతని నేని మన్నఁడని యెంచి తనంత వధింపఁ దాతకుం
జేతులు రాక మానె నని చెప్పఁగ వచ్చు,'' నటన్న ధర్మసం
జాతుని జూచి నారదుఁడు, '' శాంతనవుండసమానశూరుఁడే ;
ప్రీతిని గంటి నాతఁడొనరించిన యుద్ధము నిన్ని నాళ్లనున్॥ ౭

తే॥ గీ॥ కాని, క్రీడి భీష్మునకు సంగరమునందుఁ
జాలఁడను మాటకే నేను సమ్మతింప ;
జామదగ్నికి భీష్ముండు సముఁడటన్న,
హరునకే సముఁడగుఁ గాదె యర్జునుండు ?॥ ౮

ఉ॥ గోగ్రహణంబు నాఁ, డచటఁ గూడిన కౌరవవీరులన్ మహో
దగ్రత వాసవాత్మజుఁడు దాఁకఁ, బలాయితుఁడయ్యెఁ గాదె వీ
రాగ్రణి యయ్యు భీష్ముఁ ? డిపుడాతనికోడునె సవ్యసాచి ? య
య్యో! గ్రహచారమా!'' యనుటయున్ వినయంబునఁ గ్రీడిమౌనితో॥

ఆ॥ వె॥ '' తపసిచంద్ర, నాఁడు తాత పలాయితుఁ
డౌట లేదు ; జితుఁడు నౌట లేదు :
వాఁడె యుదయమయ్యె వంశకరుఁడు శీత
కరుఁడు : వాని సాక్షిగాఁగ వినుము॥ ౧౦

క॥ దక్షిణమున విరటుండు వి
పక్షులతో సలుపుచున్న ప్రధనంబును నీ
వీక్షించుచుంటివో? తగిన
సాక్షివి గావైతి నాదు సమరంబునకున్॥ ౧౧

ఉ॥ ఆహవకాంక్షఁ గర్ణముఖులడ్డఁగ గడ్డుగఁ బోరి నేను స
మ్మోహనమేయఁగా, నొరులు మూర్ఛను మున్గిరి ; తాత నా దెసన్
బాహులు సాఁచి, "వత్స, సుఖవంతుల రే!" యని చేరఁదీసి, సన్
స్నేహముతోడఁ గౌఁగిటను జేర్చుకొనెన్, మెయి పుల్కరింపఁగన్॥

చ॥ "ముదిమిన్ని గన్నవాఁడ, నిటుమున్ను కళంకము గల్గకుండ నా
బ్రదుకునె కాక, యీ భరతవంశపుఁ బేరును నిల్పినాఁడ ; న
య్యది యిఁక నీపయిం బడియె ; నాహవమందుఁ ద్రినేత్రుఁడైన ని
న్నదిరిచి గెల్వ లేఁడనుట యిప్పుడు చూచితిఁ గన్నులారఁగన్॥

క॥ పశువులఁ గొనిపొమ్ము ; జయము
వశమై నీ చేత నుండ, వంశకరుండౌ
శశికిఁ గల కళంకము నీ
యశమునఁ దొలఁగింపు," మంచు ననిపెను నన్నున్॥ ౧౪

ఉ॥ ఓడినవాఁడు కాఁడతఁడు ; యుద్ధతలంబున మ్రాదు ~~సేనలే~~
నేఁడొక పావు వంతె మిగిలెం : దెగెఁ దక్కినవెల్లఁ దాతచే ;
మూఁడవ నాఁడు, నేఁ, డతఁడు ముచ్చెరువుల్ ననుఁ ద్రావఁ జేయ, ము
న్నాడిన మాటయున్ మఱచి, యచ్యుతుఁ డాగ్రహపూర్ణచిత్తుఁడై॥

శా॥ చేతం జక్రము దాల్చి నేల పయికిన్ సింహంబటుల్ దాఁటుచుం
దాతం జంపఁగఁ బోవఁగా నతఁడు, "కృష్ణా, సంశ్రితాభీష్టసం
ధాతా, రాఁగదవయ్య! నీవు ననుఁ జేతం జంపి, నాకిందు వి
ఖ్యాతిన్, మోక్షమునందు, నీయఁగదవయ్యా!" యంచుఁ బ్రార్థింపఁగా॥

చ॥ తెలివిని నేను దెచ్చుకొని దిగ్గునఁ దేరును డిగ్గి, కృష్ణునిన్
బలిమిని బట్టి త్రిప్పితిని : నారద, నీవు కనంగ లేదె? య

బ్బలియుని, భీష్ముఁ, జంపుటకుఁ బాశుపతాస్త్రము నేయ నెంతు; దు
ష్టులపయి దాని నేయుటకె శూలి యొసంగెను గాన మానెదన్॥

ఉ॥ ఏమి యుపాయమిం? '' కన మునీశ్వరుఁ, '' డింతటి రాత్రిఁబార్థులా
రా, మతి దప్పి మీరలిటులారట మొందుచు నుంటఁ జూచి, సు
త్రామునఁడు నన్నుఁ బంపెను బితామహుఁ గూల్చు తెఱంగు తెల్ప: నీ
క్షేమమె కోరుచుండుఁ జుమి క్రీడి, భవజ్జనకుండు నిత్యమున్॥ ౧౮

వ॥ పరమరహస్యమైన కథ పాండవులార, వచింతు: దీని నీ
హరియు నెఱుంగఁడో? యెఱిఁగి, యజ్ఞతయే నటియించుచుండెనో?
విరళముగాఁగ దాని వినిపింతును, శ్రద్ధ మెయిన్ వినుండు: ని
ద్దుర యొదవంగ నీయని కుతూహలతం గలిగించునట్టిదే॥ ౧౯

తే॥ గీ॥ అష్టవసువులటన్న ప్రఖ్యాతి గన్న
యట్టి దేవతల్ గలరు గదా? సదా ము
దాప్రదాయకుల్ వారలు: సుప్రభాసుఁ
డగు ప్రభాసుండు వారిలో నంతిముండు॥ ౨౦

ఉ॥ భానునిభప్రభాసుఁడు, ప్రభాసుఁడొకప్డు వసిష్ఠు నందినీ
ధేనువు భార్యకున్ ముదము దీర్చు నిమిత్తము పట్టుకొన్న, న
ద్దానిని గాచు గుహ్యకుఁడు, దర్పసమగ్రుఁడు, స్థూలకర్ణుఁడెం
తేని శఠించి, మీసమును ద్రిప్పుచుఁ బ్రజ్ఞలు పల్క సాగుడున్॥

భుజంగప్రయాతము॥ ప్రభాసుండు మీసంబుఁ బాపంగ, రోసం
బు భావంబునన్ బిట్టు పుట్టొంది, వాఁడిం
దుభూషున్ మహాభక్తితోఁ గొల్వ శంభుం,
''డభీష్టంబెద్దో తెల్పుమా,'' యంచుఁ బల్కెన్॥

చ॥ పలికిన స్థూలకర్ణుఁడు ప్రభాసుని దుర్ణయమెల్ల నీశుతోఁ
దెలిపి, '' మహేశ, యాతని మృతిం గలిగింపఁగఁ గారణంబనై
యిల జనియింపఁగా వలతు; నింతియ కా,దివె! నాదు మీసముల్
మొలవక చిక్కు పెట్టె: నవి మున్నటియట్లుఁగఁ జేయుమా,'' యనన్॥

క॥ "వెండ్రుకల వరము గోరిన
వాండ్రను మును గాంచ లేదు ; వహ్వారే! నీ
మండ్రాటము గనుఁగొన్నన్,
గుండ్రాలకు నేనియుఁ గరఁగును డెందంబుల్ "॥ ౨౪

తే॥ గీ॥ అనుచు నెకసక్కెమాడిన హరుని గాంచి,
"యర్ధనారీశ్వరా, ప్రక్క నంబ యున్న
నీకు నొక ప్రక్క మీసంబు లేక యేమొ
కరుణ గాంచకుంటివి నాదు గతికి నీవు ?॥ ౨౫

మత్తకోకిల॥ గుండురాలు గరంగు నా వెతకున్ మనంబుల : నిక్కమే;
కొండ కాఁపురముండు చోటయి, కొండకూఁతు మగండవై
యుండు నీకుఁ గరంగకున్నది యుల్ల," మంచును స్థూలక
ర్ణుండు పల్కిన, వానిఁ గన్గొని రుద్రుఁడించుక నవ్వుచున్॥

తే॥ గీ॥ "ఉడుకుకొంటివటోయి ! నీ యడిగిన వర
మీయ నంటినా గుహ్యకా? యీపయి క్షితి
తలమునందంబ యను పేరి తరుణివగుదు :
వపుడు మీసముండుటయె యనర్థకంబు॥ ౨౬

తే॥ గీ॥ ఆ పిదపఁ గ్రమ్మఱం బుట్టి, యర్ధజన్మ
మందు స్త్రీవయి, మిగిలిన యర్ధమందుఁ
బురుషుఁడవు గాఁగ నుందు : వప్పుడె సుమి భవ
దరిమ్మృతికిఁ గారణంబవీవపుడువోయి !॥ ౨౭

క॥ ఆ సరణి భవదరి మెయిం
బాసిన తత్క్షణమునందె ప్రబలములై నీ
మీసమ్ములు మొలుచు," ననం
గా, సర్వజ్ఞుఁ గని స్థూలకర్ణుఁడు మరలన్॥ ౨౮

చ॥ "ఇరుమఱు మానవత్వము వహించి జనింపుమటంచు నాకు నీ
శ్వర, భవదాజ్ఞయా!" యనినశర్వుఁడు, "గుహ్యక, తొల్తమేదినిన్

గరితవుగాఁగఁ బుట్టుకను గాంతువు; పిమ్మటఁ దావకాంశమే
ధరపయి మానవత్వమును దాల్చును: శాయవు గుహ్యకత్వమున్॥

ఉ॥ ఈవటు గుహ్యకత్వము వహించితివె యుండిన వేళఁ, దావకే
చ్ఛావిధిఁ బూరుషత్వమును జానలకీవెరవిచ్చి, వారి కాం
తావిధముం ద్వదంగములఁ దాల్చెడి శక్తిని నీకొసంగితిం:
గావునఁ బెండ్లి మాను,'' మని కాయజవైరి యదృశ్యుఁడై చనెన్॥

ఉ॥ పాండవులార, వింటిరె? ప్రభాసునిపైఁ బగ పట్టి స్థూలక
ర్ణుండిటువంటి పాట్లు పడె; రోషము గన్న వసిష్ఠుచేఁ బ్రభా
సుండు శపింపఁగాఁ బడి, వసుంధర శంతనుపుత్రుఁడౌచు, భీ
ష్ముండను పేరితోఁ బరఁగెఁ జుండి, పితామహుఁడౌచు మీకిలన్॥

క॥ అంబిక ధృతరాష్ట్రు జనని;
యంబాలిక పాండుజనని; యీ యవ్వల కం
టెం బెద్దవ్వ మఱొక్కతె
యంబ యనఁగ నుండె: నెఱుఁగరామెను మీరల్॥ 33

తే॥ గీ॥ అంబ యయి పుట్టుమనియెఁ గదా హరుండు
స్థూలకర్ణుని? నాతఁడే సుదతి యగుచుఁ,
గాశికాధినాథునకు నగ్రసుతగాఁగ
ధాత్రి జన్మించె నంబాభిధానమునను॥ 34

పంచచామరము॥ స్వయంవరంబునందు నంబ సాళ్వుపై మనంబునం
బ్రియంబు గల్గియుఁ వరించె భీష్ము, బ్రహ్మచర్యదీ
క్ష యున్న వానిఁగా నెఱింగి: కాంతలేమి యేనియుఁ
భయంబు లేక చేయు వారె, పంతమూనినట్టిచో॥

తే॥ గీ॥ అనుజుని నిమిత్తమయియె స్వయంవరమునఁ
గూరుచున్నట్టి యా బ్రహ్మచారి యంబ
కోర్కెకొప్పక, తన తమ్ముఁగుఱ్ఱనికపు
డంబికాంబాలికల వివాహంబు చేసె॥ 35

క॥ ఇంపు గొలుపు మాటలఁ, గడు
సొంపు గలుగునట్టి మేని సోయగముల, లా
లింపుల, బెదరింపుల, నొ
ప్పింపఁగ లేదయ్యె నంబ భీష్ముని మనమున్॥ ౩౭

క॥ ఒప్పించు తలఁపు కాదది;
నొప్పించుటె యామె తలఁ: పినుము వలె మనమై
యొప్పని భీష్ముని గనుఁగొని,
యప్పుడఁతుక యాశ లేనిదై పగ పట్టెన్॥ ౩౮

మ॥ పగ యా రీతిగఁ బట్టి, యాతనిని నిర్బంధింపఁగాఁ, జంపఁగా,
భృగురాముండొకఁడే సమర్థుఁడను మాటెవ్వారొ తెల్పంగ, నే
వగనో భార్గవు నాశ్రయించె: నతఁడా వామాక్షి పక్షంబునన్
జగడంబుం గొని తెచ్చి పెట్టుకొనె నచ్ఛాత్రుఁడౌ భీష్ముతో॥

ఉ॥ గట్టునఁ ద్రెవ్వుచుం, గడుపెగాదిగఁ జేతను రాసికొంచు, నే
నట్టటు చాఁచి చూచితి, శరావళి మింటికి మంటికడ్డుగా
వట్టులు వాఱుచుండ, నల వారలు సల్పిన ఘోరసంగరం;
బుట్టటలూఁగె నయ్యెడల నుయ్యెలయట్ల బలెఁ జిత్తమాంబకున్॥

క॥ ఇరువదిమూఁడు దినంబులు
చిరయుద్ధము జరిగి, శిష్యు చేయే మీఁదై,
గురుని చెయి క్రింద కాఁగాఁ,
దరలి మరల నంబ తనదు దారిం బట్టెన్॥ ౪౧

ఉ॥ "ఈవల భీష్ముఁ జంపఁ గలవే?" "యల భీష్ముని నీవు చంపఁగా
లేవె?" యటంచిటుల్ విసువు లేక జగమ్మునఁ గన్న యట్టి వీ
రావళి నెల్ల దానడుగు నంబ; యశక్తిని వారు దెల్పఁగా,
'నీవా?' 'మఱీవా?' 'నీవా?' 'మఱినీవా?' యనుంబురుషుండుకన్పడన్॥

చ॥ "నగల నొసంగు దానఁ, బలు నాణెములీఁగల దాన, ముద్దులీ
యఁగఁ గల దానఁ, గాఁగిళుల నైన నొసంగెడి దాన, సంతయుం

పఁగఁ బని యేమి? కోరు నెడఁ, బ్రక్కకు వచ్చెడిఁ దాన, భీష్ముఁ జం
పఁగఁ గల మేటి,” కంచనును మాటికి మాటికి నంబ వెట్టెఁగా॥ ౪౩

కం॥ ఈ లీల లోకమెల్లను
గాలించియు, భీష్ముఁ జంపఁ గల నరుని గనం
జాలక, యంబ మనంబం
బాలోలుని పయి నిలిపి తపంబొనరించెన్॥ ౪౪

వనమయూరము॥ సాంబశివుఁడంబ పయి జాలి గొని ప్రత్యం
క్షంబయి, “తపంబుడుగు, కామిని! పునర్జ
న్మంబున నె భీష్ము దునుమం గల నరుఁ నీ
కుం బడయనౌ : నతఁడె కూల్చు నని భీష్మున్”॥ ౪౫

కం॥ అని యంతర్ధానంబ
య్యెను ; “మేదిని మీఁద బ్రదుకఁటేఁక నా కేలా?”
యని యంబ యగ్నిలోఁ బడి,
తనువు దొఱఁగె : వింటిగే పృథాసుతులారా?॥ ౪౬

కం॥ అంబ యెచటఁ బుట్టినదో వి
నం బరమకుతూలము మనంబులలో మీ
కుం బొడమెను గద? వినిపిం
తుం బయికథ : వినుఁడు శ్రద్ధతో మీ రెల్లన్”॥ ౪౭

వ॥ అని త్రికాలజ్ఞానవిశారదుండగు నారదుండు పలికి, గొంతు సవరించుకొన నించుక యాఁగఁ, జిఱునవ్వుకన్నులతోఁ గృష్ణుండు జిష్ణుని జూచి॥ ౪౮

కం॥ “నీవంబవు కావు గదా
బావా? యూర్వశి శపింప, భామాత్వము నీ
జీవితమునఁ గొంత కలదు,”
నా విని, యర్జునుఁడును జిఱునవ్వుకనులతో॥ ౪౯

తే॥ గీ॥ "అర్ధజన్మంబునందు నేనాఁడుదానఁ
గాను; నారదా, మా బావగారె యేమొ,
చెప్పు: నరుఁడ నైనట్టి నాచేత భీష్మ
ననిని జంపింతురా?" యన్న నమరమౌని॥ ౫౦

క॥ "నీవును గావయ్యా! యీ
బావయుఁ గాఁడయ్య! మఱొక బావయె యంబా
దేవీద్వితీయజన్మం:
బావిషయముఁ జెప్పు వాఁడ, నాలింపుఁడీఁకన్॥ ౫౧

సీ॥ వసుదేవుఁడు కొమార్తను, సుభద్ర, నీకిచ్చి
యుండుటచే నతండొక్క మామ;
కృష్ణు పెంపకపుఁ దండ్రియు, యశోదాభర్త
యు, నగు నందుండు వేఱొక్క మామ;
నిను వరించిన యులూపిని గన్న కౌరవ్యుఁ,
డురగాధినేత, మఱొక్క మామ;
చిత్రాంగదాపిత, చిత్రవాహనుఁడు, నీ
కొసఁగెఁ బుత్రి: నతండికొక్క మామ;

ద్రౌపదీదేవినిం గన్న తండ్రి, యజ్ఞ
సేనుఁ, డొక మామ: యిందఱిలోన నెవరి
కంబ జనియించెనో తెలియంగ నీవు
వేగిరంపడుచున్నాఁడవే? కిరీటి!॥ ౫౨

క॥ ఇపుడిట ధృష్టద్యుమ్న
ద్రుపదులు లేకుంట నయమె; ద్రోవది యున్నం,
ద్రప చెంది యుండు: నింతటి
విపరీతపుఁ గథను మీారు వినరెన్నండున్॥ ౫౩

శా॥ సంసారాగమహాఫలంబగుఁ గదా సంతానమంచుట్ మదిం
బుంసంతానము గోరుచుట్ ద్రుపదుఁడంభోజాసనామర్త్యర్గా

ట్యంసాపాత్రుని, భక్తకామితసదాసంధాయకుఁ, దైవతో
త్తంసుఁ, శైలసుతామనోరమణుఁ, దాత్పర్యంబునం గొల్వఁగా॥

లయగ్రాహి॥ మౌళిపయి గంగ యొక మూల నొదుఁగంగ, సగ
పాలు తనువందు మలచూలి యిముడంగ,
ఫాలమున మన్మథుని గాలిచిన క, న్నలుత
హాలహలపానభవనీలరుచియుఁ, స
చ్ఛీలమును, లోకపరిపాలనమునుం, దెలుపఁ
జాలు పెను గుర్తులుగఁ గ్రాల, వలకేలఁ
శూలమును దాలిచి, కృపాళుఁ, డగజాహృదయ
లోలుఁడు, నృపాలునకు మ్రోలఁ గనుపట్టెన్॥

మత్తకోకిల॥ "యజ్ఞసేనుఁడ, నీవు కోరిన యట్టులే యగు," నంచు స
ర్వజ్ఞుఁడానతి యిచ్చినట్టి వరంబుఁ బట్టియె పట్టపుఁ
రాజ్ఞి, కోకిల, గర్భమూనఁగ, రాజు తత్సతి కోర్కెలే
యాజ్ఞలట్లుగ నెంచి, కోరినవన్నియుఁ సమకూరిచెన్॥

ఉ॥ భూవరుఁడొక్కెఁడే సరస ముచ్చటలాడుచునుండఁ గోకిలా
దేవి హఠాత్తుగా, నెలలు తిన్నగ నిండక మున్నె, నొప్పులుఁ
లేనక యుండఁ, గాన్పు నవలీలగఁ గాంచెను; బుత్రు నారయం
గా వసుధేశుఁడత్యధికకాంక్షను వంగఁగ, నేమి చెప్పుదున్?॥

క॥ పుత్రుఁడు కాఁడు; విచిత్రపుఁ
బుత్రిక జనియించె; నెమిలిపురి వంటి కురుల్
గాత్రమును గప్పె బిడ్డకు:
ధాత్రిని బుట్టుదురె యీ విధంబగు శిశువుల్?॥ ౫౮

తే॥ గీ॥ వెంద్రుకల వరంబును మున్ను వేడె స్థూల
కర్ణుఁడంబరకేశుని గావున నె శి
ఖండి పింఛంబటు పొడవు గాఁగ నీ భ
వంబునం దల వెండ్రుకల్ వచ్చె నేమొ?॥ ౫౯

తే॥ గీ॥ "పురుషసంతానమును గోరి హరుని నేను
గొల్వఁగా, నాదు కోర్కి చేకూరు నన్న
యయ్యమోఘవచస్కు వాక్యమ్ము వమ్ము
గాఁగ నాఁడు సంతానంబు గలిగె నేల?॥ ౬౦

క॥ అఘటనఘటనాచణుఁడై
న ఘనుని నుడి తప్పినదని నమ్ముటయే య
త్యఘము ; సుతను సుతునిగ మా
రఘుస్మరుఁడు మార్పఁ గలఁడు క్రమముగ నింకన్॥ ౬౧

తే॥ గీ॥ అంతపర్యంతమియ్యది యాఁడు బిడ్డ
యంచు నెవ్వరికిం దెలియంగ నీయ
రా," దనుచుఁ దలంచి ద్రుపదరాజు, శిశువు
రోదనము విని వచ్చిన దాదులఁ గని॥ ౬౨

ఉ॥ "అంగనలార, రాణి గిరిజాధిపుఁడన్న తెఱంగునన్ సుపు
త్రుం గనె; మంత్రసానులను దోడ్కొని వేగము రండు: వారు చే
యంగ సమర్థమేమొ పురుటాలికి నయ్యవి చేయ నిండు; పు
త్రుం గొనిపోయి, నే జరుపుదున్ జరుపం దగినట్టి కృత్యముల్॥

చ॥ ఇది పరమేశువానతి : మఱెవ్వరుఁ బిల్లని ముట్ట రా," దటం
చుఁ దన తనూభవన్ మఱుఁగుచోటికిఁ దోడ్కొని పోయి, తానె బొ
డ్డు దెగఁగఁ గోసె, నేర్చిన యటుల్ పసి బిడ్డకు నీళ్లు పోసెఁ, జే
యఁ దగినవెల్లఁ జేసె, నహహా! మగమంతరసాని యాతఁడై॥ ౬౪

శా॥ సూనుండీశ్వరసత్కృపం గలుగు నంచున్ నమ్మికొన్నట్టి దే
శానం దల్లి తదర్హవస్త్రతతి జాగ్రద్బుద్ధిఁ జేకూర్చె! న
వ్వానిం గొన్ని తనూజకుం దొడిగి, భూపాలుండు చూపించె, "వీఁ
డే నా నందను!" డంచు బంధులకుఁ, దానే చుట్టునుం ద్రిప్పుచున్॥

క॥ "ముఖమచ్ఛముగాఁ దంద్రిదె ;
శిఖిపింఛముఁ బోలు కురుల సిరి తల్లి," దటం

చఖిలజనులందు కతనక
శిఖండి యని నామమిడిరి శిశువును గనుచున్ ''॥ ౬౬

వ॥ అని చెప్పుచున్న నారదుని కథకు భీముఁడడ్డు వచ్చి యర్జునుని మొగము గనుఁగొని॥ ౬౭

ఉ॥ '' అంగన రూపు లేని మన యవ్వ శిఖండి!'' యటంచు నవ్వెఁ; జా
టుం గనుచుక నగెక నకులుఁడుక; సహదేవుఁడు, '' పెద్దబావ యూఁ
డంగులలోననే జమపడంగను లెక్కిడువా, '' రటంచుఁ గ
న్నుంగొనలందు లేనగవు నూల్కొనఁ బల్కుచుఁ జూచె భీమునిన్॥

క॥ '' నవ్వుఁడు! నవ్వుఁడు! మును మీ
యవ్వ యగునో కాఁడో కాని యాతండే మీ
క్రొవ్వడఁచుచున్న భీష్ముని
జివ్వను జంపించు, '' నంచు శ్రీకృష్ణుఁడనెన్॥ ౬౯

తే॥ గీ॥ '' ధాతృపుత్రకా, చెప్పు; మేరీతిగా శి
ఖండి యాదిని స్త్రీ యయి యుండి, తుదకుఁ,
బురుషుఁడయ్యెనో ? '' యని యుధిష్ఠిరుఁడు తన్నుఁ
గోర, నీ తీరుగాఁ బల్కె నారదుండు॥ ౭౦

చ॥ '' ఇరువదియైదు వత్సరములిట్లు శిఖండిని బెంచెఁ దండ్రి ; నె
ల్లరుఁ బురుషుండటంచునె తలంచిరి కాని, నెలంత యంచు నొ
క్కరికిని సంశయంబు గలుగం దగు పీలొదవింపకుండఁగాఁ
దిరిగె శిఖండి ; నెమ్మోయి సతీత్వపుఁ జిన్నెలు తక్కువామెకున్॥ ౭౧

సీ॥ ఎగ దువ్వుకొని కోర సిగఁ జుట్టునే కాని,
కొప్పుగా ముడువదు కురులు తరుణి ;
నిడువుగా సిందూరమిడుకొనుఁ గాని, కుం
కుమ బొట్టు పెట్టదాస్యమున రమణి ;
వదులుగా నున్నట్టి ముదుగు జుబ్బా దాల్చుఁ
గాని, తొల్చదు రవికను బడంతి ;

వెనుకకుఁ బంచెను విఱిచి గట్టిగఁ గట్టుఁ
గాని, మేనం జీరఁ గట్టదింతి ;

వీణ ముట్టదు, నగలును విరులడుగదు ;
సాము చేయును, గుఱ్ఱపు స్వారి చేయు ;
జనకుఁడొసఁగిన యట్టి యాజ్ఞలను బట్టి
నాతిగా నున్న కాలమునఁ శిఖండి॥ ౭౩

శా॥ "శయ్యావేళలయందె కాక మఱి నిచ్చల్ హద్దుగా ముద్దుగా
నయ్యఁ వీడక మా నృపాలతనయుండాఁడంగి చందంబు వాఁ
డయ్యెం : 'బూరుషులన్న సిగ్గుపడు, స్త్రీలన్నఁ మొగంబెత్త లేఁ;
డయ్యో! యెట్లుగఁ బెండ్లి చేసికొని భార్యం దృప్తి నొందించునో?॥

ఉ॥ బిడ్డల తండ్రి కాఁడె, పిత పెండ్లి యొనర్పకసడ్డ చేయుటే
యడ్డము కాని; యిప్డిరువదైదవ యేఁడును వచ్చె ; మీసముఁ,
గడ్డము, మొల్వ లేదనినఁ, గాయశరీరము వారికల్లె," యం
చడ్డముదిడ్డమా నుడువులాడఁ దొడంగిరి లోకులయ్యెడన్॥ ౭౪

తే॥ గీ॥ పెండ్లి చేయఁగాఁ బోయినం, బెద్ద చిక్కు
గలదు : పురుష వేషంపు శిఖండి కొఱకు
వధువును వెదుక వలయునో ? వనిత నైన
కతన నామెకై వరు వెదుకఁగ వలయునో?॥ ౭౫

తే॥ గీ॥ ముందు నూయి వెన్కను గోయియుం దగులుచు,
ద్రుపదు మనమునకేమియుం దోఁచదాయె ;
"ఓయి పరమేశ్వరా! యేమి చేయుదు ?" నని
చింత చేసి, చింతను జేసి, చింత చేసి॥ ౭౬

ఉ॥ "భారము నీదె యోయభవ! పాలను ముంచుము, నీళ్లముంచు; నేఁ
గోరిన యట్లు నాకుఁ గొడుకుం గలిగించెద నంటివే కదా ?
పూరుషుఁడే శిఖండి యని పూర్తిగ నమ్మితిఁ గాన, నేమి కా
నీ! రతి వంటిదా రమణినే జతకూర్చెద మా శిఖండికిన్॥ ౭౭

తే॥ గీ॥ కాలి బూడిద యైన మగని మగుడఁగ
రతికి బ్రతికించి నీవొసంగితివి కాదె ?
మగ బ్రతుకొసంగి, నాదు కొమార్త నిపుడు
కోడలికి భర్తగా నీవు కూర్ప లేవె? ౭౮

ఉ॥ విశ్వము పూరుషుండవని వెఱ్ఱిగ నిన్నను ; నీకు నర్ధనా
రీశ్వర, లింగభేదమొకయింతయు లేదు ; మనుష్య దేహముల్
శాశ్వతమైనవెట్లగును ? జావఁగ వచ్చును; మాఱ వచ్చుఁ : ప్రద్యు
మ్నా, శ్వశురుండ నాదు నొక కన్నియకే,"యని యాతఁడంతటన్॥

చ॥ సొగసగు రాజకన్యకయి చూడ, దశార్ణము నేలు హేమవ
ర్మ గనిన పుత్రి, హైమవతి, రంభకు వంకలు దిద్దు మేలి సొ
యగము గలట్టిదై, చదువులందు సరస్వతితోడ సాటిదా
టఁ గని, వివాహముఁ సలిపెఁ డక్కులమారి శిఖండికాబిడన్॥

క॥ శోభనపు రాత్రి దంపతు
లే భంగిఁ జరింతురో యని యే సందులలో
నో భామలు కనులుంచం
గా, భావజు కేళి గదిని గనఁబడదయ్యెన్॥ ౮౧

క॥ ఎడ మొగమై, పెడ మొగమై,
సడి చప్పుడు లేక యుండ జంపతులు పదం
పడి రెండు రాత్రులీగతిఁ
గడపఁగఁ, జెలికత్తెలాశిఖండిం గనుచున్॥ ౮౨

క॥ "ఏమని నినుఁ బొగడుదుమో
యీ మఱఁదీ ? యొడలు నలుఁగు నేమో యని మా
హైమవతి నొక్క మాఱు స
హా ముట్టవు : నీవహా ! మహారసికుఁడవే !" ౮౩

క॥ నీచేతను బడుచున్నది
మా చెల్లెలటంచు మేము మదుల బెదరఁగా,

నో చెల్ల ! నీవు ముట్టవు,
మూచూడవు, చంపకసుమమును దేఁటి యటుల్॥ ౧౪

క॥ వీఁపును వీఁపు నొకించుక
రాపాడింపంగ రాదె ? రతిసమయములన్
స్త్రీపురుషులకు శరీరము
లాపాటిగ నైనఁ దగులుటవసరమేమో ?॥ ౧౫

క॥ మీసము నీకుండమిఁ జెలి
బేసరి చిక్కుపడు నన్న బెంగయు లేదే ?
మా సఖి పెదవుల కేమియు
రాసికొనవు : ముద్దు పెట్ట రాదా మఱఁదీ ?॥ ౧౬

క॥ చక్కనిదై, వయసొడలిని
బిక్కటిలుచు నున్న క్రొత్త పెండ్లికొమార్తం
బ్రక్కను బెట్టుకొనుచు, నీ
కెక్కరణిని నిద్ర వచ్చె ? నిది వింత గదా ?॥ ౧౭

క॥ మగతనము లేదొ ? మా వలె
మగువవొ ? సిగ్గో ? భయంబొ ? మాపటికిన్ నీ
దు గదికి మాలో నొకరము
తెగించి వచ్చెదము, నిజము తెలిసికొనుటకై"॥ ౧౮

క॥ అని యెకసక్కెములాడిన,
విని వినని యటుల్ నటించి, వేఁట యను నెపం
బున నా శిఖండి చేరువ
ఘనాటవికి నేగి సావకాశముగాఁగన్॥ ౧౯

శా॥ రాగాలాపముఁ బోలె రోదనము నారంభించి, "నా గుట్టికన్
దాఁగం బోవదు ; నవ్వులాటలకుఁ బాత్రంబౌను జీవం ; బసు
త్యాగంబే గతి నాకుఁ : గైకొనుమిదే తండ్రీ, నమస్కార ! మ
మ్మా, గర్భంబునఁ గంటివేల ననుః" నంచాక్రోశముం జేయఁగా॥

చ॥ అచటికిఁ జేరువం గల గుహన్ నివసించెడి స్థూలకర్ణుఁ, "డే
మి చెపుమ? స్త్రీవిలాపము సమీపమునన్ విన వచ్చె!" నంచు నే
డిచెడి శిఖండి చెంతకు వడిం జని, మిక్కిలి యోర్పుతోఁ దదీ
యచరితమాలకించి, హృదయమ్మునఁ బూర్తిగ జాలి గ్రమ్మఁగా॥

చ॥ "వగవకుమమ్మ చెల్లెల! వివాహము మానిన వాఁడ నేను; నా
మగతనమిష్టు నీకు నొక మాసము నేనెరవిచ్చి, నీకు మో
యఁగ భరమై కనంబడిన యాఁడుఁదనంబును నేను దాల్తు: న
మ్మగువలకున్న యట్టి యనుమానము మానిచి ర," మ్మనంగ నే॥

ఉ॥ ఆఁడుఁదనంబు గుహ్యకునికబ్బె; శిఖండికిఁ బూరుషత్వముం
గూడెను: మాసమప్పటికి గుహ్యకు మోమున లేదు కావునం,
బేడితనంపు రూపు గని, పెండ్లికొమారితతోడ మన్మథ
క్రీడను గూడు వేడ్క నరిగెం ద్వర గల్గి శిఖండి యింటికిన్॥ ౯౩

క॥ ఆ నాఁటి రాత్రి హైమవ
తీనవసుమగాత్రికిఁ దమి తీఱఁగఁ బురుషుం
డైన శిఖండి యఖండము
గా నడిపె మనోజకేళి ఘనమగు బాళిన్॥ ౯౪

క॥ ఇంచువిలుతు పని యూరం
భించుటకాతండు లేవ, బిడియ పడి వడిన్
మంచము క్రింది చెలి సకియ
చుంచటులచ్చోటు విడుచుచుం బరుగెత్తెన్॥ ౯౫

శా॥ సంగంబున్ విడనాడినట్టి మునినై, సంభోగశృంగారమే
భంగిం జెప్పఁ గలం? ప్రబంధకవి యెవ్వండో తగుల్కొన్నచో,
శృంగారంబని పచ్చి బూతులనె వర్ణించుం జుఁడీ హైమవ
త్యంగాలింగనమాదిగాఁ గల రహస్యంబైన సంకృత్యంబులన్॥ ౯౬

క॥ ఒక మాసముననె యేఁడా
దికిఁ దగిన సుఖంబు పూర్వుఁదేనె గతి జనిం

చు కతన, హైమవతీహృ
న్మృకుళము వికసించె నతిమనోహరసుమమై॥ ౯౭

ఉ॥ మానసము నిండఁగా, మొదటి మాటను బట్టి శిఖండి గుహ్యకుఁ
డాసి, "సతీత్వమేఁ, మగతనంబును నీవు, ధరింత," మన్న, "న
బ్జాసను వ్రాఁత రీతి యటులైనటు తోఁచ," దటంచు దీనమౌ
హాసముతోడ గుహ్యకుఁడుదంతముఁ దెల్పె శిఖండికీగతిన్॥ ౯౮

మ॥ "పురుషత్వంబెరవీవు గైకొనిన యాప్రొద్దే కుబేరుండు సా
దరుఁడై నన్పిలిపించి, "నందిని నిమిత్తంబై వసిష్ఠాశ్రమాం
తరమందీవు వసించి యుండ, భవదుద్వాహార్థమై యాత్మలోఁ
జిరకాలంబుగ నున్న నాదు తలఁపుం జెప్పంగ శంకించితిన్॥ ౯౯

క॥ ఆ పనికి నిన్ను వలదని
తాపసి మఱి యొకనిఁ గొనుటఁ, దప్పినదచటం
గాఁపురమీవుండుట : మఱి
నీ పెండ్లికికడ్డు లేదు నిక్కముగాఁగన్॥ ౧౦౦

క॥ రంభకు జన్మించిన యుప
రంభ యనెడు నాదు మనుమరాల్ గలదు గదా?
శంభళిచేఁ గబురంపెను
జంభారియె కన్నెఱికము సలుపుదు ననుచున్॥ ౧౦౧

క॥ సానిగ నొనర్పకుండఁ
దానిని సంసారిణిగ నొనర్పఁ దలంచేఁ
మా నలకూబరుఁడెద; నా
మేనల్లుని క్రింద నిన్ను మేనక కనుటన్॥ ౧౦౨

తే॥ గీ॥ నావివరుసలు కలిసిన వాఁడవీవ
టంచు నీకు దానిని వివాహంబు చేయఁ
దలఁచితిని; నీవు కోరిన ధనము నీకుఁ,
గట్నమిత్తునురా స్థూలకర్ణ," యనిన॥ ౧౦౩

తే॥ గీ॥ నెన్నొసటఁ గరాంజలిఁ జేర్చి నేను, "దేవ,
తావకానుగ్రహంబుచే ధన్యుఁడనయి
నాఁడఁ, గాని నేను వివాహమాడకుండ
శివుఁడు మును ననుఁ గట్టడ చేసె," నంటి॥ ౧౦౪

క॥ "శివుఁడు మదీయసఖుఁడె; నీ
వివాహమున కొప్పు," నని కుబేరుండన, నే
వ్యవధిం గోరితి; నాతం
డు వికారపుఁ జూపుతో ననుం గనుఁగొనుచున్॥ ౧౦౫

తే॥ గీ॥ "నీల్గుచున్నాఁడవఁటర?" యంచెల్గు నెత్తి,
గర్జనము సేయ, నే గజగజ వడఁకుచు,
మగతనము నెరవిచ్చిన మాట నపుడు
చెప్పితి; నతండు కనులెఱ్ఱచేసి నన్ను॥ ౧౦౬

తే॥ గీ॥ "ఓరి దౌర్భాగ్యుఁడా! దేవుఁడొసఁగినట్టి
మగతనము నీకు భారమై మార్చుకొంటి
వఁటర? నీవు కోరిన యట్లె యిటు పయి నిఁక
నాఁడుదానవై యుండరా!" యని శపించె॥ ౧౦౭

క॥ "శాపాంతము దెలుపుము దే
వా, పదములు పట్టుకొంటి," నని నే వేడం,
గోపముడిగి యాతం, "డో
రీ, పురుషుఁడవగు శిఖండి మృతి గనినంతన్"॥ ౧౦౮

చ॥ అని కరుణించెఁ; గావున నృపాత్మజ, నీ పురుషత్వమిద్ది నీ
కు నిలుచు మేర గలంత," కని గుహ్యకుఁడిట్లు శిఖండితోడఁ దె
ల్పెను; వినుచుంటిరే?" యని నిలింపతపస్వి వచించి, ధర్మనం
దనుఁ గనుచుఁ, "శిఖండి వలనన్ నెఱవేర్చుకొనుండభీష్టమున్॥

చ॥ మునుమును నాతివై, యిపుడు మూతిని మీసము లేకయుంట నం
గన వలెనే కనంబడు శిఖండిని ముందటఁ బెట్టుకొంచు న

ర్జునుఁడనిలోఁ దనుం గదియుచోఁ బెడమోమును బెట్టు భీష్ముఁ: డా
తని దయమాలి యర్జునుఁడు ధాత్రిని గూల్పఁగ వచ్చుఁ దూపులన్॥

క॥ ఆపాటి పాటవము నరు
తూపులకే కల,'' దనుచుఁ జతుర్ముఖు సుతుఁ, డ
త్తాపసి తెలిపిన, దైన్యము
దోఁపఁగ ధర్మజుఁడు మౌనితో నిట్లనియెన్॥ ౧౧౧

మ॥ ''అయయో! క్షత్రియ ధర్మమెంత కఠినంబైనట్టిదో మౌనిపు
ర్య! యథార్థంబగు ప్రేమతోడ మము బాల్యంబాదిగాఁ బెంచి మా
ప్రియమే కోరెడునట్టి తాత, ననఘుం, భీష్ముం, రణక్షోణి ని
ర్దయమైఁ గూల్పఁ దలంచుచుంటి, మిటుదుస్తంత్రంబు కల్పించుచున్॥

ఉ॥ తాతనె కాదు; మద్గురులఁ, దమ్ములఁ, బుత్రులఁ, దక్కు బంధులం,
జేతులతోడఁ జంపుకొని, చిత్తడి నెత్తుటిచేతఁ గన్న యీ
భూతలమీను సస్యఫలముల్ పలలాశి వలెం భుజింప, నా
చేతము సమ్మదింప: దని చేయక పోయెదఁ గానకే'', యనన్॥

ఉ॥ కయ్యపుఁదిండిమౌని తమకమ్ము మొగమ్మునఁ గానిపింపఁగా
నయ్యమనందనుం గనుచు, ''నాహవమిప్పుడు మానుకొందువా?
యయ్యయొ! విన్న వారు నగరా? గురుబంధుల నేను జంప లే
నయ్య!'' యటంచు నీవలెనె యాడె రణాదిని 'గ్రీడి కృష్ణుతో॥

క॥ ఈవలఁ బాండవసైన్యం;
బావలఁ గౌరవుల సైన్య: మా నడుమను గాం
డీవి రథంబు పయిం దుః
ఖావేశంబు మెయి నొఱగ హరి సస్మితుఁడై॥ ౧౧౫

తే॥ గీ॥ ఉపనిషత్సారమగు జ్ఞానమురుకృప నుప
దేశమొనరించెను: భగవద్గీత యనఁగ
వాసి గనఁ గలదది, భగవంతుని యుప
దేశమావేశమునఁ బాట తీరు గనుట॥ ౧౧౬

వ॥ ఆ యుపదేశమునకు సారాంశ మేమనిన॥ ౧౧౭

తే॥ గీ॥ ఆత్మ నిత్యమటన్న సత్యంబెఱిఁగిన
జ్ఞానవంతులు చంపుట, చచ్చుట, యను
మాట, లర్థవిహీనము లౌట శోక
మందరు గతాసులకు, నగతాసులకును॥ ౧౧౮

తే॥ గీ॥ కర్మములొనర్చుటకె యధికారము నరు
లకుఁ గలదు; లేదు కర్మఫలంబులందు;
లేశమేనియు మదుల ఫలాశ లేక
నరులు విహితకర్మంబులొనర్ప వలయు॥ ౧౧౯

తే॥ గీ॥ విహితకర్మంబు క్షత్రియవీరులకు స
మిత్తు చేయుట; వారు నిమిత్తమాత్రు
లగుటయే కాని, స్వయముగా నంతయు భగ
వంతుఁడే చేయుచుండు ధ్రువంబుగాఁగ॥ ౧౨౦

క॥ అనుటకుఁ దార్కాణముగ న
రునకుఁ హరి తనదు విశ్వరూపము చూపిం
చెను; ధర్మనందనా, నీ
వని సేయుము భారమెల్ల హరిపై నిడుచున్॥ ౧౨౧

క॥ చేకుఱు జయము, సిరియు, నీ
కో కామవికారదూర, యోగీశ్వరుఁడౌ
శ్రీకృష్ణుండు, ధనుర్ధరుఁ
డౌ కవ్వడి, నీదు పక్షమందుండుటచే॥ ౧౨౨

ఉ॥ పోయెదఁ బార్థులార! రణభూమియె తేపటినుండి సెజ్జ గాం
గేయునకుం; దదీయరణకేళిని ముందిఁకఁ జూడఁ బోము; త
త్సాయకచాతురిం గనఁగ సత్వరమే చనుదెంతు నెల్లిఁ; గృ
ష్ణా, యిఁకఁ బోయి వత్తు: సెలవా?'' యని నారదుఁడేగె మింటికిన్॥

మ॥ మఱునాఁడైన మహారణంబునను భీష్మగ్రీష్మతీవ్రాంశుఁడం
పఱయన్ రశ్మిని శాత్రవాళిఁ బెనుతాపంబొందఁగాఁ జేయు నే
డ్తైఱ బీభత్సపయోధరంబు శరవృష్టిం గొంత వారించె, ని
వ్వెఱపాటొందుచు నారదాదులు వియద్వీథిన్ విలోకింపఁగన్॥

శా॥ ఆఱం బోవునెడన్ మహోజ్జ్వలతరంబై మించు దీపంబటుల్
మీఱెన్ భీష్మ ప్రతాపమత్తఱి; రిపుల్ మిత్రుండటంచున్ రవిం
దూఱం జొచ్చిరి: యంత కంటెను మహాదుర్దాంతమౌ వేఁడిలోఁ
దూఱం గల్గిరి గాదె వారు రణమందున్ భీష్ముతోఁ బోరుచోఁ?॥

మ॥ అపరాహ్ణంబగునంతకిక్కరణి భీష్మార్కుండు కన్నెత్తుచున్
రిపుసంఘాతము చూడఁ జెల్లని వినిర్ణిద్రప్రతాపంబుఁ జూ
పి, పటుత్వమ్మొక యింతగా సడలు దీప్తిం దోఁపఁ, గృష్ణుండు తే
రపుడత్యంతరయంబునం బఱపి చేరం బోయె గాంగేయునిన్॥

చ॥ "బడలితి నంచు నాపయికిఁ బార్థుని దెచ్చుచు నుంటివా, హరీ?
కడు వడి రమ్ము, ఫల్గున! మగంటిమి గల్గిన జోదుఁ గన్న, నా
యొడలు నవీనసత్త్వమున నుబ్బ," నటంచును భీష్ముఁడాజికిం
గడఁగఁ, గిరీటి చాటున శిఖండి బయల్పడియెం దటాలునన్॥౧౨౭

క॥ తెర మీఁది బొమ్మ తెఱఁగున
నరుని వెనుకనుండి వెడలిన శిఖండి రథాం
తరమునఁ దదగ్రమునకున్
జరుగఁగ భీష్ముండు మొగము చప్పనఁ ద్రిప్పెన్॥ ౧౨౮

చ॥ పెడమొగమై రణంబుకుఁగు భీష్ముని గొట్టఁగఁ జేతులాడ, క
య్యెడ వెనుదీయు నర్జునుని గృష్ణుఁడు గాంచి, ప్రభాసుఁడుర్వి భీ
ష్ముఁడగుట, యాతనిం దునుమఁ బుట్టె నరుండతఁడౌటయున్, మదిం
బొడఁగనఁ జాలు దివ్యమగు బోధము గల్గఁగఁ జేసెఁ గ్రీడికిన్॥

తే॥ గీ॥ అజ్ఞతఁ దొఱంగి నరుఁడు నారాయణు వచ
నములఁ బట్టి భీష్ము పయిఁ దీవ్రములగు బలు

నారసంబులు మేనెల్ల నాట నేయ
హరిహరీ! యంచు రథమున నాతఁ డొఱఁగ॥ ౧౩౦

క॥ ప్రసవమ్ములు ముసురుగ సుర
నిసరము కురిపించె; నరుని విజయమునకుఁ గా;
వసువులు దొఱంగి భీష్ముఁడు
వసువులలోఁ గలియ మరల వచ్చు నటంచున్॥ ౧౩౧

చ॥ "అరదమునుండి డింపు విజయా! శరముల్ మెయి నిండ నాటినన్,
హరి కృప నేమొ, బాధ యిసుమంతయు లే; దయినన్, మృతిన్ సమి
ద్ధరణిఁ బరుండఁబె క్షాత్రవుల ధర్మము సు," మ్మని యన్న భీష్ము నా
దరమున డించె నర్జునుఁడు ధాత్రికి బాష్పనిరుద్ధనేత్రుఁడై॥ ౧౩౨

ఉ॥ కూలెను భీష్ముఁ డన్న పలుకున్ విని కౌరవపాండవుల్ మదుల్
డీలుపడంగఁ, దేరులను డిగ్గి, శిరంబుల వ్రాల్చి, మౌనముం
దాలిచి, యా మహారథుఁడు ధాత్రిపయిం బడి యున్న చోటికిం
గాళుల నీడ్చుకొంచుఁ జని, కాంచిరి కన్నుల నీళ్ల నాతనిన్॥ ౧౩౩

చ॥ "వగవకుఁ డయ్యలార! శతవత్సరముల్ మనినాఁడ నేను; శూ
రగణము కోరఁ దగ్గ సమరస్థలిచావు లభించుచుండె; బా
ధ గలుగకుండ నాకు శరతల్పము మర్చెను పార్థుఁడే: సుఖం
బుగ శయనించువాఁడ నసుమోక్షణకాలము దన్క దీనిపై॥ ౧౩౪

తే॥ గీ॥ దక్షిణాయనమృతి పుణ్యదాయకంబు
కాదు; సూర్యుని మకరసంక్రమణమునకు
మీఁది మాఘశుద్ధైకాదశీదివసము
పరమపుణ్యప్రదంబని పల్కఁబడును॥ ౧౩౫

క॥ అది నేఁటికి నలువదియెని
మిదవ దినంబగును: నేను మృతి నాఁడే కాం
చెద; నంత వఱకు బ్రదికెద,
మదీయగురుదత్తవరసముచితమహిమన్॥ ౧౩౬

చ॥ ఒకఁడనె యుద్ధభూమి నెటులుందు నటంచును మీరు సంశయిం
పకుఁడు : ధ్రువుండు, సప్తఋషిమండల, మాదిగఁ గల్గు దివ్యలో
పికమెయి రాత్రులం గనులు పెట్టి నన్నుం గనఁగాఁ, బగళ్లఁ జో
రికిఁ జనుదెంచి మీరిటఁ జరింపఁగ, నొంటరిపాటు గల్గునే?॥ ౧౩౭

క॥ శీతాతపవాతాదులు
నా తనువును సోఁకకుండ నాపైని జగ
న్నేత, కృపానిధి, హరి యది
గో! తన చక్రంబుఁ బెట్టె గొడుగు విధానన్॥ ౧౩౮

తే॥ గీ॥ సందియము మాని చనుఁడు మీ సదనముల," క
టంచు భీష్ముఁడెల్లరను బంపించివైచె;
నచటికించుక యెడముగా నా మఱుచటి
దినమునుండియు జరుగ సాగెను రణంబు॥ ౧౩౯

తే॥ గీ॥ ద్రోణుఁడైదు దినములు, కర్ణుండు రెండు
దినములును, శల్యుఁడొక యర్ధదివసమును, సు
యోధనుండర్ధదినము, సైన్యాధిపత్య
మును వహించి, కావించిరద్భుతరణంబు॥ ౧౪౦

మ॥ మగవాఁడై యభిమన్యుఁడాలమునఁ బద్మవ్యూహముం జొచ్చి పో
వఁగ సాయంబుగ నేగు భీమముఖులన్ వారించి యా బాలుఁడీ
ల్గఁగ మూలంబయినట్టి సైంధవుని గూల్పన్ దుర్ఘటంబౌ ప్రతి
జ్ఞఁ గడున్ రోషముతోడఁ జేసి, యటులే సల్పెన్ నరుండేపుమై॥

శా॥ "అశ్వత్థామ గతించె, నేనుఁ,"గను వాక్యంబర్ధమే వించు, స
త్యైశ్వర్యుండగు ధర్మసూను వచనంబాలన్ సుతుండీల్గె నన్
విశ్వాసంబున ద్రోణుఁడూపిరిని బంధించెన్ : గురుండట్లు న
ష్టశ్వాసుండయి చావఁగోసె మెడ ధృష్టద్యుమ్నుఁడుగ్రమ్ముగన్॥

మ॥ భృగురాముండరుదెంచెనో, మగుడఁగా భీష్ముండె యేతెంచెనో,
పగఱం జంపఁగ నంచు వైరులు భయభ్రాంతాత్ములై చూచున

ల్లుగఁ బోరాడిన కర్ణుతేరి యొక కల్ భూమిస్థలిం గ్రుంగఁగాఁ
దెగటార్చెన్ నరుఁడట్టి వీరు, శపథోక్తిన్ నిల్పుకోఁ గల్గుచున్॥ ౧౪౩

ఉ॥ శల్యుని జంపె ధర్మతనుజాతుఁడు ; శౌర్యమునందుఁ దండ్రితోఁ
దుల్యులఁ గర్ణపుత్రులను ద్రుంచె నరిన్ నకులుండు; ప్రాణవా
యుల్యము పాలుగా, శకుని నుక్కడఁచెన్ సహదేవుఁ; డస్త్రముల్
కుల్యాలుగాఁగఁ బాఱునటు కూల్చిరి సేనల భీమఫల్గునుల్॥ ౧౪౪

మ॥ దౌరకం బైఁబడి, ధార్తరాష్ట్రుల నొగిం దున్మాడె, నున్మాదబం
ధురుఁడై కర్ణముఖుల్ కనుంగొన నరిన్ దుశ్శాసనోరస్సునె
త్తురు గుండెం బెకలించి త్రావె, గదతో దుర్యోధనోరుద్వయిన్
సరి యుద్ధంబని కొట్టె, భీముఁడు ప్రతిజ్ఞాపూర్తియౌనట్లుగన్॥ ౧౪౫

శా॥ భద్రస్వాంతులు పార్థులచ్యుతునితోఁ బైకేగి యుండంగ, సా
క్షాద్రుద్రుండటు వేలమందుఁ బడి ధృష్టద్యుమ్నునిన్, వానితో
నిద్రాసక్తుల ద్రౌపదేయుల, శిఖండిం, జంపె నుద్రిక్తుఁడై
యా ద్రోణాత్మజుఁ డర్ధరాత్రమున, యుద్ధాంతంబు జేసె ననన్॥

క॥ శరతల్పంబున నుండియె
జరిగినవెల్లయును వినుచు శాంతనవుఁడు భూ
భరమును దొలఁగించెడి శ్రీ
హరి చర్యలఁ దలఁచి, పొందె నాశ్చర్యంబున్॥ ౧౪౭

ఉ॥ "పూజ్యులఁ, బ్రేమపాత్రులను, బుత్రుల, భ్రాతల, బంధుమిత్రులన్,
రాజ్యనిమిత్తమై సమరరంగమునందు వధించి కొన్న సా
మ్రాజ్యమిదేల ? నేనిఁక నరణ్యములన్ మునినై గడింతు సా
యుజ్యమె," యంచు ధర్మతనయుండు విరాగముతోడ నుండఁగా॥

తే॥ గీ॥ జ్ఞానవిజ్ఞాననిధియైన శాంతనవుఁడు
తత్త్వముపదేశ మొనరించి, ధర్మసుతుని
వ్యాకులత మాన్పి, పట్టాభిషేకమునకు
సమ్మతింపఁ జేసెనుఁ బ్రజల్ సంతసింప॥ ౧౪౯

క॥ వివిధవిషయంబులను గూ
ర్చి వివేకముతో నుపన్యసించుచుఁ, దొలఁగిం
చె వసిష్ఠచ్ఛాత్రుఁడు పాం
డవాగ్రజుని హృదయచింత నలువది దినముల్॥ ౧౫౦

సీ॥ దేవుని గూర్చియు, జీవుని గూర్చి, ప్ర
కృతిని గూరిచియును, సృష్టిఁ గూర్చి,
భూమిఁ గూరిచి, భూతములఁ గూర్చి, భూతద
యను గూర్చి, దాతృత్వమును గుఱించి,
శౌచంబుఁ గూర్చి, యాచారంబుఁ గూర్చి, పు
ణ్యములను గూర్చి, పాపములఁ గూర్చి,
రాజనీతియుఁ, బ్రజారక్షణరీతి, ము
క్తిని దుది నరులు సాధించు రీతి :
యివియు నవియు ననఁగ నేలా? యఖిలవిష
యముల నంపపాన్పునందె యుండి,
కథలతోడఁ, దగిన గాథలతోడ, భీ
ష్ముండుపన్యసించెఁ బండితు నటు॥ ౧౫౧

క॥ మాఘంబున, హతజనదురి
తౌఘంబున, నంతలో సితైకాదశి రాఁ
గా, ఘనుఁడగు దేవవ్రతు
శ్లాఘించుచు నిలిచి రాకసంబున విబుధుల్॥ ౧౫౨

క॥ హరియును, ధృతరాష్ట్రుండు, వి
దురుఁడున్, గాంధారి, కుంతి, ద్రోవదియును, నే
వురు పాండవులును, బంధులుఁ,
బురమునఁ గలయట్టి యెల్ల పురుషులు, స్త్రీలున్॥ ౧౫౩

ఆ॥ వె॥ పిలువకుండనె చని, భీష్ముని చుట్టుఁ జే
తులను గట్టుకొనుచు నిలువఁ బడిరి,

యా మహాపవిత్రు నంత్యదర్శనమును
జన్మసార్థకముగ నలుపఁ దలఁచి॥ ౧౫౪

ఆ॥ వె॥ బాధ లేక, యంపపాన్పున యోగని
శ్చలతతోడ నేత్రములను మూసి,
పవనమతఁడు లోన బంధింప, బ్రహ్మక
పాలభేదనమునఁ బ్రాణమెగసె॥ ౧౫౫

క॥ జ్యోతిర్మయముగ నెగసిన
యాతని ప్రాణంబు, కన్న యందఱు మోడ్పుం
జేతులఁ, దలలెత్తి బొమల
రీతిగ నిలుచుండ, నంతరిక్షము చేరెన్॥ ౧౫౬

ఆ॥ వె॥ అటు ప్రభాసమేతమైన యా జ్యోతి ప్ర
భాసరూపమున నభంబు చేర,
దుందుభిస్వనంబుతోఁ, బుష్పవృష్టితో,
నెదురుకొనిరి త్రిదశులెల్ల నతని॥ ౧౫౭

ఉ॥ శాపవిమోచనమ్ము గని చన్న ప్రభాసుఁడు పూర్వమట్లె స
ల్లాపములాడుచున్ వసువులన్ జతకూడి గృహంబు చేరి, మా
తాపితృపాదవందనము తద్దయు భక్తి నొనర్చి, నూఱు నా
ళ్లై పవళించి యున్న ప్రియురాలిని జూడఁగ నేగ వాళితో॥ ౧౫౮

ఆ॥ వె॥ యోగసిద్ధిపదములొత్తుచు నున్నట్టి
దాసి పడుక గదిని బాసి పోమె ;
డాసి, యాసతోఁ బ్రభాసుండు ముద్దాడె
నిదుర నున్న యా ప్రమద పెదవులు॥ ౧౫౯

ఉ॥ నిద్దురనుండి లేచి, మగనిన్ బిగయారఁ గవుంగిలించి, కిం
చిద్దరహాసమొప్పఁ దల సిగ్గున వంచెను యోగసిద్ధి ; యా
ముద్దియ యింగితంబెఱిఁగి మోదముఁ గూర్చెఁ బ్రభాసుఁడామెకా
యిద్దఱుఁ గన్న సౌఖ్యము రతీశ్వరుఁడే తెలుపంగ నేరుచున్॥ ౧౬౦

క॥ దాసిని లోనికిఁ బిలిచి ప్ర
భాసుఁడు, "నా సతికి నీవు పరిచారికవౌ,
టీసరికి నేనెఱుఁగ సుమి
యోసీ!" యన నామె వినయముట్టిపడంగన్॥ ౧౬౧

వ॥ తన వృత్తాంతంబిట్లని చెప్పం దొడంగె॥ ౧౬౨

తే॥ గీ॥ "ఉండె సంబంధ మొకపరి నుర్వసికి, బృ
హస్పతికి, మన్మథుని యాజ్ఞ కడ్డు లేమి;
గురున, కుర్వసి, కొడవిన కూఁతు నన్ను
గుర్వసి యటందురచ్చరకొమ్మలెల్ల॥ ౧౬౩

క॥ రంభాపుత్రిక యగు నుప
రంభకు, నాకు, సమమైన ప్రాయమగుట, నా
రంభంబునుండియును వి
స్రంభము కలిగినది మాకుఁ బ్రబలముగాఁగన్॥ ౧౬౪

క॥ ఆటయుఁ బాటయు మేమొక
చోటనె నేర్చుకొని, నన్నుఁ జూడ నదియు, న
బ్బోటిని జూడఁగ నేనును,
మాటికిఁ బోవుదుము పాట మానిన వెనుకన్॥ ౧౬౫

శా॥ ఆ కాలంబున నాకలోకమున మీకయ్యెఁ వివాహంబు; నే
నా కల్యాణము నెల్లఁ జూచితిని గన్నారంగ మా యమ్మతో;
మూఁకై పెండ్లికొమార్తె కయ్యెడఁ జెలుల్ ముస్తాబు గావించుచో,
మా కన్యాజనమెల్ల వచ్చితిమి సుమ్మా యమ్మ, నిష్టూడఁగన్॥

ఆ॥ వె॥ పెండ్లి క్రొత్తఁలోనె పిలుపు వచ్చినదుప
రంభయొద్దనుండి, రమ్మటంచుఁ;
గదలి యేఁగితి నలకాపురికమరావ
తిని వదలి, మదీయజనని పంప॥ ౧౬౭

ఉ॥ అచ్చటఁ బెండ్లిముచ్చటల నాడుచుఁ, బెండ్లికొమార్తె రూపమున్
హెచ్చుగ నేను జెప్పఁగ, సహింపనిదై యుపరంభ, "పోగదే!
యచ్చరలందు మిన్న యగు నమ్మ విలాసములీవు చూచి, యా
చచ్చు విలాసముల్ పొగడ సాగెదు: కన్నులు నీకు లేవఁటే?"॥

తే॥గీ॥ అనిన విని, యోగసిద్ధి సోయగముఁ గనిన,
నామె పదములు పట్టుటకైన రంభ
కర్హత నిజంబుగాఁగ లేదంటి నేను;
బ్రక్కగదినుండి కడు మండిపడుచు నటకు॥ ౧౯౯

ఉ॥ కోపముతోడ వచ్చి నలకూబరుఁడెట్టిగ నన్నుఁ జూచి, "యో
నీ పలుగాకి, నీవె పదసేవ యొనర్పుము యోగసిద్ధికిన్,
మాపులు రేపు లొక్కగతి మానక!" యంచు శపింప, నేను ద
చ్ఛాపము వించు నవ్వి, "యిది సంభవమౌనె? కుబేరనందనా॥

ఉ॥ క్రొత్తగఁ బెండ్లియైన కులుకున్ జవరాలి నహర్నిశంబులున్
గుత్తపుఁ గౌఁగిటం బొదవి, గుండెకుఁ దార్చుకొనున్ మగండు: నే
నెత్తటి నీవు నాకు విధియించిన చొప్పున యోగసిద్ధి కా
ళ్లొత్తుదు? నుర్విఁ బుట్ట వలయున్ నినుఁ బోలు వివేకు!" లంచనన్॥

ఉ॥ "ఉర్విని నీవు పుట్టఁగదె యోసి, మదీయవివేకమెంచు నీ
గర్వము కూలునట్టులు! మగండటు జంటగ నంటి యుంటకుం
బార్వతియా ప్రభాసు సతి? భర్తృవియోగము యోగసిద్ధికో
గుర్వసి, కల్ల నున్నదిదిగో! యచిరంబుగ నీ కత్తంబునన్"॥ ౧౭౨

వ॥ అని పలుక నాకలుక పొడమి, "ఓ యలకాధిపకుమారా, బాలికలమగు మా ప్రసంగము నడుమ నడిప్రాయపు మగవాఁడవు నీవడ్డు వచ్చి, మచ్చరంబు హెచ్చి, నన్ను శపించుటయే కాక, నిరపరాధిని యగు యోగసిద్ధికిని ఘోరాపద నాపాదించితివి; నీ కూఁతు హేతువున నా నూతనవధువు వరునకు దూరమగు దుర్గతికిఁ బాలగుచున్నది; నా తండ్రి దేవగురుండేని, నా తల్లి

నారాయణపుత్త్రి యేని, యోగసిద్ధికిఁ బ్రభాసుతో సంయోగము మరలఁ గలుగు వఱకు వరుఁడు మీ యుపరంభకు దొరకకుండుఁ గాక!" యని నేనన, "నోసీ యోగసిద్ధిపదదాసీ, మీ ప్రభాసుండు మర్త్యుండై జన్మించు; నతని మృతికి మూలంబగు వాఁడే మీయుపరంభకు భర్త కాఁగలం," డని నలకూబరుండు ప్రతిజ్ఞ గావించె॥ ౧౭౩

క॥ దినములొక కొన్ని గతియిం
చిన పిమ్మట నుర్వి నేనుశీనరపతికిం
దనయ నయి జితవతి యనం
దనరితి," నన యోగసిద్ధి తద్దయుఁ బ్రేమన్॥ ౧౭౪

తే॥ గీ॥ "రావె రావే! జితవతివి నీవె యఁటవె?
మేనకోడలవు నఁటవె? నేను బెండ్లి
కూఁతు రూపున నినుఁ జూడఁ గోర్కి యంటి;
వరుని వెదకెద," నన్న గుర్వాసి నగుచును॥ ౧౭౫

క॥ "అత్తా, వరుఁడేటికి? నా
చిత్తమునకు నచ్చిన మగశిశువుఁ గనుము: నే
నెత్తుకొని త్రిప్పెదను, నను
గుత్తకు నాసరసుఁడుంచుకొనియెడి వఱకున్॥ ౧౭౬

క॥ రతి ప్రద్యుమ్నుని బెంచిన
గతి నీ సుతుఁ బెంతు; వయసుకాఁడగుచున్ న
న్నతఁడు వరియింపఁగా, రతి
పతియె కలఁడు: గణికకేల పరిణయచింతల్?॥ ౧౭౭

ఆ॥ వె॥ వ్రేలుచెవులు గల్గు స్థూలకర్ణునికుప
రంభ నిత్తురంట! రామ రామ!
యట్టి మగనితోడనా కాఁపురము? బారెఁ
డేసి పెరిఁగె వాని మీసములఁట!॥ ౧౭౮

చ॥ కొడుకును నీవు గాంచు, " మని గుర్వసి కోరిన యట్టులే సుపు
త్రుఁడొకఁడు, విశ్వకర్మ యన రూఢికి నెక్కిన యాతఁ, డామెకుం
బొడమెఁ : బ్రభాసుఁడాసరణిఁ బుత్రయుతుండయి భార్యతో సుఖం
బడి దివి నున్నవాఁడు తన భ్రాతలకెల్లను బ్రీతి గొల్పుచున్॥ ౧౭౯

క॥ ఈ చరితము శ్రద్ధాళుం
డై చదివిన మనుజుని హరి యఖిలవిధములం
బ్రోచును : బ్రభాసశాపవి
మోచనమిది, భీష్మచరితము, హృతదురితమున్॥ ౧౮౦

మంగళమహాశ్రీ॥

ఈ యిల మహాపురుషులెందఱో జనించి దివి
కేగి : రొకఁడందు మన భీష్ముం ;
డాయన వలెం బరమమహా వ్రతముఁ బూనుచు దృ
ఢాత్ములగు మానవులకున్ నా
రాయణుని సత్కృప నిరామయయుతంబగు చి
రాయువు, నఖండయశముల్, సు
శ్రీయును, సుఖంబులు, విశేషముగఁ గల్గి, తుదిఁ
జేకుఱును మంగళమహాశ్రీ॥

---

తెనుఁగున భారతంబనువదించిరి మున్ను కవిత్రయంబువా :
రనఘులు, వారి పాదముల నౌదలఁ జేరిచి, దానిలోని భీ
ష్ముని చరితంబు క్రొత్తదనముం గలుగంగను వ్రాసినాఁడ నే
ర్చిన గతి సెట్టిలక్ష్మీనరసింహసమాఖ్యుఁడ, ధీరసఖ్యుఁడన్॥

సర్వసాహిత్యసమ్రాట్టు జయపురజన
కాంతు నాస్థానకవిని, దదంతరంగ
కార్యదర్శిని, దన్మహౌదార్యగరిమ
లబ్ధకవిభూషణబిరుదలాంఛనుండ॥



కేసరీముద్రాక్షరశాల, చెన్నపురి.